ఉగాది శుభాకాంక్షలతో!

## ఖచ్చితంగా గ్రోమోర్ ఎరువులే కొనండి

ఇదే గ్రోమోర్ గుర్తు









గ్రోమోర్
28-28-0

గ్రోమోర్
14-35-14

FDS-CFL-783 TEL

చేనుకు చేవ, రైతుకు రొక్కం - గ్రోమోర్

# ఆంధ్రపత్రిక

## రుధిరోద్గారినామ సంవత్సరాది సంచిక

[డెబ్బది మూడవ సంచిక]

[1983-'84]

వ్యవస్థాపకులు : శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

[1938 - '72]



సంపాదకుడు : శివలెంక రాధాకృష్ణ

వెల రూ. 6-00


అంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము

**Supplement to Andhra Patrika Issue Dated 14-4-'83**

**Regd No. Y/VJ No. 49.**

# రుధిరోద్గారినామ సంవత్సరాది సంచిక

# విషయానుక్రమణిక

**సంచిక : 73** **సంవత్సరము : 1983-'84**



ముఖచిత్రం : శ్రీ వై. బాలయ్య

# స్వవిషయం

దుందుభినామ సంవత్సరంలో తెలుగువారి రాష్ట్రంలో ఒక పెద్ద మార్పు వచ్చింది. ఇక్కడ మొదటిసారిగా కాంగ్రెసు ప్రభుత్వం పోయి ఒక ప్రాంతీయ పక్షం అధికారంలోకి వచ్చింది. శ్రీమతి ఇందిరా గాంధీ తరుచు ముఖ్యమంత్రులని మార్చి ఆపదవి విలువ తగ్గించటం వల్లనయితేనేమి, కాంగ్రెసు (ఇందిర) పార్టీ పరిపాలనలో అవినీతి అధికంగా ఉందన్న భావం జనసామాన్యంలో పెరగటం వల్లనయితేనేమి, "తెలుగుదేశం" పార్టీ స్థాపకుడు శ్రీ రామారావు ప్రముఖ సినిమానటుడు కనుక ఆయన వోటరులలో అధిక సంఖ్యాకులని ఆకర్షించగలగటం వల్లనయితేనేమి తమిళ నాడులో, కర్ణాటకలోవలే ఆంధ్రప్రదేశ్‌లోనూ కాంగ్రెసు పార్టీ వారిది కాని ప్రభుత్వం ఏర్పడింది. 1975లో శ్రీమతి గాంధీ అత్యవసర పరిస్థితిని అమలులోకి తీసుకువచ్చారు. అంతకి ముందు ఆమె న్యాయస్థానంలో తమ ఎన్నికల కేసు ఓడిపోయారు. ఎమర్జెన్సీ విధింపుకి ఇదే ముఖ్యకారణం అని అప్పుడూ ఇప్పుడూ కూడా అనిపించటంలో ఆశ్చర్యంలేదు. అత్యవసర పరిస్థితి కాలంలో జరిగిన అక్రమాలు 1977లో ఆమె పతనానికి దారితీశాయని అప్పటిలో ఎందరోఅనుకున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో, కర్ణాటకలో ఆమె గెలవటం మాత్రం చాలామందికే ఆశ్చర్యం కలిగించింది. తెలుగువారికి ప్రజాస్వామ్యం విలువ అంతగా అర్థం కాలేదని బాధపడిన వారి సంఖ్యకికొదువలేదు. శ్రీమతి గాంధీ ఏమనుకున్నారోకాని ఆమె ఆంధ్రప్రదేశ్‌లో (తక్కిన రాష్ట్రాలలోవలెనే) రాజకీయ వాదులుగా అనామకులనతగినవారిని ముఖ్యమంత్రి పదవిలో ఉంచి తమకి ఇష్టం వచ్చినట్లు వారిని మార్చటం మొదలు పెట్టారు. దీనివల్ల రాష్ట్రంలోని రాజకీయాలలో శూన్యం వంటిది ఏర్పడిందంటే అతిశయోక్తి కాకపోవచ్చు. "తెలుగుదేశం" ఈ శూన్యంలోకి ప్రవేశించ గలిగిందంటే కూడా అతిశయోక్తి కాకపోవచ్చు. ఈ రాజకీయ పక్షం ఒక ప్రాంతీయ పార్టీగా చెలామణి అవుతోంది. తెలుగు వారికి ప్రాంతీయ భావాలు కొత్తకాదు. రాయలసీమవారు, తెలంగాణావారు ప్రాంతీయ తత్వాన్ని ప్రచారం చేసిన వారే. ఆంధ్రప్రదేశ్‌లో 1969లో, 1972లో రెండు పెద్ద అపసరణ ఉద్యమాలు చెలరేగాయి. (ఈ రెండు ఉద్యమాల సందర్భంలోనే కాకుండా అంతకు ముందు జరిగిన ఉక్కుమిల్లు ఉద్యమంలో కూడా కాంగ్రెసు నాయకులు ప్రదర్శించిన వైఖరి ప్రశంసలని అందుకోతగినదిగాలేదు.) 1983 శాసనసభ ఎన్నికలలో పనిచేసిన ప్రాంతీయ భావం ఏమిటో అర్థంకాదు కాని దానికి చలనచిత్రాల ప్రభావం, శ్రీమతి గాంధీ అనుచరుల అసమర్థత బాగా తోడుపడ్డాయనటంలో సందేహం లేదు. తమిళదేశంలో కొంత కాలంగా కొందరు కొన్ని ద్రావిడ సిద్ధాంతాలని ప్రచారం చేస్తున్నారు. అటువంటి సిద్ధాంతాలని ప్రచారం చేసే రాజకీయ పక్షాలు నేటి తమిళనాడులో గెలవటానికి కీ. శే. చక్రవర్తి రాజగోపాలాచారిగారు, శ్రీమతి ఇందిరాగాంధీ ఎంతయినా తోడ్పడ్డారు. కనీసం రాజగోపాలాచారిగారు కాంగ్రెసుని వదులుకుని ద్రా. ము. క. గెలుపుకోసం కృషి చేశారు. శ్రీమతి గాంధీ "కాంగ్రెసు"లో ఉంటూనే తమతోటి కాంగ్రెసు నాయకుడు కీ. శే. కామరాజ నాడారు ఓటమికి సహాయపడ్డారు. ఆమె అనుసరించిన విధానాలవలననే తమిళనాడులో కాంగ్రెసు పార్టీ ఏదీ గెలవలేక పోతోందంటే సత్యదూరం కాదు. తెలుగువారి రాష్ట్రంలో తమిళనాడులో వలే ద్రావిడ సిద్ధాంతాలకి అంతగా ప్రాచుర్యం ఉన్నట్లుతోచదు. అసలు ఆంధ్రులలో భారత జాతీయాభిమానాలు ఎప్పుడూ కొరవడలేదు. ఏ విధంగా చూసినా ఆంధ్రులు భారతీయులే. వారికి తమిళనాడులో ఎవరో కొందరు చాటే వింత ప్రాంతీయ వాదాల వెనుక దాక్కునే అవసరం లేనేలేదు. (తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ రామచంద్రన్ ఒకప్పుడు శ్రీమతి గాంధీవయిపు చేరి తోటి "ద్రావిడ వాది" శ్రీ కరుణానిధి పతనానికి కారకులయ్యారు. ఈ సందర్భంలో గుర్తుచేసుకోవచ్చు. శ్రీ కరుణానిధి కూడా అవసరం వచ్చినప్పుడు శ్రీమతి గాంధీతో ఒప్పందాలు కుదురు కొనటానికి వెనుకాడనే లేదు.) భారతీయులుగా ఉంటూనే ఆంధ్రులు తమ ఆత్మగౌరవాన్ని కాపాడుకోవలసి వచ్చినప్పుడు కాపాడుకోవచ్చు. తెలుగువారి సంస్కృతికి ప్రతిబింబంగా ఉండటమే ఆంధ్రపత్రిక ధ్యేయం. తెలుగువారు భారతీయులు ప్రపంచ పౌరులూ కూడా! వారిది తక్కిన ప్రపంచంతో సంబంధంలేని లోకం కానేకాదు. తెలుగువారి ఆదరాభిమానాల వల్ల ఇన్ని దశాబ్దాలపాటు ఆంధ్రపత్రిక ఉగాది సంవత్సరాది సంచికలని ఇంత విజయవంతంగా సక్రమంగా వెలువరించగలుగుతు వచ్చింది. ఇకముందు కూడా ఆంధ్రపత్రికకి చదువరుల, రచయిత (త్రు)ల, చిత్రకారుల ఆదరాభిమానాలు లభించగలవని ఆశిస్తున్నాము!

—*⁂*—

# నన్నయకు నమస్సుమాంజలి

శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

సీ॥ ఉపల శాసనములం దొదిగి యుండిన తెల్గు
పద్యమ్మునకు పూలబాట పరచి
కమ్మని దేశి తనమ్ము రెమ్మలు వేయ
తెలుగు మాటకు తేనె తీపి గూర్చి
నూతన కాంతి బంధుర కళాంచితముగా
తెల్గు కైతకు రత్న దీపమెత్తి
గాసట బీసట గాథలు విను తెల్గు
వారికి భారత పఠన మప్పి

గీ॥ ఆదికవి యని విఖ్యాతినందినావు
శబ్దశాసన! శుభ నిత్య సత్యవచన!
మతి సురాచార్య! సతత సమ్మానితార్య!
నా నమస్సుమాంజలి గొను నన్నపార్య!

సీ॥ సారమతి కవీంద్ర సంభావ్య రీతి ప్ర
సన్న కథాయుక్తి సంతరించి
పండిత మండలి ప్రస్తుతించు విధాన
అక్షర రమ్యత నాదరించి
సహృదయాహ్లాద ప్రసాద భాసురముగా
రుచిరార్థ సూక్తులు ప్రోదిసేసి
సకల జనామోద సంధాయకమ్ముగా
భారత సత్కృతి పరిఢవించి

గీ॥ తెలుగు పలుకు వెలందిని కొలిచినావు
తెలుగులో కృతి రచన సాధించినావు
తెలుగు కీరితి జగతిని నిలిపినావు
నన్నయ కవీశ! ధన్యతోన్నయ నివేశ!

సీ॥ గోదావరీ జలాస్వాద మాధుర్యము
తొలకులాడినది నీ పలుకులందు
గోదావరీ వీచి నాదసౌందర్యము
సవరించె నీ శబ్ద సౌష్ఠవమున
గోదావరీ ఝరీ గుప్త గాంభీర్యము
మక్కళించినది నీ మానసమున
గోదావరీ స్వచ్ఛ గుణ సాహచర్యము
చెంగలించినది నీ జీవితమున

గీ॥ రాజిత యశోవిలాస నిర్మాణ రాజ
రాజ సత్సభా సరసీ-మరాళ రాజ!
నయ మనోజ్ఞ గుణోదయ! నన్నయ కవి
కుంజరా! మామక నమస్సుమాంజలు లివె

క॥ శారద చంద్రిక, సిత క
ర్పూర పరాగమ్ము, కలువ పూవుల తావుల్
సారించిన నీ కవితా
శ్రీ రమ్యత మాకు నిత్య సేవ్యము సుకవీ!



శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

# విశ్వనాథవారి చిన్నకథలు

విశ్వనాథవారి తొలి రచనల్లో కనిపించే భావ సౌకుమార్యము, స్వేచ్ఛా ప్రియత్వము, వ్యక్తి వైశిష్ట్య నిరూపణము, సౌందర్యా రాధన, తర్వాతి రచనల్లో భావ ప్రౌఢిమగా, సంప్రదాయ ప్రియ త్వంగా, వ్యవస్థా నిరూపణముగా, భగవద్భక్తిగా పరిణామంచెంద డంవల్ల, చాలమంది పాఠకులకు, ముఖ్యంగా యువకులకు, ఆయన తొలిరచనలు నచ్చినంతగా చివరి రచనలు నచ్చవు. తొలి రచనల్లో కిన్నెరసాని పాటలు, ఏకవీర ప్రసిద్ధమైనవి. ఆకోవలోకే వస్తాయి ఆయన వ్రాసిన చిన్న కథలు కూడ.

విశ్వనాథ వారిది అంతర్దృష్టి. మనస్సు అంతరాంతరాల్లో ఎన్నో లోకాలు. ఇద్దరి మనస్సుల కలయిక, రెండు వ్యక్తిత్వాల సమన్వయమూ, కేవలం బాహ్య పరిస్థితుల మీదే దృష్టి నిలిపి నిర్ణయాలు చేసే వారి అవగాహనకు రావు. వీరేశలింగంగారి వితంతు వివాహ సంస్కరణకు విశ్వనాథ వ్యతిరేకి కాడు. అయితే పునర్వివాహము సుఖప్రదము కావడానికి స్త్రీ పురుషుల్లో కలుగ వలసిన మనః పరిణామ మెటువంటిదో విశ్వనాథ సున్నితంగా చిత్రించిన కథ 'తిరోధానం'. అందంగా, గొప్ప శిల్పంతో తయా రైన కథ యిది. మహాశ్వేత అనే అమ్మాయి పదహారో ఏట భర్త నీలలోచనుడు మరణించాడు. ఇప్పుడు ఆమెకు పద్దెనిమిదో ఏడు జరుగుతున్నది. కాని భర్త వ్యక్తిత్వపు ముద్ర ఆమె మనస్సును వదలలేదు. మొదటి నుంచీ శ్వేతకూ ఆమె భర్తకూ, వ్యక్తిత్వాల మధ్య వైరుధ్యమే తప్ప సమన్వయం ఏర్పడనేలేదు. "ఆమెకు మల్లెపూవనిన యిష్టము. అతనికి మందార పుష్పము మీద నభి మానము. ద్విధా ప్రసృతంబులగు వారి జీవన వాహినులు పాపము, కలియలేదు." అంటూ ప్రారంభించి, విశ్వనాథ, శ్వేత మనస్సులో తెలుపుకీ ఎరుపుకీ జరిగే సంఘర్షణలని అతి సుకుమారంగా చిత్రిం చారు. (ఏకవీర మనస్సులో ప్రేమకూ ధర్మానికీ జరిగే సంఘర్ష ణని చిత్రించిన తీరు గుర్తు వస్తుంది.) చివరకు శ్వేతతోటలో పెరుగుతున్న మందార మొక్కని ఆమె పెంపుడు లేడిపిల్ల చిగుళ్లు మేసి ఎదగనీకుండా చంపివేస్తుంది. ఆ తరుణంలో శ్వేత జీవితంలో ప్రవేశించిన రాధారాముడు తెల్లగులాబీలతో ఆమెను పలుకరిస్తాడు. తెల్లగులాబీలతో ప్రారంభమైన వారి స్నేహం, ఏడాది తర్వాత ప్రేమగా వివాహంగా పరిణమిస్తుంది. ఈ కథనంలో సంభాషణలు లేవు. మనస్సు కదలికలు మాత్రమే ఉన్నాయి. "శిశిరము వెనుక బట్టినది. మందారము పూయుట మానినది. మల్లి తీవ విరబూచినది. ఆ పూదోటలో శ్వేత యొక యుత్తరము చదువుకొనుచు నడచు చున్నది .... జరీ పోగులుగల తెల్లని పట్టుచీర ఆమె యొడలిపై శరత్కాల మేఘశకలమువలె వాయుధూత మగుచున్నది." నీల లోచనుని మబ్బువిడిచిన శ్వేతను రాధారాముడు "ఆమె చుబుకము నెత్తి ఎర్రని పెదవులపై నొక చుంబనము చేసినాడు. అప్పటి ఆనంద పారవశ్యమున అప్రయత్నముగా శ్వేత కన్నులు మూత పడినవి. శ్వేతకు చప్పున తెలివి వచ్చినది. నీలలోచనుడు కనబడ లేదు .... అది మొదలు జీవితాంతము వరకు మరల నామెకు నీలలోచనుని రూపము కనిపించలేదు." శ్వేత పునర్వివాహాన్ని విశ్వనాథ మనసా ఆమోదించారు.

స్త్రీ పురుషుల మధ్య ప్రణయానికి, అంటే వారి వ్యక్తిత్వాల సమన్వయానికి సౌందర్యం, అంగ సౌష్ఠవం ఎంతవరకు ముఖ్యం; అనే ప్రశ్నకు సమాధానం 'పరిపూర్తి' అనే కథలో విశ్వనాథ అన్వేషించారు. రాధ నలుపు. ఆమెకు కంటి చూపు కూడా లేదు. చంద్రశేఖరుడామెను వివాహమాడినాడు. రాధకు మనస్సులో కొరత, తాను భర్తకు తగిన దానిని కానని. ఆమెకు పుత్రోదయం అయింది. "అబ్బాయి కళ్లు, అచ్చముగా మీ కళ్లవలె ఉన్నవటగా" అన్నది రాధ. "అబ్బాయి, నీకు కళ్ళు వచ్చినట్టులున్నాడు" అని చంద్రశేఖరం అనడంతో రాధ ఆనందం 'పరిపూర్తి'కి వచ్చింది.

చిన్న పిల్లల మీద మమకారం పిల్లలు లేనివారికి మరీ ఎక్కువ. మీనాక్షీ సూర్యనారాయణ దంపతులు పొరుగువారైన అనసూయా వేంకటేశ్వరులతో స్నేహం నెరపుతూ వారి సంతాన కృష్ణమూర్తిని మచ్చిక చేస్తారు. వేసవి సెలవుల్లో వాణ్ణి తమ స్వగ్రామం తీసుకు వెడతారు. అక్కడ అకస్మాత్తుగా జబ్బుచేసి ఆ

పిల్లవాడు మరణిస్తాడు. టెలిగ్రామ్ యిచ్చినా, అనసూయా వేంకటేశ్వర్లు వేళకు అందుకో లేకపోతారు. అంత్య క్రియల తర్వాత వస్తారు. వేంకటేశ్వర్లు నిష్ఠూరంగా మాట్లాడతాడు. ఇది జరిగిన మూడేళ్ళ తర్వాత, అంతదాక సంతానంలేని మీనాక్షికి కొడుకు పుడతాడు. కృష్ణమూర్తి అని పేరు పెడతారు. కాని ఆ పిల్లవాని మీద మీనాక్షికి అశ్రద్ధ. వాణ్ణి అనసూయా వేంకటేశ్వర్లు శ్రద్ధగా చూస్తారు. వాడు కూడా జబ్బుచేసి చనిపోతాడు. వాడి అంత్య క్రియల్ని వేంకటేశ్వర్లనే చేయమంటాడు సూర్యనారాయణ. "నీ రుణం తీర్చుకున్నాబాబూ" అంటాడు. అదే కథాశీర్షిక. కాని విశ్వనాథ కథను అంతటితో ముగించలేదు: అటుతర్వాత మీనాక్షికి పోయిన అందం, ఆరోగ్యం మళ్ళీ వచ్చినట్లూ, ఆమె భర్తమాక్రం నూభై అయిదేళ్ళకే మరణించి నట్లూ ముగింపు వాక్యాలున్నాయి. ఈ ముగింపుకి స్ఫూర్తి అన్వయం కథలో లభించదు: హఠాత్తుగా మరణించిన కరో పసివాని కథ- పుణ్యప్రేమము- ముగింపులో విశ్వనాథ వెలిబుచ్చిన ఒక అభిప్రాయంతో పై కథను అన్వయించుకో వచ్చునేమో అని తోస్తుంది. 'పుణ్యప్రేమము' కథలో దంపతులు సుభద్ర కృష్ణరాయలు. వీరి ప్రణయాన్ని వచనకవితగా వ్రాశారు విశ్వనాథ. ప్రకృతితో బాటు అందాన్నీ, ఆనందాన్నీ సంతరించుకున్న వారి ప్రణయం సంతానప్రాప్తిలో పర్యవసిస్తుంది. కాని ఆ బిడ్డ హఠాత్తుగా మరణిస్తాడు: ఆ నిర్వేదంలో భార్యాభర్తలు ఎవరికి వారు తమలో ఏదో తెలియని కళంకం ఉన్నట్లు ఊహించుకుంటారు. సుభద్ర పుట్టింటికి వెళ్ళి రోగగ్రస్తమై మరణిస్తుంది. కృష్ణరాయలు సన్యాసియై కాశీ చేరతాడు. అక్కడ ఒకమృతశిశువుని పాతిపెడుతున్న దంపతుల్ని చూచి వారితో అంటాడు: "శిశువులు దీర్ఘాయువులగుటకు తల్లిదండ్రుల ప్రేమనిష్కల్మషమై ఉండవలెను. ఆ నిష్కల్మషత ఎట్లు పాటించవలెనో మనకు తెలియదు." చిన్న పిల్లల మరణాన్ని గూర్చిన యీ తీర్పు విశ్వనాథే యిస్తున్నట్లు తోస్తుంది. అందులో రచయిత గాఢమైన స్వానుభవం ఏదో నిక్షిప్తమైనట్లూ అనిపిస్తుంది:

'ఏమి సంబంధం!' అనే కథలో, చిన్నతనంలో, యౌవనంలో, తర్వాత అంత్యదశ అయిన మరణావస్థలో ఒక యువతి తనకు తారసిల్లగా, లౌకికంగా ఏ సంబంధమూలేని ఆ యాదృచ్ఛిక సన్నివేశాలద్వారా తనలో కలిగిన అనుభూతిని ఒక యువకుడు వర్ణిస్తాడు. ఆమెకు శవవాహకుడుగా ఉండి తిరిగి వచ్చిన ఆ యువకునికి ఆరాత్రి ఒక కలవస్తుంది. అందులో మళ్ళీ చిన్ననాటి సన్నివేశం: పదేళ్ళ కొంటె పిల్లగా సీమమిరపకాయ అతని చేత తినిపించి, అతను కారంతో నోరు మండి బాధపడగా ఆమె నవ్విన సన్నివేశమే పునరావృత్తమైంది. నిద్రమేల్కొని చూస్తే అగ్ని మండలపు పురుగు అతని నాలుకనూ పెదవినీ కుట్టింది: కథలో కేవలం ధ్వని మాత్రంగా నిలిచి పోయిన ప్రణయ భావమూ, ప్రణయానికి పర్యవసాయిగా పెదవిని కరచి పుండు చేసిన అనుబంధపు ముద్రతో కథ ముగింపూ, ఆలోచించే కొద్దీ మనస్సును కవ్విస్తాయి. మనస్సులు ఏ దూర తీరాల్లో కలుసుకుంటాయో, వ్యక్తిగత సంబంధాలకు సరిహద్దు లెక్కడో ఎవరు చెప్పగలరు?

విశ్వనాథ వారి కథల్లో జాతీయతను నిర్వచించే ప్రయత్నం చేసిన విశిష్ట రచనలు రెండున్నాయి: 'యోర్హిషీషెయ్' నీగ్రో కవి కథ. ఫ్రెంచి వారాక్రమించిన కాంగోలో 'కిసాలికా' ఒక సన్నని పిట్ట. 'కివు' ఒక సరస్సు. ఆ పిట్ట ఆ సరస్సు మీద ఎగురుతుంది. పాడుతుంది. మరోచోట కనిపించదు. 'ఇటురీ' నదీ జలాలు లోయలో ఆకులమీద పడేటప్పుడు కలిగే ధ్వని, కిసాలికా కంఠ ధ్వని వలె ఉంటుంది:

"కివుపై కిసాలికా, కివుపై కిసాలికా
ఇటురి ఆకులపైన చిటిలిపడు కిసాలికా
ఫ్రాంసుల తుపాకికై ప్రాణముల వదలెదవో
కివు నీట నీ శవము కువకువలు సేయునో
కివు మీద కిసాలికా, కివుపైని కిసాలికా

నీవు కివు కలిసెదవు, నేను కివు కలిసెదను
మన తియ్యనగుపాట మాయమై పోవునా?
నీనా మధుర గీతి నిలిచి యుండును లెమ్ము
కివు మీది కిసాలికా, కివుపైని కిసాలికా..."

హిషిషెయ్ ఈ పాట వ్రాసిన కవి. అతని పాటలు ప్రజలలో ప్రాచుర్యము పొందెను. విదేశీ ప్రభుత్వము అతణ్ణి కారాగారములో పెట్టింది. అతణ్ణి తగుల బెట్టినచోట కాంగో దేశస్థులకు పవిత్రస్థలమైంది. అతని ఆత్మ కాంగోనదిలో ఐక్యమందెనని వారు నమ్ముతారు. జాతీయత అంటే సంస్కృతికీ మతానికీ భిన్నమైనది కాదు. సంస్కృతి అంటే, మతమంటే, ఆ దేశపు నదులలో, పక్షులలో, మనుష్యులలో, వారి జీవితానుభూతిలో జీవన సరళిలో అంతర్లీనమైన సంస్కార విశేషము. దానిని బందీ చేయుట అంటే అది తాత్కాలికం మాత్రమే. ఈ భావాన్ని చివరి

మారుపేరు నెర్విటాల్®

అన్నివయసులవారికి
అన్నిఋతువులలో
అమితోత్సాహమును అందించు
అసమానఆయుర్వేదటానిక్
నెర్విటాల్®




50 సంవత్సరముల నుండి ఆయుర్వేద ఔషధముల తయారీలో ప్రసిద్ధిచెందిన శ్రీ దూబగుంట సుబ్రహ్మణ్యంగారి పరిశోధనాఫలితమే నెర్విటాల్® ఆయుర్వేద శాస్త్రములో అతిగుణవత్తరమైన మూలికలు విలువైన భస్మములు పలుపుష్ప సారములు కలిపి తయారుచేసిన టానిక్ నెర్విటాల్® నరముల బలహీనత నిస్త్రాణ, రక్తక్షీణత, గుండెదడ మొదలగు వ్యాధులకు చక్కని గుణకారి జీర్ణశక్తి నిగారా పెంపొందించును. ఆయుర్వేదములో గొప్పచికిత్స పురుషశక్తి వాజీకరము కలిగించుటకు ఆయుర్వేదశాస్త్రం పెట్టిందిపేరు. స్త్రీలు గూడ సేవించవచ్చును.

తయారు చేయువారు:
వైద్యాచార్య డా॥ D. రాధాకృష్ణమూర్తి B.Sc
ఇండియన్ మెడిసిన్ హౌస్

**25**
సంవత్సరములుగా
ప్రసిద్ధిచెంది రజతోత్సవము
జరుపుకొనుచున్నది

వర్తకసోదరులకు రజతోత్సవ సందర్భములో అనేక బహుమతులు ప్రకటింపబడినవి. వివరములకు నేడే వ్రాయండి

సంసారజీవిత బలహీనతలను
పోగొట్టుటకు వైద్యులందరిచేత
సిఫార్సు చేయబడుచున్నది
నెర్విటాల్®

ఒరిజనల్ నెర్విటాల్® మూడు సైజులలో లభించును.
450 ml. 220 ml
110 ml.




లేబిల్ పైన రిజిష్టరు నెం. 256479
డా॥ D రాధాకృష్ణమూర్తి ఇండియన్ మెడిసిన్ హౌస్ అనివున్నదే
ఒరిజనల్ నెర్విటాల్®

సోల్ డిస్ట్రిబ్యూటర్స్:
# మాన్‌ఫార్మా ఏజన్సీస్
ఏలూరు రోడ్. విజయవాడ-2 P.B.NO.353.


శ్రీలలితా మూవీస్
ఆలయ శిఖరం
కలర్
కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం:
కోడి రామకృష్ణ
నిర్మాత:
జి. జగదీష్ చంద్రప్రసాద్ బి.ఎ.
అన్నపూర్ణ

దృశ్యం - నీటి గుర్రాన్ని ఉచ్చులు పన్ని మనుష్యులు తెలివిగా బంధించిన దృశ్యం ద్వారా ధ్వనిస్తూ కథ ముగించారు విశ్వనాథ. రెండవకథ 'జీవుడి యిష్టము.' ఒక సైనిక నియంత తాను పెత్తనం వహిస్తున్న ద్వీపంలో స్త్రీని చెరపట్టి, ఆమె భర్తను, కొడుకును, పసిపిల్లలను చంపి, ఆమెను వశపరచుకోవాలని ప్రయత్నిస్తాడు. ఆమెను బలవంతంగా అనుభవిస్తాడు. కాని ఆమె మనస్సుని మాత్రం జయించలేకపోతాడు, విసిగి ఆమెను చంపుతాడు. మరణిస్తూ ఆమె అడుగుతుంది: "నేను చనిపోయిన తర్వాత ఏమి చేస్తావు?" "ఇంకొక స్త్రీని సంపాదిస్తాను" అంటాడతను. "నీకు తగిన మాట. నీ జాతికి జీవుని యిష్టము తెలియదు" అంటుంది. తుపాకులెరగని ఆ ద్వీపవాసులు నాగరక ప్రపంచానికి చెందిన నియంత కంటె ఎలా ఉన్నతులో 'స్వేచ్ఛ' స్వరూపమేమిటో ఈ కథలో చెప్పబడింది. ఆమె ఒకచోట అంటుంది: "మాజాతిలో తెలివికి, ధైర్యానికి ఎక్కువ భేదం లేదు. మా న్యాయమే తెలివి. తెలివే ధైర్యం." న్యాయానికీ తెలివికీ సంబంధం లేంకుడా పోయిన నాడు, మానవుని బాహ్య నాగరకత ఎంత అభివృద్ధి చెందినా పతనం తప్పదు. సామ్రాజ్యాలను విస్తరింప జేసుకున్న పాశ్చాత్యుల 'వలస' నాగరకతను గూర్చి నిశిత విమర్శ ఉన్నది ఈ కథల్లో.

'ఆద్యంతములు' అనే కథ విశ్వనాథ మేధాశక్తికి గీటు రాయి. గహనమైన తత్త్వ వివరణే కాకుండా, అంగిరశ్శీలి మహర్షికి శిష్యుని మీదగల ప్రేమా, సిద్ధాంతాభిమానమూ ఎలా మృత్యు హేతువులయ్యాయో చూపుతూ, నాస్తిక - ఆస్తిక దృక్పథాల సంబంధాన్నీ, విభేదాన్నీ ఒక చిన్న కథలో యిముడ్చటం గొప్ప విజయం. 'సప్తాశ్వము' అనే కథలో ఉరితీయ బడుతున్న ఏడు గురు విప్లవ వీరుల మరణ వాఙ్మూలాల ద్వారా విశ్వనాథ విప్లవ స్వరూపాన్ని వివరించడం ఆలోచన పురికొల్పుతుంది. నేటికీ సజీవమైన రచనయిది. 'మాక్లీ దుర్గంలో కుక్క' ఆధునిక నాగరకత మీద నిశిత విమర్శ. మనిషి మాటలకూ చేతలకూ సంబంధం లేక పోవడం దగ్గర్నుంచీ, దాక్షిణ్య రాహిత్యమూ, హింసా, నాగరక మానవ ప్రవృత్తిలో చోటుచేసుకొని మానవ నైజాన్నే కలుషితం చేశాయనీ, తుదకు సర్వత్రా కనిపించే ఈ కాలుష్యం భరింపరానిదై, మనుష్యునితో కలిసి మనుగడ సాగించే కుక్క జాతి కూడా మానవుణ్ణి వదలి అడవికి తిరిగి వెళ్ళిపోయే పరిస్థితి ఏర్పడుతున్నదనీ వ్యంగ్యంగా విమర్శించారు. అలాగే 'ముగ్గురు బిచ్చగాళ్లు' కథలో ప్రజాస్వామ్య వ్యవస్థనడిచే తీరును బిచ్చగాళ్ళ రాజ్యంగా చిత్రించారు. "మానవజాతి రెండే రకాలు. ఒక రకం సంసారులు, రెండవరకం బిచ్చగాళ్లు. తానేదో న్యాయంగా సంపాదించు కుంటాడు, తింటాడు, లోకాన్ని ఉద్ధరిస్తానని బయలు దేరడు. ఇట్లాంటి వాడు సంసారి. అధికారులనండి, మతగురువు లనండి, రాజకీయ వేత్తలనండి, కవులనండి, గాయకులనండి, వీళ్ళంతా బిచ్చగాళ్ళు. సంసారుల మీదే బ్రతికే వాళ్ళు బిచ్చగాళ్ళు!" అని సూత్రీకరిస్తాడు బిచ్చగాళ్ళ వ్యవస్థకు నాయకుడు. ఆలోచనకు పదునుపెట్టే విశిష్టమైన వ్యంగ్య రచన యిది.

తొలినాటి విశ్వనాథ కవీ భావుకుడే కాదు, కొత్తమార్గాల్లో ఆలోచించగల మేధావి అని కూడా ఈ చిన్ని కథలు రుజువు చేస్తున్నాయి.



# జయ గీతి

## శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

జయము జయము తెలుగుతల్లి!
కనక ధరిత్రీ మతల్లి!
కామితార్థ కల్పవల్లి!
శోభిత పుర పల్లి!

పురోగామి పంచకోటి
నరనారీ గళపేటీ
నదిత యశో గాన వాటి!
మణి రాజిత పాదసిరి!

సస్య శ్యామల విశాల
కైదారిక రత్నశాల!
కూలంకష నవ వినీల
జీవనదీ దివ్యహేల!

కర్షక కార్మిక శరీర
గళిత ఘర్మ కణ హారా!
గాయనీ కవీంద్రాధర
క్రమ రాగ వాగ్ధారా!

వికసిత కుసుమా నోకహా
మంద మధుర గంధ వాహా!
లసదజంత పద సమూహా
లలిత నాద పరీవాహా!

జయము జయము తెలుగుతల్లి!
కనక ధరిత్రీ మతల్లి!
కామితార్థ కల్పవల్లి!
శోభిత పుర పల్లి!



నేడు జిలుగు వెలుగుల దీపాలంకారం చంద్ర తో మీ సంసారం నిత్యాలంకారం
































ఎలక్ట్రానిక్ పరికరములపై గ్యారంటీ.

సకాలములో నిపుణులైన ఇంజనీర్లచే సర్వీసింగ్ మా ప్రత్యేకత.

# చంద్ర & కో.

4/10, బ్రాడీపేట ఫోన్ నెం: 24469 గుంటూరు-3.

శ్రీ మాదిరాజు రంగారావు

# నవల - లక్ష్యం

మానవ జీవిత లక్ష్యమే నవలదీ. మరే ప్రక్రియకూ లేని సౌలభ్యం దీనికుంది. ఎన్నో విషయాలను ఏదో ఒక విధంగా సమీకరించడాని కవకాశం ఎక్కువ. కవిత్వం నాటకంలో కొన్ని పరిమితులవల్ల నియతం కావలసి ఉంటుంది. కథ, వ్యాసం, నాటకం, కవిత్వం, జీవిత చరిత్ర మొదలైన అనేక ప్రక్రియల సమాహార భూతమైన విశిష్ట ప్రక్రియ కావడంతో, ఆయా అంశాల ప్రభావం అనివార్యం. ఇది ఇటీవలి ప్రక్రియ కావడంతో ఈ అభిప్రాయానికి అవకాశం కలుగుతూంది. దీనివల్ల అధిక పరిజ్ఞానానికీ అనుభవ విస్తృతికీ అవకాశం ఎక్కువ ఉంటుంది. కథలోని సందేహం, వ్యాసంలో చింతన, పరిశీలనం, నాటకంలోని సంభాషణ పాత్ర చిత్రణం, ఇతివృత్త నిర్మాణం, కవిత్వంలోని అనుభూతి సాంద్రత, భావచిత్రణం ఇంకా ఆయా ప్రక్రియలకు సంబంధించిన అనేకాంశాలు అక్కడక్కడా అనుభవానికి రావచ్చు. అయినప్పటికీ, సృజనాత్మక సాహిత్యంలో గొప్ప విజయాన్ని సాధించిన కళారూపంగా స్థిరపడింది. ఈ కారణంగా, నవల లక్ష్య సాధనలోనూ క్షేత్ర విస్తృతిని పొందడం సహజం. నవల, కవిత్వంతో నాటకంతో పోల్చిచూస్తే చాలా ఇటీవలి ప్రక్రియ కావడంతో పూర్వ ప్రక్రియల ప్రభావం అనివార్యం. చారిత్రకంగా పరిశీలించిచూస్తే, ప్రతి ప్రక్రియను గురించీ ఈ విధంగా భావించవచ్చు. చాలా స్వల్ప కాలంలో, ప్రశస్తమైన స్వతంత్రమైన సాహిత్య శక్తిగా రూపొందడం విశేషం. దీనికి కారణం - ఈ ఆధునిక యుగం అవసరాలకు ఎంతో సరిపడింది కావడమే.

జీవితంలోని విస్తృతి, వైవిధ్యం, లోతు, పరివర్తనం సంగ్రహరూపంలో చిత్రించడానికీ, వ్యాఖ్యానించడానికీ, అవకాశం ఎక్కువ ఉండడంతో, జీవితంపై అభిరుచి, ఆసక్తి, ఆరాటం ఉన్నంత వరకూ, నవల తన ప్రయోజనాత్మకతను నిలుపుకుంటుంది, ఏ మాత్రం ప్రాముఖ్యాన్ని కోల్పోదు. ఎవరి సహాయం లేకుండా, పెద్ద పాండిత్యంతో అవసరం లేకుండా సాధారణ సాహిత్య పరిజ్ఞానంతో చదవచ్చు. అందరికీ అందుబాటులో ఉండడానికి కారణం సులభంగా పఠనానికి యోగ్యమైన రూపం కలిగి ఉండడమే. ఇది దీని విస్తృతమైన వ్యాప్తికీ ఆకర్షణకూ దారి తీసింది. కళాత్మకత చేత నిలచింది.

ఎంతో సులభంగా పైకి కన్పించినప్పటికీ దీని నిర్మాణం కొంత క్లిష్టమైందే. చాల విస్తృతమైన పరిధి కలిగి ఉండడంవల్ల, దొరికిన స్వేచ్ఛను ఎంతో బాధ్యతాయుతంగా రచయిత ఉపయోగించుకోవలసి ఉంటుంది. దీన్ని విజయవంతంగా సాధించాలంటే, తనకు లభ్యమైన మేరలో జీవితాన్ని నిశితంగా పరిశీలించిన మీదట సూక్ష్మమైన స్థితి గతుల్ని అవగతం చేసుకున్న తరువాత, ఒక దృక్పథాన్ని అలవరచుకొని దర్శనంతో సమగ్రతను సిద్ధింపజేసే ప్రయత్నం అవసరం. ఇది ఒక నాటితో అయ్యేది కాదు. దీనికి నిరంతరమైన అనుభవంతో, నవంనవమైన ఆలోచన, ఒక క్రమంలో వికసించడం జరగాలి. గొప్ప నవలలన్నిటిలోనూ ఈ లక్షణం అనివార్యంగా కన్పిస్తుంది. ఇది చివరకు నవల లక్ష్యానికి దారితీసేది, రచయిత వ్యక్తిత్వాన్ని బట్టి లక్ష్యం రూపొందుతుంది. అదీ ఒక్కొక్క నవల్లో ఒక్కొక్క విధమైన ఆవిష్కృతిని పొందుతుంది. వాస్తవమైన జీవిత సదృశంగా పాత్రను చిత్రించడంలో సంఘటనలు మలచడంలో ఉద్దేశం తోడ్పడుతుంది. ఇతివృత్తం, సంఘర్షణలో పాత్ర వికాసంలో ఉద్దేశం పర్యవసాన రూపంలో స్పష్టమవుతుంది.

వచనంలో ఉన్న సుదీర్ఘమైన వాస్తవ జీవితం, రూపమే నవల. దీని ఉద్దేశం పాఠకుణ్ణి అలరింప జేయడం కాకుండా విలువల్ని సంతరింప జేయాలి. ఒక దృక్పథాన్ని భావింపజేయాలి. దార్శనికతను సిద్ధింప జేయాలి. ఇది ఎన్నో యుగాలుగా సంస్కృతీ పరంపరతో ఈనాటి నాగరకదశకు చేరుకున్న మానవుడికి, జీవితంపై విశ్వాసాన్ని నిలుపుతూ పురోగతికి దారి తీసేది. కవిత్వంలో కంటే ఇందులో ఒక సౌలభ్యం ఉంది. పదాలకు అర్థాలు, అన్వయమూ, వెతుక్కోకుండా, ధ్వనికోసమో అన్వేషణలో కాలం గడపకుండా, సులభంగా మనకు నిత్యమూ పరిచయంగల వాతావరణ నిర్మాణంతో అవగతమయ్యేది. అయితే దీన్ని గురించి ఆలోచన, శ్రమ ఉండదనికాదు. దీని స్వరూపం వేరు. అనుభవ సాంద్రతో భేదం ఉంది. నిర్మాణ రూపంలో భేదం ఉంది ఇది కళాత్మకంగానే పచబడిన ప్రభావ ప్రసారం కలిగింది కావటంవల్ల పాఠకుణ్ణి మొదలు పెట్టగానే చివరివరకు ఏదో ఒక విధంగా లాక్కొని పోతుంది. ఈనాడు అభిప్రాయాల వ్యాప్తికి దృక్పథాల ప్రసారానికి, సిద్ధాంతాల ప్రచారానికి మంచి సాహిత్య

సాధనమైంది. జీవితం విస్తృతినీ, లోతునూ ఖండఖండాలుగా ఒక రూపంలో చూపడంలో, మానవుని ప్రస్థానంలోవి వివిధ సంస్కృతీ పఖాలను వర్తమాన భూమికలో దర్శించే అవకాశాన్ని కలిగిస్తుంది. కాబట్టే చాల స్వల్పకాలంలో అశేషమైన పాఠక ప్రపంచాన్ని నిర్మించుకో గలిగింది. ఇందులోనూ వారివారి సంస్కార సంపదను బట్టి, అనుభవ శక్తిని బట్టి ఎన్నో దశలకు చెందిన వాహూ ఉన్నాయి. ఇది సహజం.

## II

పాత్రల్ని వాస్తవం చేత పుష్టంగా చిత్రించడంవల్ల మానవలోకం మన మనస్సులో అవతరిస్తుంది. జీవితంలోని సత్య సదృశత్వం నవలయొక్క సహజమైన అస్తిత్వాన్ని నిలిపేది. జీవితం నుంచి యథాతథంగా దింపడం కుదరదు. కొంత కల్పన అనివార్యం ఐనప్పటికి ఇది వాస్తవ రేఖల్లోనే ఒదిగి ఉండాలి. నవల లక్ష్యం జీవితసత్యానికి సన్నిహితంగా తీర్చడమే. సాధారణం, అసాధారణం మధ్యగల అంతరాన్ని, ప్రయోజనాన్నీ రచయిత గుర్తించగలగాలి. ఈ రెంటింటి మధ్య ఒక స్థితిలో సమత్వాన్ని సాధించగలగాలి. అసాధారణం, మనలో ఔత్సుక్యాన్ని పెంపొందిస్తుంది, అభిలాషను తీవ్రతరం చేస్తుంది. వాస్తవికం, కాల్పనికం - రెండు ప్రపంచాలు, అందరిలో ఉండేవే. మనిషి మనస్సు ఆలోచన మొదలు పెట్టడంతోనే కల్పనకు స్థానం లభిస్తుంది. దీన్ని పూర్తిగా తుడిచి పెట్టడమూ అసంభవం. ఈ రెండు ఏ పాళ్ళలో ఉండాలో, రచయిత నిర్వహణలో ప్రయోజనాన్నిబట్టి రూపొందించు కోవలసి ఉంటుంది. ఇది కేవల వాస్తవంగా వాస్తవ సదృశంగా ఉంటుంది, వాస్తవానికి ప్రాతినిధ్యంవహిస్తుంది. వాస్తవాన్ని ప్రకాశింప జేస్తుంది. కాల్పనికాంశంతో సమన్వితమైనప్పటికీ, సహజత్వంతో హేతు సహితంగా నిర్మితం కావాలి. ఈ దృష్టితో చూస్తే కాల్పనికమైన వాతావరణాన్ని సంపూర్ణంగా పరిహరించడం కుదరదు. ● సాధారణమైనస్థితి ఎదురైనపుడు దీనికి భావాత్మకమైన సందర్భాల్లో మరీ అవకాశం కల్పించుకుంటుంది.

ఏ జీవితాన్ని ఇదమిత్థమని మనం ఒక సూత్ర క్రమంలో బంధించలేం. అలాగే నవల కూడ. ఇలా ఉండడం జీవితం సజీవత్వానికీ, ప్రవాహ శీలానికీ లక్షణం. ఎప్పటికీ అనుకోని మార్పులతో, అనుభవాలతో అన్వేషణలతో క్రమిస్తుంది. ఒక జీవితం ఉన్నట్లు మరోరోజు ఉండదు. ఒకే జీవితంలో ఒకే విధమైన పరిస్థితిలో ఒక్కొక్క విధంగా చర్య, ప్రతి చర్య ఉంటుంది. వేరువేరు పర్యవసానాలు ఉంటాయి. కారణం ఇక్కడ పనిచేసేది "మనస్తత్వం" అవడమే. ఇది నవల్లో కళారూపాన్ని ధరిస్తుంది. రచయితలను బట్టి ఉద్దేశాలు భిన్నంగా ఉంటాయి. ఈ సందర్భంలో నవల చదివేప్పుడు గుర్తించవలసిన అంశాలు మూడు- (1) యథార్థమైంది (2) పాఠకుని మనస్సులో రూపొందేది (3) రచయిత కల్పించింది. రచయిత ఏది వ్రాసినా వీటి ప్రభావం అంతో ఇంతో ఉంటుంది. వివిధ రకాలైన పాఠకులు, వారినిబట్టి భిన్నాభిప్రాయాలు సహజం. నవల్లో ఒక కథ విషాదంతో ముగిసిందా ? ఆనందంతో ముగిసిందా? అనే ప్రశ్నకాదు ముఖ్యం. అలా జరగడంలో, అనేక సంఘటనల క్రమంలో సహజమైన గతి, అనేక పాత్రల వర్తనం, ప్రతివర్తనం - వీటి సమన్వయంలో హేతుయుతమైన ధోరణి, ఔచితీవంతమైన సంస్థితి మొదలైన అంశాలు నిర్మాణంలో పరిశీలనకు నిలవవలసినవి. ఈ పట్టున సమర్థించడం, సమర్థించక పోవడం - అంగీకరించడం, అంగీకరించక పోవడం-తో సాగే ఆలోచన చివరకు ఉద్దేశాన్ని స్పృశిస్తుంది. ఉద్దేశం కేంద్రస్థానంలో నుండి అన్నిటికి పరిష్కార మార్గాలు బయలు దేరుతాయి. అంటే లక్ష్యం తెలిస్తే సమాధానాలు అన్వేషించడం సులభం అన్నమాట. లక్ష్యం లేదా ఉద్దేశం అనేది నవల్లో ఎక్కడో ఒకచోట కాకుండా, రచన అంతటా సర్వాంగాల్లో వ్యాప్తమై కాంతి ప్రసారంలో స్ఫూర్తికి వస్తూ ఉంటుంది.

## III

మనిషికీ, ప్రపంచానికీగల పరస్పర సంబంధం, ప్రదర్శించే వివిధ సమయాల్లో రచయిత లక్ష్యం ప్రస్ఫుటమౌతుంది. ఇది వ్యక్తికీ వ్యక్తికీ కుటుంబానికీ-వివిధ వర్గాల సంఘానికీ మధ్య పరస్పరం, అనుబంధాలు సంబంధాలు వస్తువునుబట్టి నియమితమౌతూ నవల్లో, ప్రత్యేక రూపాల్ని సంతరించుకుంటాయి. ఈ లక్షణం, 1. సామాజికంగా చూస్తే మానవుల ప్రవర్తనారీతులు సామాజికమైన నీతి, నియమాలు, మత ప్రస్థానం - తాత్త్విక చింతనం - రాజకీయ ధోరణులు (2) వైయక్తికంగా చూస్తే- స్వంత ఆలోచనలు, మనస్తత్వ రీతులు - అనుభూతి స్పందనం అన్నీ కలసి లక్ష్యం వెనుక నుండి పనిచేసే క్షేత్రానికి సంబంధించింది. వ్యక్తి - కుటుంబం - సమాజం అనే మూడు పొరల్లో మనస్సు అనుబంధంతో ఆకర్షణతో అభిలాషతో జీవితాన్ని ప్రభావితం చేస్తుంది. దీన్ని చిత్రించడమూ నవల లక్ష్యం.

ప్రతిభ, పరిజ్ఞానం, అనుభవం ఉన్న రచయిత రచనలో మనకు సామాన్యమైన ఆలోచనను అతిక్రమించిన అనుభవ పరంపరలో ముంచేస్తుంది. ఒక్కొక్కప్పుడు ఆశ్చర్య చకితుల్నిచేస్తుంది. ఈ దృష్టితో చూస్తే ఉత్తమ నవల మన పరిజ్ఞానాన్ని పెంచుతుంది, అనుభవాన్ని విస్తృతం చేస్తుంది. ఆలోచనకు లోతునిస్తుంది. అందుచేత నవల లక్ష్యానికి అవధులు నిర్ణయించలేం. మన జీవితంవలె ఎప్పటికీ అసంపూర్ణమే. అందుకని నవలా రచన పాతబడిపోవడం ఉండదు. ఈ వ్యాసంగం సాగుతూనే ఉంటుంది. కాలం గడిచేకొద్దీ పరివర్తనం, కొత్తను ఆశించడం మూలంగా మానవుని ప్రస్థానం వలె దీనికీ సమాప్తి లేదు.

జీవితం ప్రతిక్షణం, మారే స్వభావం కలది. అంటే ఇప్పుడున్న సమీకరణం, రీతి, సంయోజనం, స్థితి, ఆకృతి, గతి, సమయం, వయస్సు ఇలా ఎన్నింటిలోనో మరో క్షణంలో ఉండదు. ఇది కొన్ని క్షణాలు లేదా రోజుల తరువాత మరీ స్పష్టంగా కన్పిస్తుంది. ఈ విధంగానే ప్రకృతి గురించి చెప్పవచ్చు. అందువల్ల మనకు కన్పిస్తున్న సమాజాన్ని మొదట పరిశీలించాలి. తరువాత అందులోని అంశాలను ఎన్నుకోవాలి. ఆపైన కళాత్మకంగా రూపొందించాలి. అభిరుచి, విచక్షణ, శిల్పం ఈ సందర్భంలో జ్ఞాపకం వస్తాయి. దీని వెనకనుండి సృజనశక్తి ప్రేరకంగా లేంది ఏ రచనా సాధ్యం కాదు. పరిశీలనం - ఎన్నిక - నిర్మాణశిల్పం మూడు కలసి ఒక లక్ష్యాన్ని ఉద్దేశించి పనిచేయడంలో దార్శనికత చేకూరుతుంది. ఉత్తమ రచనల్లో నీతి - సత్యం - ధర్మం మొదలైన సాధారణ విషయాలనతిగమించిన జీవనతత్త్వం స్పష్టంగానో, సూచనగానో ప్రపంచితమౌతుంది. ఇది అనేకమైన విశ్వాసాలు, అభిప్రాయాలు, ఆలోచన, చింతన, ఆదర్శాలు సిద్ధాంతాలను బట్టి రూపొందుతుంది. తెలుగు సాహిత్యంలో నవలా ప్రపంచంలో కందుకూరి, ఉన్నవ, విశ్వనాథ, చలం, బుచ్చిబాబు, గోపీచంద్ మొదలైన ప్రముఖ రచయితల్లో ఈ లక్ష్య రూపాన్ని సులభంగా గుర్తించవచ్చు. నవల లక్ష్యం ఉల్లాసం కలిగించడం, పరిజ్ఞానం కలిగించడంతో పాటు జీవన తత్త్వదర్శనంలోకి ప్రవేశించడంతో, క్షేత్రపరిధి విస్తృతిని పొందుతూంది.

దర్శనం కొత్త ప్రపంచంలోకి తీసుకొని వెళ్ళి జీవిత లక్ష్యంగురించి నిశ్చయభావంతో ఆలోచింప జేస్తుంది. ఒక్కొక్కపుడు మనల్ని ఆలోచనాస్థితి నుండి, క్రియోన్ముఖుల్ని చేస్తుంది. సంస్కారాన్ని మార్పునూ ప్రవేశపెడుతుంది. రచయిత సృజనశక్తితో పాటు దార్శనికత కలిగినపుడు శిల్పంతో తాత్త్వికమైన రూపానికీ కళాత్మకమైన భావనకూ మధ్య సామరస్యం చెడకుండా ఉన్నతమైన ప్రమాణంలో సుస్థితిని సాధిస్తాడు. నవల ఈనాడు ఇతర సృజన ప్రక్రియలతో సమానమైన గౌరవాన్ని పొందడానికిది ముఖ్యహేతువు. కాబట్టి ఈ అంశాన్ని విస్మరించడానికి వీలులేదు. ఈ రకం నవలలు, తమ లక్ష్యాన్ని నిర్దిష్టం చేస్తూనే, మనల్ని ఆలోచింప జేస్తూ నిర్మాణ శిల్పంచేత ఇతివృత్తం - పాత్ర - వాతావరణం మొదలుగా రమణీయమైన యోజనతో ఆనందాన్ని కలిగింప జేస్తూంది. మొదటిది సమాజపరమైంది. రెండోది వ్యక్తిపరమైంది. మొదటిది సమాజాన్ని గురించి దాని స్థితిగతుల్నిగురించి యోచన చేస్తుంది. ప్రతిక్రియను భావింపచేస్తుంది. మార్గాన్ని రూపొందిస్తుంది. రెండోది రచయితలోని రచనా శక్తి ప్రసారంతో మొదటిదాని ఆవిష్కృతిని ఆకర్షణీయంగా చేస్తూ, నవల మొత్తం మీద వైయక్తికమైన అనుభూతిని కలిగిస్తుంది. ఇది సాహిత్యం విబుధుల దృష్టితో ముఖ్యమైంది మొదటిదీ లక్ష్యంయొక్క క్షేత్ర

విస్తృతి దృష్ట్యా సామాజికమైన శ్రేయస్సుకు కారణమైంది. ఒక్కొక్క రచయితను బట్టి, వివిధ రచనలను బట్టి వివిధ నిష్పత్తుల్లో ఈ రెండిటి సమ్మేళనం ఉంటుంది.

"కళ కళ కోసమే" అనే వాదం పందొమ్మిదవ శతాబ్ది చివరి పాదంలో వ్యాప్తమైంది. సామాజిక సమస్యలు, సందేహాల నుండి దూరంగా స్వతంత్రంగా ఉండాలని వీరి అభిప్రాయం. కళను, నీతి నియమాలనుండి దూరం చేసి సామాజిక వాస్తవాలకు అందని ఎత్తులో ఉంచాలని వీరి ప్రయత్నమూ. కళకూ సామాజిక వాస్తవికతకూ సంబంధంలేదు, ఈ రెండూ కలిసే వీలులేదనే వీరి విశ్వాసం. ఆస్కార్‌వైల్డ్ పిక్చర్ ఆఫ్ డోరియన్ గ్రే ఈ కోవకు చెందిందే.

కళాకారుడూ సమాజంలో సభ్యుడే. సమాజానికి దూరంగా ఉండజాలడు. ఒక సమస్య, పరివర్తనం యొక్క ప్రభావం అందరితోపాటు అతనిపైన ప్రసరిస్తుంది. ఇతడు ఆలోచనా జీవి, అవడంవల్ల ఇంకా అభిలాషతో దాన్ని అవగతం చేసుకునే ప్రయత్నంచేయాలి. సామాజికమైన బాధ్యతను విస్మరించకూడదు. ఈ దృష్టి అతని సృజనాత్మకశక్తికి కొత్త రూపాన్ని ఇస్తుంది. దీన్ని నిరాకరించడంలో కృత్రిమత్వం చోటు చేసుకొంటుంది. ఈ విధమైన అభిప్రాయమూ బలంగా క్రమ క్రమంగా మరోవైపునుండి వీస్తూ, రచయితల్లో సామాజిక స్పృహను ఉద్బుద్ధం చేసే ప్రయత్నమూ జరిగింది. ఇంకా కళాకారుణ్ణి ఒక సామాజికంగా ఒక లక్ష్యానికి నిబద్ధం చేసే వాదమూ ఇటీవల బాగా వ్యాప్తిలోకి వచ్చింది. ఈ సందర్భంలో నైజీరియన్ విమర్శకుడు, కొలావోలె ఒగంగ్ బేసాన్ మాటలు పరిశీలనార్హాలు.

"ది రైటర్ ఇస్ ఎ మెంబర్ ఆఫ్ సొసయిటీ అండ్ హిస్ సెన్సిటిలిటీ ఇస్ కండిషన్‌డ్ బయి ది సోషల్ అండ్ పొలిటికల్ హేపెనింగ్స్ ఎరవుండ్ హిమ్ .... దీస్ ఇష్యూస్ ఫార్మ్ ఎ పార్ట్ ఆఫ్ ది సబ్‌స్టెన్స్ ఆఫ్ లయిఫ్ విదిన్ విచ్ హిస్ ఇన్‌స్టింక్ట్ ఎ రైటర్ మస్ట్ స్ట్రగిల్."

నవల యథార్థ జీవితం నుండి దూరంగా ఉండదు కాబట్టి, దాని స్వభావంలోనే ఈ 'ఏకాంత ధోరణి'కే మాత్రం అవకాశం లేదు. అలా అయితే దానికి మరో పేరు పెట్టవలసి ఉంటుంది. నవలా రచయిత సామాజిక బాధ్యతను ఒక లక్ష్యంతో నిర్వర్తించినపుడే, దానికి యోగ్యత ఏర్పడుతుంది. ఈ సందర్భంలో కళాత్మకమైన విలువల్ని పరిహరించవలసిన అవసరంలేదు. అయితే లక్ష్య రూపాల్లో భేదం ఉండవచ్చు. మనం అంగీకరించవచ్చు, అంగీకరించకపోవచ్చు. అది వేరే విషయం.

ఇక ఈ లక్ష్య వివేచనం తరువాత ఒక్కొక్క లక్ష్య విభాగాన్ని స్థూలంగా పరిశీలించవలసి ఉంది.

## 1. మానసికంగా ఉల్లాసం, ఉపశమనం, తృప్తి, ఆనందం

మనిషి పుట్టింది మొదలుకొని చిన్నప్పటినుండి మనసులో నిలచిపోయిన అనేకమైనకోర్కెల సంచారానికి, తృప్తికీ అవకాశం కావాలి. ఉదాహరణకు పగటికలలు కనడమూ, మానసికంగా ఈస్థితి వల్లనే. పిల్లల్లో ఇది స్పష్టంగా కన్పిస్తుంది. పిల్లలు ఉపాధ్యాయులుగా, బూచివాండ్రుగా, ఇంకా అనేకరూపాల్లో జంతువులుగా, నటిస్తూ అనుకరిస్తూ కాలక్షేపం చేస్తారు. పెద్దలు సామాజికమైన కొన్ని అవరోధాలవల్ల సభ్యతకు భంగం కలుగుతుందన్నభావంతో మనసులోనే కల్పించుకొని పగటికలలు కంటారు, కలలు కంటారు. మనోజగత్తులో నిర్నిబంధంగా జరిగే స్వేచ్ఛాయుతమైన ఈ కల్పనా సంచారం వారికి మానసిక తృప్తిని చేకూరుస్తుంది. ఇది ఎవరికీ అపకారంచేసేదికాదు. కేవలం వైయక్తికమైంది, నవల ఒక సంగ్రహ ప్రపంచం. ఇందులో ఒక కథ-ఎన్నో పాత్రలు, సంఘటనలు, సమస్యలు, ప్రతిఘటనల ఉల్లంఘనం ఆశ, నిరాశ, జయం, అపజయం ఆదర్శంతో పాఠకునికి ఒక తృప్తినీ ఆనందాన్ని కలిగిస్తుంది. నవల్లో అనేకమైన అంశాలు, తన మనస్సులో అణగిన, లేదా దాగిన రూపాలతో విభేదాన్నో ఐక్యాన్నో, తిరస్కారాన్నో, ఆరాధననో పొందుతాయి. మానసికంగా ఏర్పడిన పెద్ద అఖాతాన్ని ఆలోచనాత్మకంగా పూరించుకొని, ఆశ్వాసాన్ని పొందడం జరుగుతుంది. ఈ లక్ష్యం రచయిత కావాలని ప్రవేశ పెట్టింది కాదు. రచనలోని సహజ గుణం వల్లనేసిద్ధించేది. ఇది పాఠకుడు అత్యంత సులభంగా మానసికమైన ఉద్రేకానికి, పొందే సేఫ్టీ వాల్వ్ లాంటిది. ఉత్తమ నవల చదివేప్పుడు ఈ ప్రభావరూపాన్ని ప్రత్యక్షంగా స్పష్టంగా గమనించవచ్చు. నవల జీవిత సత్యంతో ఎక్కువగా సాదృశ్యం పొందడం చేత మరీ దగ్గరగా, ఇంచుమించు అందులో సంపూర్ణమైన సహయోగాన్ని పొందడం జరుగుతుంది.

## 2. వాస్తవాల అవగాహన, చిత్రణం, ఆదర్శం

వాస్తవాన్ని సరిగా అవగాహన చేసుకొని, పరిశీలించి, విశ్లేషించి, అవసరమైంది ఎన్నుకొని చివరకు ఈ వస్తుసముచ్చయాన్ని దర్శనశక్తితో చిత్రించగలిగినపుడు నవలకు పరిపూర్ణత సిద్ధిస్తుంది. ఇది రచయిత సామాజికమైన స్పందననూ, కళాదృష్టినీ లక్ష్య సాధనాన్ని భావింప జేసేది.

మా ఖాతాదారులకు, శ్రేయోభిలాషులకు

## రుధిరోద్గారినామ సంవత్సర

శుభాకాంక్షలు!

# బనారస్
## శారిహౌస్

కంచి, ఆరణి
ధర్మవరం, బనారస్
పట్టుచీరెలు
ఉత్పత్తిధరలకు
లభించును

ప్రత్యేకపట్టుచీరెలషోరూమ్

J.D. హాస్పటల్ రోడ్
గవర్నరుపేట

విజయవాడ-2

VEEYES

---

మీ కందరికి ఉగాది శుభాకాంక్షలు!

## సరిక్రొత్త యవ్వనమునకు

సంప్రదించండి!



**Dr. ROY**
(Sex Specialist)

భారత ప్రఖ్యాత సెక్సు స్పెషలిస్టు డా॥ రాయ్ (Govt. Regd.)
33 సంవత్సరముల అనుభవముతో, వ్యక్తిగత సుప్తరోగములకు, అసమానమైన, శాస్త్రీయమైన చికిత్స చేయుదురు. జీవితములో ఆరోగ్యమునకు, యవ్వనమునకు ఆధునిక విద్యుత్ పరికరములతో ఉత్తమ చికిత్స చేయుదురు.

సమయం :
ఉదయం : 8-00 గం॥ల నుండి 1-00 గం॥ వరకు
సాయంత్రం : 1-00 గం॥ నుండి 9-30 గం॥ వరకు

★ ఆదివారం శెలవు లేదు ★

# రాయ్స్ మెడికల్ హాల్

సెయింట్ మేరీస్ రోడ్ ✲ మనోహర్ టాకీస్‌కు ఎదురుగా
సికింద్రాబాద్ ఫోన్: **76795**

### 3. జీవిత దర్శనంతో దృక్పథాన్ని కలిగించడం, తత్త్వాన్ని నిర్దేశించడం

ఈనాడు ఈ అంశానికి ప్రాముఖ్యం ఉన్నమాట వాస్తవం. సమాజంలో ఎన్నో సంక్లిష్టమైన సమస్యలు ఎదుర్కోవలసి వచ్చినపుడు వాటి పరిష్కార సాధనలో - సామాజిక సువ్యవస్థకూ, సౌభాగ్యానికీ, ఒక్కొక్కరూ ఒక్కొక్క ఆలోచనా స్వరూపాన్ని క్రియాపై ఖరిని ఎన్నుకొంటారు. అలాగే వ్యక్తివికాసం, సమున్నతి విషయంలోనూ. ఇది జాతీయస్థాయి నుండి అంతర్జాతీయస్థాయిదాకా, ఆర్థిక, రాజకీయ, తాత్త్విక, సాంఘిక రంగాలు స్పృశిస్తూంటుంది. సమస్యకు ఒక పరిష్కారమార్గాన్ని సూచిస్తుంది. జీవితంపై ఆశా రూపాన్ని కలిగిస్తుంది. ప్రయాణానికి దిక్సూచిలా ఉపకరిస్తుంది. వ్యక్తి శ్రేయస్సునుండి సమాజ భవితవ్యం - స్పష్టంగా ఆవిష్కృత మౌతుంది. రచయిత వ్యక్తి - సమాజం పట్ల అభిప్రాయాలు; అందులో తన పాత్రను సక్రమంగా స్పష్టంగా నిర్వహించే విశ్వాసాన్ని భావింపజేస్తుంది. ఏ గొప్ప నవల్లోనైనా దృక్పథం-తత్త్వం ఉంటుంది. అది సనాతన ధర్మ ప్రపంచనం కావచ్చు - ప్రజాస్వామ్యం విలువల్ని స్థాపించేది కావచ్చు. సామ్యవాద సమసమాజ నిర్మాణం కాంక్షించేది అవచ్చు. దీని వెనుక ఎంతో చరిత్ర - సంస్కృతి యొక్క పరిశీలనం వర్తమాన స్థితి సమీక్షణం, భవిష్యత్తును గురించి స్పష్టమైన అవగాహన, దృఢమైన నిశ్చయం ఉంటుంది.

### 4. నిఖిల మానవ సంస్కృతీ పరిణామంలో భాగం

నవల్లో వాతావరణ పరికల్పనంతోపాటు మానవీయమైన రూప కల్పనమూ తప్పనిసరిగా ఉంటుంది. ఇది సమాజాన్ని ఆశ్రయించి, దాని చిత్రణలో అంతస్సూత్రంగా మనల్ని ఆకర్షిస్తుంది. ఎన్నో మతాలు జాతులు వర్ణాలు కులాలు దేశ పరిధులూ సంకుచిత వలయాలు అధిగమించిన మానవీయ భావన ఏలాంటి నవల్లోనూ అంతో ఇంతో ఉండక తప్పదు. ఉత్తమ కోటికి చెందిన నవల్లో దీనికి సరియైన స్థానం ఉండి తీరుతుంది. ఆకలి దారిద్ర్యం మోసం అన్యాయం అవినీతి అధర్మం బాధ కారుణ్యం, సమస్య, త్యాగం, క్రౌర్యం, ఉదారత ఈ విధంగా అనేకంగా నిత్యజీవితంలో ఎన్నో విషయాల్లో ప్రపంచంలో మానవులందరూ ఏ భేదం లేకుండా పంచుకునే అంశాలున్నాయి. ఇది అందరినీ కలిపే మానవతా సూత్రం. జాతి, భాష, దేశం వేరైనా ఎన్నో ఉత్తమ రచనలు చదివి ఆనందించి ప్రయోజనం పొందగలిగే ఉదాత్త లక్షణం ఈ మానవీయ భావన కేంద్రంనుండి అవతరించిందే. మానవుణ్ణి మానవుడిగా చూచే ఉదార భావాన్ని, గౌరవించే సంస్కార రూపాన్నీ కలిగిస్తూ, నిఖిల మానవ సంస్కృతీ పరిణామంలో భాగంగా వ్యక్తిని భావింపజేసేది. భౌతికంగా చూస్తే తిండి, బట్ట, ఆశ్రయం; మానసికంగా చూస్తే ఆర్ద్రత, అనురాగం, ఆవేదనతో ప్రతి వ్యక్తి, జాతి, దేశం - సౌభాగ్యాన్నీ, సౌహార్దాన్నీ శాంతినీ కాంక్షిస్తూ - మానవుని ప్రస్థానంలో ఒక భాగంగా దర్శనమిస్తుంది, ఒక్కమారు పర్యాలోకనం చేస్తే, నవల లక్ష్యం - సమాజంలో భాగంగా, వ్యక్తిత్వంగల మానవుడుగా సామాజిక బాధ్యతనూ వ్యక్తిత్వ స్ఫూర్తినీ కలిగిస్తుంది. చైతన్యవంతంగా వికసింపజేస్తుంది. నిజజీవితంలో రెక్కలు ముడుచుకొన్న ఆలోచనల్ని ఎగిరేట్లుచేసి, అనుభవ పరిధిని విస్తృతం చేస్తుంది. అనేకమైన సంఘటనలు, పాత్రలతో సంక్షిప్తమైన జీవితంతో సాదృశ్యంగా మనలో ''మన కథే చెబుతున్నట్లుగా'' ఐక్యభావాన్ని స్పందింపజేస్తుంది. వాస్తవ జీవితంలో మనకు లభ్యంకాని కోర్కెలతో, అణగిన ఆశలతో ఏర్పడిన లోటును, మానసికంగా తృప్తినిస్తూ, కళాత్మకంగా పరిపూర్ణం చేస్తుంది. వ్యక్తిలో అనుభూతితోపాటు ఆలోచనా వికాసానికీ, ప్రసారానికీ దారి తీస్తుంది. మానవీయ సంబంధాలను, దృఢతరం చేసి విశ్వమానవ భావన నావిష్కరించేందుకు ప్రయత్నిస్తుంది. ఒక దృక్పథంతో, సిద్ధాంత తత్త్వంతో వ్యక్తిలోనేగాక సామాజికంగానూ సంస్కారానికీ పరివర్తనకూ దోహదం చేస్తుంది.

సమాజంలో వ్యక్తులు కుటుంబం, బయటిలోకం, ఇందులోనూ నిత్యమూ పరిచితమైందీ, అపరిచితమైందీ - అన్నీ కలిసిన సమాజ రూపం నవల్లో జీవిత భాగాల్లో చిత్రితమై నిర్మాణ రూపాన్ని పొందుతుంది. ఈ భాగాల్లోనూ ఎన్నో అరలు, పొరలు. ఒక్కొక్కటీ ఒక్కొక్క ప్రపంచమే అనవచ్చు. వీటితో తప్పనిసరిగా సంబంధాలుండే మనుషులు అనుబంధాలు, ఆలోచనలు ప్రవర్తనలు అనుభూతులు అనుభవాలు ఎన్నెన్నో - మానవత్వపు విలువలతో సంస్కారం పరివర్తనా శీలంతో, స్పందించే సమాజ వాస్తవ రూపం నవల.

### ఉపయుక్త రచనలు


1. ది క్రాఫ్ట్ ఆఫ్ ఫిక్షన్: పెర్సీ లబ్బక్
2. ది థియరీ ఆఫ్ నావెల్: ఫిలిప్ స్టెలిక్ (ఎడ్)
3. ది స్ట్రక్చర్ ఆఫ్ ది నావెల్: ఎడ్విన్ మ్యుయిర్




# సమర్చన

## శ్రీ శనగన నరసింహస్వామి

హాయని చెల్మికల్మి ముఖమండలమందు నటింప కౌముదీ
చ్ఛాయల దోగు ఈ మధుర చారు శరన్నిశ గౌతమీ తటిన్
హాయిగ సంచరింతు రెవరయ్య! కవీంద్రులు నన్నపార్య నా
రాయణ భట్టు లౌదురె! మహాత్ములు! కొందు! నమస్సహస్రముల్.

2

ఈ సరిదంచలోర్వి నిపు డిర్వుర మిమ్ముల గాంచినంతనే
వ్యాసకవీంద్ర మౌనియు ఘటాత్మజుడున్ జతగూడి భీమనా
థాఽసమమూర్తి గొల్వ మహితాంధ్రము మెట్టిన పూర్వగాథలే
వో సరిక్రొత్తవై యెడద నూచు సుధా జలరాశి వీచులన్.

3

గీర్వాణ భారతాఖర్వాటవిం జొచ్చి, కమనీయ సుగమమార్గమును దీర్చి-
కర్ణాట భారతకావ్య వైఖరులెల్ల, నక్షరాక్షరముగా నవధరించి-
సంస్కారహీనయై సభలకెక్కని తెల్గు,పల్కు కల్కికి శుద్ధఫణితి గఱపి-
అర్థ గౌరవముతో నక్షర రమ్యత్వ, మునకు పోరానిపొందును ఘటించి -
ఇచటె యిచ్చటె గౌతమీప్రచురపులిన, తతుల నాసీనులై జగద్ధితముగోరి
చంద్రదీపైకకాంతుల జడుల తడిసి, తెన్గుభారతమును నిబంధించినారె!

4

ఈ రేవు లోననే మీరు గోదావారి, అఘమర్షణ స్నాన మాడినారు -
ఈ రాజపథమందె మీరు నిత్యంబును, మత్తేభములు వోలె మసలినారు-
ఈ వీధిలోనె మీరిచ్చమై ప్రక్కప్ర, క్కల యిండ్ల వాసమ్ము సలిపినారు-
ఈ సైకతము లందె ఆసాసలన్ మీరు, కమ్మ వెన్నెలరేలు గడపినారు-
ఇచట చాళుక్య రాజమహేంద్రుపీఠ, పూత గోదావరీ స్రవంతీ తటాన
భవ్యభవదీయ పాదాబ్జ భద్రముద్రి, కాంకితము కాని చోటణువైన లేదు!

5

ఒక రొకరే సరస్వతికి నొజ్జనమున్ వహియింపజాలు ధీ
ప్రకలితులార! వ్యాసముని భారత భాసుర భావ భంగులన్
సుకముగ తెల్గువారలకు చూర లొసంగిన శూరులార! ఓ
అకలుషచిత్తులార! ప్రథమాంధ్ర కవీశ్వరులార! జోహారుల్!

---*---

# ఆర్తవ శోభ

## శ్రీ వజ్ఝల కాళిదాసు

గిరులన్ దరులన్ లతలన్
మెరుగుల్ మురువుల్ పులకాం
కురమ్ములై చివురించున్
సురభి పరిష్వంగమునన్.

వసంత వేళా శాలల
వసుంధరా దరహాస
ప్రసన్న వదన విలాసము
లొసంగు సంతోషమ్మున్.

నిరంతర హాసరేఖలు
నిరస్త మనోజ్ఞ గాథలు
నిరత్య యాశా జ్యోతులు
నిరవధిక సురభి శోభలు॥

◆ ◆

చండ ప్రచండ కిరణములన్ బ్ర
హ్మాండము నంతయు దహించు తీక్ష్ణత
నిండ నఖండ జ్యోతిగ గార్చుర
ఖాండమ్మున భాస్వంతుడు వెలుగున్!

శతకోటి శతఘ్ని నిర్ఘాతా
గత విలయాగ్ని చ్ఛటా భరితమై
కుతలంబు గాల్చు నూష్మాపగము
నితాంత కృతాంత కఠోర దీక్షన్.

శరీరములు ఘర్మబిందు సంచయ
పరి పూరితమ్ములై దగ గ్రాగన్
సరోవరమ్ములు స్రోతస్వినులున్
హరించు కొని పోయి కడున్ వేగున్.

◆ ◆

వానతరిఁ దడిసి పోయిన
వేనలి వినువీథిఁ బ్రకృతి
మానవతి యార బెట్టెను
నా నిండు ఘనా ఘనముల్

ప్రద్యోతన శకలములన
సద్యః కాంతుల జిమ్ముచు
విద్యుల్లతా లలనా ము
ఖద్యుతులు కన్ను బ్రామున్

నీరామనులన్ బారా
వారములుగ గురియు వర్ష
ధారల బ్రక్షాళితములు
శారద నిశాంబరంబుల్.

◆ ◆

శారద నిశా జ్యో
త్స్నా రుచిర కాంతిన్
కారున్ సుధా ధా
రా రస ధునీ శ్రీ!

ఆకాశము స్వచ్ఛం
బై కులుకుఁ; దారా
నీకము ల స్మేరాం
కూరములు నిండున్

తెమ్మెరలు వీవన్
నెమ్మది శరత్కా
లమ్మున సుఖమ్ముల్
క్రమ్ము నిరతమ్ముల్.

◆ ◆

వెట్టకారు వేడికోడి
వానకారు వడికి జడిసి
మిహిక శిఖరములన, వీడి
మహికి దిగెనో మంచుకారు!

ప్రియుల బిగువు కౌగిళులన్
రేయి గడుపు నంగనలకు
ఉషః కిరణ రేఖలతో
విషాదాంధ కార మలము.

విధుర జీవి యెదలరేగు
వేదనా విషాద భరిత
విధుర గీత నిబిడ మిహిర
మరు[్ద]ుతుల్ వినబడు నిట!

వియత్తలము నుండి జారి
విశ్వమెల్ల కప్పు మంచు
తెరల మరుగు నందు ప్రకృతి
నిరంతరము నిదుర బోవు!

◆ ◆

విరామ మెరుగని హిమాలు కురిసే
మరుత్తు ధరావలయమ్ము నిండగ
నరాలు కొరికే యెముకలు విరిచే
భరింప జాలని చలిచలి చలిచలి!

దరిద్ర బాధా కుఠార ధారా
హా౽ జీవుల వలె మృతాసురులవలె
మృత పత్రమ్ములు గత పుష్పమ్ముల్
కరద్రుమమ్ములు కన్‌బడు నిందున్.

వసంతవేళా వైభవములలో
శరన్మనోహర చాంద్రీరుచిలో
విశుద్ధ శోభల వెలిగిన తరువులు
కృశించు శిశిర పరిష్వంగములో

హిమాలయమ్ముల హిమము కరుగనీ
సముద్రమందలి జలము లిగురనీ
హిమాంశు తారార్కముగా సరిగా
క్రమమ్ము తప్పక ఋతువులు సాగున్.





రుధిరోద్గారినామ సంవత్సర ఉగాది శుభాకాంక్షలతో

డాక్టర్ బి. ఆర్. కె. రావు

రాజకీయ ఆర్థిక చరిత్ర

# నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ వైపుకు

## పుట్టుక: పరిస్థితులు

**1974** ఏప్రిల్-మేలో నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థను నిర్మించాలని మిత్రరాజ్య సమితి ఆరవ ప్రత్యేక జనరల్ ఎసెంబ్లీ తీర్మానిస్తూ, యిందుకు ప్రాతిపదికకాగల సూత్రాలను, కార్యక్రమాన్నికూడా ప్రకటించింది. ప్రపంచ ద్రవ్యోల్బణంవల్ల పెట్రోలు ధరల పెరుగుదలవల్ల నష్టపడిన దేశాలకు మేలు కలుగ జేసే చర్యలనుకూడా సిఫారసు చేసింది. 1975 తదుపరి అభివృద్ధి చెందినట్టి, చెందుతూ వున్నట్టి దేశాలుకూడా ధారావాహికంగా పెరుగుతూన్న ఇంధన ధరలతోను, అభివృద్ధి కవసరమైన దిగుమతులు కల్పించే సమస్యలతోను (ముఖ్యంగా అభివృద్ధి చెందుతూవున్న దేశాలు) సతమతమౌతున్నారు. పెచ్చు పెరిగిన ద్రవ్యోల్బణరేట్లు, పెరుగుతూనేవున్న నిరుద్యోగస్థితి పారిశ్రామిక దేశాలకు లభ్యమౌతున్న ఆర్థిక వృద్ధిరేట్లను తగ్గించినాయి. అంతటితో పారిశ్రామిక దేశాలు, ప్రాథమిక వస్తువులను మాత్రమే ఉత్పత్తి చేసే వెనుకబడిన దేశాలతో తమ ఆర్థిక సంబంధాలను వెనుకబడిన వారికి అనుకూలంకాని రీతిలో నడిపించ మొదలు పెట్టినాయి. అందువల్ల ఈ వెనుకబడిన బీదదేశాల ఆర్థిక వృద్ధికి దెబ్బ తగిలింది. ధరల పెరుగుదలవల్ల వచ్చిన లాభాలు అభివృద్ధి చెందుతూవున్న నూనె ఎగుమతి దారులకే తాత్కాలికంగానయినా సంక్రమించినాయిగాని, యితర అభివృద్ధి చెందుతూవున్న దేశాలకు లభ్యం కాలేదు. అంతర్జాతీయ వ్యాపారాభివృద్ధికి ముందు వూపు లేకుండా పోయింది. అభివృద్ధి చెందుతూన్న నూనె దిగుమతి దారులు హెచ్చుగా రుణాలు చేయవలసిరావడము, వారి సాంవత్సరిక బడ్జెట్‌లు విపరీత లోట్లుకు గురికావడము జరిగింది.

## ధనిక దేశాల అలసత్వం

1970-1980 కాల వ్యవధిలో జరిగిన సంఘటనవల్ల, నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ బీద దేశాలకు న్యాయం కలుగ జేస్తుందని, ధనిక, పేద దేశాల మధ్య సమానత్వం స్థాపిస్తుందని పెట్టుకున్న ఆశలు పటాపంచలయినవి. ధనిక దేశాలను వ్యతిరేకించికూడా మిత్రరాజ్య సమితి ఎసెంబ్లీ చేసిన నూతన వ్యవస్థ తీర్మానం సారం లేకుండా పోయింది. ఈ తీర్మాన లక్ష్యాన్ని సాధించడానికి ధనిక దేశాలు 1970-1980 మధ్య ఒక్క అడుగు కూడా ముందుకు కదలలేదు. 1975లో జరిగిన ఉత్తర (ధనిక)-దక్షిణ (బీద)దేశాల సంప్రదింపులు 1976లో నైరోబీలోను, 1979లో మనిలాలోను జరిగిన మిత్రరాజ్యసమితి వ్యాపార, సహాయ, అభివృద్ధి కాన్ఫరెన్సులు ఫలితం లేకుండా పోయినై. ఫ్రాన్సు ప్రతిపాదన నంగీకరించి మాత్రం జర్మన్ సోషలిస్టు నాయకుడైన విల్లీబ్రాండెట్ నాయకత్వాన అంతర్జాతీయ ఆర్థికాభివృద్ధి కమిషన్ ఏర్పాటు చేసారు. 1. అందరికి వస్తువులందించే సమీకృత కార్యక్రమాన్ని 2. బఫర్ స్టాక్స్ ఏర్పాటుకు ద్రవ్యనిధిని ఏర్పర్చాలని 3. వివిధ వస్తువుల్ని సేకరించాలని మాత్రం అందరూ అంగీకరించారు. ఒకో వస్తువుపైన జరిగిన ఒప్పందాలను చూచినట్లయితే ఫ్యాక్టరీలో తయారయిన పూర్ణ వస్తువులు, అర్ధ-పూర్ణ వస్తువులు, అభివృద్ధి ద్రవ్యము విషయాల్లో అభివృద్ధి చెందుతూన్న దేశాలకు ఏమీ లాభం కల్గలేదు.

## అంగీకారం అమలు జరగలేదు

జనరల్ అగ్రిమెంట్ ఆన్ ట్రేడ్ అండ్ టారిఫ్ సంస్థ నాయకత్వాన 1973 సెప్టెంబరులో టోక్యోలో అంతర్జాతీయ వ్యాపారాన్ని సరళం చెయ్యాలని, దశలవారిగా ఎగుమతి దిగుమతి పన్నుల్ని, యితర ఆటంకాల్ని తగ్గించాలని అంగీకరించి కూడా పారిశ్రామిక దేశాలు పరోక్షంగా రక్షణ అనే ఆటంకాలను ఏర్పర్చినాయి. రెండవ అభివృద్ధి దశకంలో ప్రతి అభివృద్ధి చెందిన దేశము తన జాతీయాదాయంలో సాలీనా 0.70 శాతాన్ని అభివృద్ధి చెందుతూవున్న దేశాలకు అధికార అభివృద్ధి సహాయంగా అందించాలని నిర్ణయించినా అందులో సగం సాయంకూడా 1979 నాటికి

పొందచేయలేదు. 1985 నాటికి కూడా ఈ అధికార అభివృద్ధి సహాయము ధనిక దేశాల జాతీయాదాయంలో 0.36 శాతానికి మించదని ప్రపంచ బ్యాంకు అంచనా చేసింది. అయితే 1978 నాటికే కొన్ని యూరోపు దేశాలు- స్వీడన్, నార్వే, డెన్మార్క్ - మిత్రరాజ్య సమితి లక్ష్యాన్ని దాటిన సహాయం చేసినవి.

## ముందుకు సాగని స్థితి

1980 తర్వాత ప్రపంచానికి పెద్ద రాజకీయ బాధ తగిలింది. రాజకీయ తగవుల్ని ఆపివెయ్యాలనే ప్రక్రియకు దెబ్బ తగిలింది. దశాబ్దం ముందు కన్పించని ఆర్థిక ఛాలెంజిలు ఎదురైనాయి. మూడవ అభివృద్ధి దశకానికి కావలసిన వ్యూహాన్ని మిత్రరాజ్య సమితి జనరల్ ఎసెంబ్లీ తయారు చేసింది కాని, 1981 ప్రారంభంలో సాగిన ప్రపంచ ఆర్థిక సంప్రదింపులు ఒక ఫలితానికి రాలేదు. పశ్చిమ పారిశ్రామిక దేశాలు వ్యాపారం, ద్రవ్యం, అభివృద్ధి విత్తం విషయాలలో అమెరికా సూచనలకు ఎదురుచూస్తూ వుంటయ్యి. అమెరికాలో ఎన్నికలు జరిగి రిపబ్లికన్ పార్టీ తరపున కన్సర్వేటివ్ ప్రభుత్వం ఏర్పడి పని ముందుకు సాగలేదు.

## బ్రాండిట్ కమిషన్ : తరువాత ఇబ్బందులు

ఉత్తర దక్షిణ దేశాలను కలిపి సంప్రదింపులు సాగించేందుకు "బ్రాండిట్ కమిషన్" ఏర్పర్చ బడింది. పారిశ్రామిక వర్ధమాన దేశాల పరస్పర ఆధారత సత్యమని ఎంచిన ప్రాతిపదిక మీద చేయబడిన యీ కమిషన్ సిఫారసులు ప్రపంచ మనుగడకు కార్యక్రమంగా ఎంచబడుతున్నవి. పశ్చిమ దేశాల్లో బ్రాండిట్ కమిషన్ రిపోర్టు ఉత్సాహాన్ని రేకెత్తించలేదు. అయితే 1980 లో జరిగిన ఏడు ప్రముఖ పారిశ్రామిక దేశాల సమావేశం యీ రిపోర్టును హర్షించింది. ఉత్తర - దక్షిణ సంప్రదింపులు మొండి పడినయ్యి. 1982 అక్టోబరులో మెక్సికోలో జరపాలని నిర్ణయించ బడిన "చిన్నశిఖరాగ్ర సమావేశం" మీద కొంత ఆశపెట్టుకున్నారు. జూలైలో ఒట్టావాలో జరగవలసిన పారిశ్రామిక దేశాల సమావేశం ఫలితాలు వర్ధమాన దేశాల ఎడ ప్రెసిడెంట్ రీగన్ చూపే ఆర్థిక వైఖరిపై ఆధారపడతాయని అందరూ అనుకున్నారు. 1970-80 మధ్య జరిగిన సంప్రదింపుల విఫలతనుండి వర్ధమానదేశాలు గుణపాఠాలను గ్రహించలేదు. సమిష్టి స్వయం నిర్భరతమీద ఆధారపడే ఆర్థిక సహకారాన్ని సమకూర్చడానికి కావలసిన సమర్థవంతమైన యంత్రాంగాన్ని వర్ధమాన దేశాలు ఏర్పర్చ లేక పోయినవి. అందువల్ల 1980 తరువాతదశకంలో ప్రపంచ యిబ్బందులు-ముందంజ వేస్తున్న ద్రవ్యోల్బణం, పారిశ్రామిక దేశాలు మందగొడిగా కోలుకొనడం, ప్రపంచ మంతటా ఇంధన సరఫరా అనిశ్చితత, పెచ్చు పెరిగిన ధరలు, ప్రపంచ ద్రవ్య మార్కెట్ల అసమతౌల్యము, నూనెను దిగుమతి చేసుకునే వర్ధమాన దేశాలు అంగీకరించ డానికి వీలుకాని వర్తమాన ఖాతాలోట్లను, ఋణ చెల్లింపుల భారాన్ని మోయవలసి రావడం మొదలైన వాటిరూపాల్లో కొనసాగుతూనే వున్నయ్యి.

## మిత్రరాజ్య సమితి ప్రత్యేక సమావేశాల చర్చనీయాంశాలు

1970-80కి మధ్య మిత్రరాజ్య సమితి జనరల్ ఎసెంబ్లీ ప్రత్యేక సమావేశాలు రెండుసార్లు జరిగినై. (1) ఇతర దేశాల నుండిద్రవ్యోల్బణము, నూనెధరల పెరుగుదల తమ భూభాగంలోకి రావడంవల్ల ఏర్పడిన హీన ఆదాయాలతో బోధపడే వర్ధమాన దేశాలను ఆ కష్టాలనుండి కాపాడేందుకు ఆర్థిక ప్రకటన, కార్యక్రమం గల లక్ష్యంగా నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థను అంగీకరించ డానికి (2) ప్రపంచ ఆర్థిక సంస్థలను పునర్నిర్మాణం చేసేందుకు, వర్ధమాన దేశాలమధ్య వ్యాపారం, వస్తుమారకము, అభివృద్ధివిత్తం అందించడం, ఫ్యాక్టరీ తయారీ వస్తువులను అమ్మడం, ఆర్థిక సహకారంనెరవుకోవడం మొదలైన విషయాలమీద సంప్రదింపులు జరుపుకోవడానికి మార్గదర్శక సూత్రాలను అందించుట, యీ ప్రత్యేక సమావేశాల ఆశయాలు. వీటితో పాటు ఈ దశకంలో జరిగిన మరికొన్ని అంతర్జాతీయ సభలలో విశాలమైన మానవీయ కార్యక్రమం మీద చర్చలు జరిగినై. ఆహారము, వనరులు, మానవ నివాసాలు, సముద్రాలకు సంబంధించిన చట్టాలు, జనాభా, ఔద్యోగిత, నీరు, ఎడారులుగా మారుతున్న భూములు, ఆరోగ్యము, వర్ధమాన దేశాలమధ్య సాంకేతిక సహకారము, అభివృద్ధి కోసం సైన్సు, టెక్నాలజీలు, వ్యవసాయ సంస్కరణలు గ్రామీణాభివృద్ధి మొదలైన విషయాలు ఈ చర్చనీయాంశాలుగా వున్నయ్యి. 1980-90 మధ్య నైరోబీలో ఇంధనం మీద ఒక మిత్రరాజ్య సమితి మహాసభ జరపాలని నిర్ణయించ బడింది. అతి తక్కువ అభివృద్ధి గల దేశాలకు చేయవలసిన సహాయం మీద చర్చకు మరొక మిత్రరాజ్య సమితి మహాసభను పారిస్‌లో జరపడానికి నిర్ణయించ బడింది.

## వర్ధమాన దేశాల అభివృద్ధికి అవసరమైన పరిస్థితులు

తమ అనుభవాల నుండి ఏర్పర్చుకున్న అభిప్రాయాలను పరస్పరం తెలుపుకోవడానికి వివిధ దేశాలకు, ఈ సమావేశాలు వేదికలుగా ఉపయోగపడినవి. అయితే తమ అవసరాలకు, పరిసరలకు తగినట్లు ఉత్పత్తి, సమానత్వంగల ఆదాయం పంపిణీ పద్ధతులు, పారిశ్రామికీకరణ, సాంకేతిక విజ్ఞానస్థాయిలకు సంబంధించి వారు ఏర్పర్చుకునే వ్యూహాలమీద వర్ధమాన దేశాల అభివృద్ధి ఆధారపడి వుంటుంది. ఆహార, ఇంధనాలను ఉత్పత్తి చేసుకోవడానికి వనరుల్ని సమీకరించడానికి పరస్పరం ద్రవ్య చెల్లింపులు చేసుకుంటూ మార్కెట్ సౌకర్యాలను ఏర్పాటు చేసుకోవడాని

యంత్రాంగాలను ఏర్పాటు చేసుకోవడానికి, ప్రపంచ వనరుల్ని న్యాయ బద్ధంగా కేటాయింపు చేయించడానికి ఉత్తర (ధనిక) దేశాలతో పట్టుదల గల సంప్రదింపులు జరపడానికి, వర్ధమాన దేశాలు రాజకీయ పట్టుదలతో ఐక్యంగా పని చెయ్యాలి. ధనిక దేశాలు రోజుకు ఒక బిలియన్ డాలర్లను సైనిక పోషణకు ఖర్చు చేస్తున్నయ్యి. కాని ఇందులో 5 శాతం కంటె తక్కువ మొత్తమే వర్ధమాన దేశాలకు వారిచ్చే అధికార సహాయంగా వుంటోంది.

## అభివృద్ధి వ్యూహానికి ఆధార పత్రం

1980-1990 మధ్య జరగవలసిన ప్రపంచ ఆర్థికకాభివృద్ధికి విశాలమైన వ్యూహం ఏర్పాటు చేయబడింది. ఉత్తర (ధనిక) - దక్షిణ (బీద) దేశాలమధ్య ఫలవంతమైన సంప్రదింపులు జరిగితేనే ఈ వ్యూహం అసలు జరుగుతుంది. ఈ సంప్రదింపులకు ప్రాతిపదికగా బ్రాండిట్ కమిషన్ ఒక అధికారిక ఆధార పత్రాన్ని తయారు చేసింది. ప్రపంచ ఆర్థికాభివృద్ధికి జరిగే అంతర్జాతీయ చర్చల జయాపజయాలు ఉత్తర-దక్షిణ దేశాల సంప్రదింపుల సాఫల్యతకు గీటురాయి. ఈ సమావేశం జరుగవలసిన రీతి, యిందులో జరుగవలసిన కార్యక్రమం మీద అభిప్రాయభేదాల కారణంగా అనుకున్న రీతిని 1981 జనవరిలో చర్చలు ప్రారంభం కాలేదు. 1981 అక్టోబరులో జరగవలసిన "చిన్న శిఖరాగ్ర సమావేశము" యీచర్చలు జరగడానికి బలమివ్వగలదని ఆశించబడింది. అయితే 1982 వరకు పనిజరగదని కూడా అనుకున్నారు. ఉత్తర (ధనిక)- దక్షిణ (బీద) దేశాల సంప్రదింపుల సాఫల్యత పైనే నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ నిర్మాణంపై పుకుసాగే ప్రయాణ పురోగతి ఆధార పడి వుంటుందనేది నిర్వివాదాంశం.

## వర్ధమాన దేశాల ఆర్థిక లక్ష్యాల సాధనకు

1979లో "గ్రూప్ అఫ్ 77" డిక్లరేషన్ ఆధారంగా 1980లో హవానాలో జరిగిన అలీన రాజ్యాల శిఖరాగ్ర సమావేశము, 1981 ఫిబ్రవరిలో ఢిల్లీలో జరిగిన అలీనరాజ్య విదేశాంగ మంత్రుల సమావేశము వర్ధమాన దేశాల ఆర్థిక లక్ష్యాలను ప్రకటించాయి. వీటిని సాధించడానికి వర్ధమాన దేశాలు తమ మార్గాల లోని విభేదాలను పరిష్కరించుకోవాలి. ఈ పరిష్కార సాధనకు గాను వర్ధమాన దేశాలు ముఖ్య సమస్యల పరిష్కారానికి ఒకే ఒక వ్యూహాన్ని సంప్రదింపుల్లో వుపయోగించడానికి సమష్టిగా ఏర్పర్చుకోవాలి. 'సలహా ఫోరమ్'ను ఏర్పాటుకూడా సంప్రదింపుల్లో వీరికి తోడ్పడగలదు. నూనెను ఉత్పత్తి చేసి ఎగుమతి చేసే దేశాలీ మధ్యన బీద స్థితిలో వున్న వర్ధమాన దేశాలకు ద్రవ్యనిధులిచ్చి సహాయం చెయ్యాలని గుర్తిస్తున్న కారణంగా నూనె దిగుమతి చేసికోని దేశాలు నూనె నుత్పత్తిచేసి ఎగుమతి చేసే దేశాల సహాయాన్ని సమీకరించాలి.

## వర్ధమాన దేశాల సహకార కర్తవ్యాలు

1980-1990 మధ్య ఆర్థిక సంక్షోభం మరింతగా హెచ్చుతుంది. ఇందువల్ల దక్షిణ దేశాలు (బీద దేశాలు) దక్షిణ - దక్షిణ దేశాల పరస్పర సహకారాన్ని పెంపొందించే అవసరమున్నది. నూనె ధరలు స్థిమితంగా వుంటాయనే గ్యారంటీలేదు. నూనెను ఎగుమతి చేసేవారికి మినహా, మిగతా వర్ధమాన దేశాలకు వ్యాపార షరతులు బాధలు కలుగజేస్తున్నాయి. అద్యతన భావిలో నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ కోరినరీతిలో ప్రపంచ ఆర్థిక వ్యవస్థ, ఆర్థిక సంస్థలు పునర్నిర్మితమయ్యే అవకాశము కన్పించుట లేదు. ఉత్తర - దక్షిణ దేశాల పరస్పర నిర్భరతను త్రోసి రాజనలేము. ప్రపంచ చర్చలు దక్షిణ దేశాలను ఆదరించాలి. వర్ధమాన (దక్షిణ) దేశాలు తమలోతాము బాగా సహకరించుకోవాలి. 1980-90 మధ్య వర్ధమానదేశాలు పరస్పర సహకారంతో స్వయంనిర్భరతను సాధించాలి. ఉత్తరదేశాలతో సమష్టిగా బేరాలుసాగించాలి. అవసరమైతే ధనికదేశాలకు వ్యతిరేకంగా పనిచేసి వాటి వ్యతిరేకతను తొలగించాలి. ఇట్టివ్యూహం బాగా ఉపయోగపడుతుంది.

దక్షిణదేశాల ఆర్థికవ్యవస్థలు పరస్పరమెరుగుదలకు తోడ్పడ గలవు. తమ ఆర్థికవ్యవస్థల్ని బలంగా నిర్మించుకునేందుకు వర్ధమానదేశాలు(దక్షిణ లేక బీదదేశాలు) నైపుణ్యంగల తమ అంగబలాన్ని, సాంకేతిక సామర్ధ్య శక్తులను, ఖనిజసంపదను, ఫ్యాక్టరీఉత్పాదనశక్తుల్ని యితర ప్రకృతి ఆదిగాగల సహజ వనరులు లేక వరప్రసాదాలను సమైక్యంచేసి ఉపయోగించు కోవచ్చు.

## నిరుత్సాహ పరిస్థితులు

ఆర్థిక మాంద్యము, ద్రవ్యోల్బణము, నిరుద్యోగము యిప్పట్లో కావలసిన మేరకు తగ్గవు. పరిష్కారానికి జరిగే చర్చలు విఫలమౌతున్నా, నిరుత్సాహ పడకుండా ప్రయత్నించాలని ప్రపంచ రాజ నీతిజ్ఞులు అంటున్నారు. (1) పాక్షిక వ్యాఖ్యానాలను, ఫలితం లేని చర్చలను ఆపాలి. ప్రపంచ పరిస్థితుల్ని సమిష్టిగా, సహేతుకంగా విశ్లేషించాలి. (2) నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ నిర్మాణానికి స్పష్టంగా, బలంగా, పట్టుదలతో కృషి సల్పాలి. (3) ఈ నూతన ఆర్థిక వ్యవస్థను వాస్తవికంగా వుండే సమిష్టి కృషిద్వారా సాధించాలి. ఈ మూడు విషయాలను యింకా వివరిద్దాము: (ఎ) ఆర్థిక వృద్ధి రేటు తగ్గిపోతూ వుంది. ఇందు వల్ల ఆర్థికాభివృద్ధి దెబ్బ తింటోంది. ఇందువల్ల యితర సమస్యలు కూడా పరిష్కారం కావడంలేదు. కొన్ని వర్ధమాన దేశాల్లో యిది వరకు వృద్ధిరేటు సగటు కొలతకు పైగా వున్నా యిప్పుడీ యిబ్బందులు అన్నిరాజ్యాల్ని పీడిస్తున్నయ్యి. (బి) ద్రవ్యోల్బణం చాలాకాలంనుండి పట్టి పీడిస్తోంది. ఈ బాధ విస్తరించి, పొంగి ప్రధాన సమస్యగా పరిణమించింది. (సి) వ్యాపార చెల్లింపుల సంతులనం వివిధ వక్రరీతుల్లో పోయి బాధ పెడుతోంది. 1980లో నూనె ఎగుమతిదార్లకు 115 బిలియన్ డాలర్ల మిగులురాగా, పారిశ్రామికంగా వృద్ధిచెందిన నూనె దిగుమతి దార్లకు 47 బిలియన్ డాలర్ల లోటు, వర్ధమాన దేశాల్లోని నూనె దిగుమతి దార్లకు 68 బిలియన్ డాలర్ల లోటు వచ్చింది.

## క్షీణ స్థితి విషఫలితాలు

ఇందువల్ల మూడు విషయాలు తేలుతున్నవి. (1) పారిశ్రామిక, వర్ధమాన, సోషలిస్టు, మార్కెట్ ఆర్థిక వ్యవస్థ దేశాల్లో ప్రతి ఒక్కటి నష్టపోతూవుంది. (2) నూనె వస్తువులు, పరిశ్రమల నుండి వచ్చేవస్తువుల ధరలు పెరిగినష్టపోతూవున్న బలహీన ఆర్థిక దేశాలు మరింతగా దెబ్బతిన్నవి (3) అప్పుచేసి ఆర్థికాభివృద్ధి చేసుకుంటున్న వర్ధమానదేశాలు (1973 తర్వాత కూడా వృద్ధిని కొనసాగిస్తూనే వున్న దేశాలు) తమ కొనుగోళ్ళ ద్వారా అంతర్జాతీయ పరిస్థితుల్ని పోషించి కాపాడుతూ వచ్చినవి. కాని ఆ చేసిన అప్పులు నేటి వాటి బలహీనతలకు, ఆర్థిక వృద్ధిరేట్లు తగ్గిపోవటానికి కారణ మౌతున్నవి. ఈ క్షీణపరిస్థితులు కొనసాగితే ప్రపంచ ఆర్థిక వ్యవస్థ మరింతగా దిగజారే ప్రమాదం ఏర్పడుతుంది కాబట్టి శ్రద్ధతో, అర్జంటుగా, ఎగుడు దిగుళ్ళు లేకుండా తగిన వాస్తవిక చర్యల్ని వేగంగా అమలుజరిపి క్షీణస్థితిని అదుపుచేసి ఆర్థిక మెరుగుదలకు తోడ్పడాలి.

## క్షీణస్థితిపై వ్యాఖ్యలు : ముందంజవేయవలసిన దేశాలు

పై విశ్లేషణను వివిధదేశాలు అంగీకరిస్తున్నవి. ఈ సంక్షోభం కేవలం ఆర్థికకారణాల వల్లనే రాలేదు. ఈ సమస్య వెనుకవున్న కారణాలు, దీనిస్వభావము వివిధమైన వాఖ్యానాలకు గురికాబడినవి. ఒకవ్యాఖ్య ననుసరించి కష్టాలకు ఇంధనం ధర పెరగడం కారణం. ఈధరమొత్తంగాను, రేట్లమార్పిడితోను అనుకూలంకాని రీతిలో పెరిగింది. ఇదొక్కటే కారణం కాకపోవచ్చు. లోటుబడ్జెట్లు కూడా కొంతవరకు కారణం కావచ్చు. పారిశ్రామిక దేశాల యీ కష్టాలకుకారణమని మరొక వ్యాఖ్య చెబుతోంది. ఈ దేశాల అభివృద్ధితో కూడిన అహంభావత్వం, హద్దులేనివారి వినియోగాలు కారణాలని ఈ వ్యాఖ్యభావం. అయితే పారిశ్రామిక దేశాల సచేతనప్రవర్తన ప్రపంచ ఆర్థికవృద్ధికి దోహదం చేయదా అని యీ వ్యాఖ్య విమర్శించబడింది. మార్కెట్ ఆర్థికవ్యవస్థ విఫలత కష్టాలకు కారణమయ్యిందని మరొకరు వ్యాఖ్యానించారు. ఇలా వ్యాఖ్యానిస్తున్నవారి దేశాల్లో కష్టాలులేకుంటే యీ వ్యాఖ్యకు తగినంతగా అర్థవంతమైనదని చెప్పవచ్చు. ఈ వ్యాఖ్య, అభివృద్ధికి కొద్దిపాటి సహాయం మాత్రమేచేస్తూ, వర్ధమానదేశాలనుండి కొద్దిపాటి ఎగుమతుల్నే అంగీకరించే వారినుండి కానట్లయితే పెద్దగా అనుమానించ బడేదికాదు. దూషణ భూషణలు హద్దులుదాటరాదు. కష్టాలందరికి వున్నయ్యి. అందరూ కలసి వాటిని ఎదుర్కోవాలి. వర్ధమాన దేశాలకు సహాయం చెయ్యటానికి తగిన విధానమనుసరించి, ఉపయోగకరమైన చర్య తీసుకోవడానికి మూడురకాలదేశాలు ముందంజవెయ్యాలి.(1) మార్కెట్ విధానాన్ననుసరించే పారిశ్రామిక దేశాలు తీవ్రమైన బడ్జెట్, ద్రవ్య విధానాలను అనుసరించాలి. నూనెను పొదుపుగా వాడాలి. నూతన ఇంధన మూలాలను కనిపెట్టాలి. ఇతరదేశాల వస్తువుల్ని తమమార్కెట్లకు రానివ్వాలి. అందుకు అనువుగా పారిశ్రామికమైన సర్దుబాటు చేసుకోవాలి. ప్రపంచ ఆర్థికవ్యవస్థ పెరుగుదలకు కావలసిన ప్రశాంతమైన ప్రాతిపదికను ఏర్పర్చాలి. (2) పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన సోషలిస్టుదేశాలు- గతితార్కికాలేవీ మినహాయింపులు యివ్వవు కాబట్టి- ఆర్థికసహాయంచేస్తూ, తమ మార్కెట్లకు యితరదేశాల వస్తువుల్ని రానివ్వాలి. (3) నూనెఎగుమతి చేసే దేశాలు నూనె

సరఫరా, దాని నిర్ణయం విషయంలో బాధ్యతగల్గి నడచుకోవాలి. వారిలో కొంతమంది ధనము దినదిన ప్రవర్ధమానమౌతుంది కాబట్టి బీదదేశాలకు బాగా ఆర్థిక సహాయం చెయ్యాలి.

## చాలని పరిష్కారాలు

నేడున్న ఆర్థిక వ్యవస్థలో కొద్ది సర్దుబాటు చేస్తే చాలదు. స్వల్పకాలీన ఉపశమనానికి తాత్కాలిక పరిష్కార మార్గాలను అమలుజరపడం చాలదు. రెండవ ప్రపంచ యుద్ధానంతరానికి బ్రతికివున్న ఆర్థికవ్యవస్థ సరిగ్గా పనిచేయడంలేదు. కూలిపోతూ కూడా ఉన్నది. ఈ ఆర్థికవ్యవస్థ నిర్మాణానికి పూనుకున్న ఫ్రాన్సు వంటి దేశాలు, దాన్ని ఛాలెంజిచేసే దేశాలుకూడా యీ విషయాన్ని అంగీకరిస్తున్నవి. అందువల్ల నూతన అంతర్జాతీయ వ్యవస్థను నిర్మించాల్సివుంది. అధికార బల సంబంధాలలోవున్న అనుకూలతను ఉపయోగించుకుని కొన్ని దేశాలపైన ఏదో ఒక దేశం విజయాన్ని, పెత్తనాన్నిపొందడం ప్రపంచ వ్యవస్థ లక్షణం కాకూడదు. మానవ జాతి తానిదివరకు సాధించిన వాటికి మించిన విజయాలను సాధిస్తూ ముందంజ వెయ్యాలి. మనమంతా ఐక్యంగా పనిచేస్తే యీ లక్ష్య సాధనకు మార్గా న్నేర్పర్చవచ్చు. ప్రారంభించిన మంచి పనుల్ని పూర్తిచేయవచ్చు కూడా.

## శ్రద్ధ చూపవలసిన అయిదు విషయాలు

ప్రపంచదేశాల అంతర్జాతీయ కమిటీ అంగీకరించిన అయిదు విషయాలమీద మనం శ్రద్ధవహించాలి. (1) వర్ధమాన దేశాల కొనుగోలు శక్తిని పెంచాలి. 'కామన్ ఫండ్' ఏర్పాటు బాగానే వుంది. వర్ధమానదేశాలు తమ ఎగుమతులవల్లవచ్చే సంపాదనలను నిలకడ చేసుకోవడము లేదా వారి ఉత్పత్తుల విలువల్ని పెంచుకోవడము వస్తుసంబంధమైన అంతర్జాతీయ ఒప్పందాలవల్ల జరగాలా లేక ఇతర మార్గంలో జరగాలా అన్నది సమస్యగావున్నది. (2) ప్రపంచ ఆర్థికాభివృద్ధికి ఇంధన శక్తి కీలకము. ఇందువల్ల ఏర్పడే సమస్యల్ని నూనెను ఉత్పత్తిచేసే దేశాలేగాక పారిశ్రామిక దేశాలు, ప్రపంచ సమాజముకూడా పూనుకుని పరిష్కరించాలి. ప్రపంచ ఆర్థికవ్యవస్థచే పనిచేయించడానికి నూనెను ఉత్పత్తిచేసే దేశాలు బాధ్యత వహించాలి. పారిశ్రామిక దేశాలు వినియోగాన్ని తగ్గించి నిలువచెయ్యాలి. పెట్టుబడిని పెంచాలి. క్రొత్త ఇంధన మూలాలను కనిపెట్టాలి. ఫ్రాన్సు ఇందుకు పూనుకోగా మంచిఫలితాలు కన్పిస్తున్నవి. ఈ దశాబ్దంలో ఫ్రాన్సు యీ కార్యక్రమాన్ని సాంద్రించేస్తుంది. అంతర్జాతీయ సమాజం హెచ్చుగా నిధుల్ని అందించి నూతన ఇంధన మూలాలను కనిపెట్టి పెంపొందించడానికి తోడ్పడాలి. ఇంధనంమీద గోష్ఠిజరిపి నూతనభావాలను సేకరించి తగినకార్యక్రమాల నేర్పర్చి మంచిఫలితాలను పొందితే అందరికీ మంచిదే. ఇందువల్ల ధరలు తరుగుతాయి_ సరఫరాలు

# మీ పిల్లల భవిష్యత్తుకు బంగారు బాట
# లార్స్విన్ ఫైనాన్స్

[illegible]

| కాలము | వడ్డీ రేటు |
|---|---|
| [illegible] | [illegible] |
| [illegible] | [illegible] |
| [illegible] | [illegible] |
| [illegible] | [illegible] |
| 2 1/2 [illegible] | [illegible] |
| 3 [illegible] | [illegible] |

కనీస పెట్టుబడి రు. 1000 లు

రు. 50,000లకు పైబడిన 3 సంవత్సరముల పెట్టుబడులపై రు. 1500 ప్రత్యేక ఇన్‌సెంటివ్ వడ్డీ ఇవ్వబడుతుంది. వడ్డీ ప్రతి నెల ఇవ్వబడుతుంది.

[illegible]

మీ పిల్లల చదువులకూ, వివాహాది శుభకార్యాలకు మీ వృద్ధాప్యంలో అవసరాలకు పనికి రావాలంటే లార్స్విన్ లక్షాధికారి పథకంలో చేరండి.

ఇప్పుడు రు. [illegible] లు మీరు డిపాజిట్ చేస్తే [illegible] సంవత్సరాల తరువాత మీకు గాని, మీ వారసులకుగాని రు. [illegible] లు అంద చేయబడతాయి.

వివరాలకు వెంటనే వ్రాయండి.




(A unit of Larsvin Group of Industries)

315, 3rd ఫ్లోర్, చంద్రలోక్ కాంప్లెక్స్,
సరోజినిదేవి రోడ్, సికింద్రాబాద్-500 003.
Phone : 822359

అందుతాయి - (3) అంతర్జాతీయ వ్యాపారాభివృద్ధి ముఖ్యమైనది. ఇందుకుగాను వివిధ రూపాల్లోవున్న ఆర్థికరక్షణ (ప్రొటెక్షనిజమ్)ను తొలగించడానికి అందరూ గట్టిగా పనిచెయ్యాలి. వర్ధమాన దేశాలకు అనుకూలంగా ఫ్రాన్సు తనఉత్పాదన చట్రంలో సర్దుబాట్లు చేయడానికి పూనుకుంది. (4) ప్రపంచ ఆర్థికాభివృద్ధికి ప్రభుత్వాలు అధికార ఆర్థికసహాయాన్ని పెంచాలి. ముఖ్యంగా నేటి సంకటస్థితిలో, అభివృద్ధికి యితర వనరులులేని దేశాలకు అధికార ఆర్థిక సహాయంవల్ల లాభం చేకూరుతుంది. నూతనదశక ఆర్థికాభివృద్ధికి యీ వ్యూహము ముఖ్యము. అధికార ఆర్థిక సహాయానికి లక్ష్యాలను నిర్ణయించాలి. ధనికదేశాలు ఎంతెంత చెల్లించాలో నిర్ణయించాలి. తన వెరశి జాతీయాదాయంనుండి ఫ్రాన్సు 0.7 శాతం చెల్లిస్తుంది. ఈ సహాయం కాలబద్ధంగాకూడా ఉండాలి. మార్కెట్ ఆర్థికవ్యవస్థ దేశాలు, ఇతరదేశాలుకూడా యిందుకు పూనుకోవాలి. (5) అంతర్జాతీయవిత్త సంస్థలను బల పర్చాలి. వర్ధమానదేశాల ప్రత్యేకసమస్యల పరిష్కారానికి సంస్థలు పనిచేసేట్లు చెయ్యాలి. ఈ మార్గాన్ననుసరించడానికి రాజకీయ పట్టుదలవుండి, పనిచేయవలసిన రంగంమీద అంగీకారం కుదిరితే, వివిధదేశాల విభేదాలు సమస్యా పరిష్కారానికి ఆటంకం కాజాలవు. ఈదశలో జరిగే సంప్రదింపులు ఉత్తర- దక్షిణ దేశాల భవిష్యత్ సంబంధాలలో కీలకదశ కాగలవు. ధనికదేశాల నిర్ణయాన్నిచ్చట స్పష్టీకరించాలి. అంతర్జాతీయ సమావేశాల్లో పాల్గొనే వివిధదేశాల విదేశాంగమంత్రులు తమరాజకీయ పట్టుదలను ప్రకటించి తమ ప్రభుత్వాలచేత అధికారసహాయం చెయ్యించాలి. ఈ సమావేశ నిర్ణయాలను ప్రతి దేశం అమలుచేసి వాస్తవంచెయ్యాలి. మిత్రరాజ్య సమితి సూత్రాలను, వివిధదేశాలు మిత్రరాజ్యసమితితో చేసుకున్నఒప్పందాలను అనుసరించి అంతర్జాతీయ సమావేశనిర్ణయాలను మిత్రరాజ్యసమితి, ఆ సమావేశాలలో పాల్గొన్న దేశాలచేత అమలు జరిపించాలి.

## నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థకు మూడు ప్రాతిపదికలు

నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ ఏర్పడాలంటె, అది ఏ ప్రాతిపదికమీద ఏర్పడాలో గమనించాలి. మూడు ముఖ్య ప్రాతిపదికల నిక్కడ పేర్కొందాము. (1) మానవీయమైన ప్రాతిపదిక ముఖ్యమైనది. మానవజాతి, ఆర్థికస్థితిని మెరుగు పర్చందే లాభం లేదు. ముఖ్యంగా ఆకలి, పేదరికంతో బాధపడే వాస్థితిని బాగు చెయ్యాలి. (2) తరువాత భౌగోళిక ప్రాతిపదిక. ఇది భౌగోళిక సత్యాల సముదాయము. ఇవి అభివృద్ధికి మూలమేగాక, రూపకల్పన కూడా చేయగల శక్తులు. (3) చివరిది ఆకస్మిక పరిస్థితులు. వీటి విషయంలో వేగంగా చర్యలు తీసుకోవాలి. ఇవి సత్యాలు. నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ రూపురేఖల్ని రచించేటప్పుడు క్రింది విషయాలను గణనలోకి తీసుకోవాలి :

## ఆకలిపై పోరాటం

(ఎ) చాలా దేశాల్లో ఆకలి, లోపంగల పోషణ చాలా ప్రాంతాల్లో తీవ్రంగా వున్నయి. ఈ బాధల్ని తొలగించనిదే అభివృద్ధి అబద్ధము. హఠాత్తుగావచ్చే తీవ్రయిబ్బందుల్ని మొదట తొలగించాలి. క్షామం ఎక్కడున్నా యిటువంటి బాధ క్రిందికి వస్తుంది. ఇలాంటి ఘోర ప్రమాదాలు జరిగినపుడు అంతర్జాతీయంగా మానవ సమాజమంతా తమకు వీలున్న వనరుల్ని సమీకరించి యీ ఘోర విపత్తును తొలగించాలి. ఇందుకుగాను అంతర్జాతీయ అత్యయిక రిజర్వునిధి వనరుల్ని పెంచాలి. ప్రతిదేశం ప్రతి సంవత్సరం తాను ఈ నిధికిచ్చే వాటాను పెంచాలి. మిత్రరాజ్యసమితి ఆధ్వర్యాన అత్యయిక రవాణా కార్యబలగాన్ని పెంచి ప్రమాదాన్ని ఎదుర్కోవాలి. ఆహారం తక్కువగావున్న దేశాలు దాన్ని బాగాపండించి పెంచాలి. అటువంటి దేశాలు తమవద్దగల సాంకేతిక పద్ధతుల్ని అనువర్తింపజేసి దీర్ఘకాలీన వ్యవధిలో ఆహారాన్ని అభివృద్ధి చెయ్యాలి. 32 దేశాలకొరకు ఏర్పరుస్తున్న "జాతీయ వ్యవసాయాభివృద్ధి వ్యూహాలు" ఆమోద యోగ్యమైనవి. ఈ వ్యూహాల అనువర్తింపువల్ల ఆహారం పెరిగే వరకు వున్న దేశాలు లేని దేశాలకు ఆహార సహాయం చెయ్యాలి. ఫ్రాన్సు తన ఆహార సహాయాన్ని 30 శాతం పెంచుతుంది. అయితే సహాయం నిర్భరత నేర్పర్చ కూడదు. ఆహారాన్ని దిగుమతి చేసుకుంటున్న వర్ధమాన దేశాలు తమ ఎగుమతుల్ని పెంచి, తద్వారావచ్చిన ఆదాయంతో లోటు భర్తీ చేసుకునేందుకు ఆహారాన్నికొనాలి. ఇందుకుగాను వర్ధమానదేశాల ముడిపదార్థాల ధరలు నిలకడపొందాలి. వీటితోపాటు వారి పారిశ్రామిక వస్తువులు కూడా ఆహారధాన్యాల కొనుగోలులో తమ పాత్రను నిర్వహించాలి. వర్ధమాన దేశాల వ్యవసాయోత్పత్తి పెరిగి, పారిశ్రామికీకరణ జరిగితేనే వారి ఆర్థికాభివృద్ధికి బలమైన ప్రాతిపదిక ఏర్పడి, దానికనువైన స్వాతంత్ర్యము లభిస్తుంది.

## ఆకలిపై పోరాటం పేదరికం మీద పోరాటమే

ఆకలికి వ్యతిరేకంగా జరిగే పోరాటం పేదరికానికి వ్యతిరేకంగా జరిగే పోరాటమే. అయితే జరగవలసిన పోరాటంలో యిది కొద్దిభాగమే. ప్రపంచ బ్యాంకు, తన రిపోర్టులో, ఆహ కొరతలోపం యొక్క పరిమాణాన్ని చెప్పి యిందుకు పరిష్కార మార్గాలను కూడా చూపింది. ఆహారలోపాన్ని గురించి ఎక్కువ చెబితే నూతన ప్రపంచ ఆర్థిక వ్యవస్థ స్థాపన గురించి మర్చిపోతున్నామని భయపడరాదు. చాలా తక్కువ ఆర్థిక అభివృద్ధి దేశాలకు సహాయం చెయ్యడానికి "యునైటెడ్ నేషన్స్ కాన్ఫరెన్స్ ఆన్ ట్రేడ్, ఎయిడ్ అండ్ డెవలప్ మెంట్" మీద ఏర్పాటు చేసిన సమావేశం చర్చలవల్ల వచ్చిన మంచి నిర్ణయాలను పర్చటం అందరికి మంచిది.

## ప్రాంతీయ సహకారాలు

(బి) భౌగోళికసత్యాలు కొన్ని అవసరాలను, ప్రాధాన్యతా క్రమాన్ని తెలియజేస్తున్నవి. ఇవి ప్రాంతీయవ్యాప్త రూపాన్ని, అందులోని భిన్నశక్తుల్ని, ప్రాముఖ్యతను తెలియపరుస్తున్నవి. వీటివల్ల కొన్ని సంభావ్యాలు, స్థలసంబంధమైన పరిమితులు తెలుస్తాయి. ప్రపంచవిస్తృతంగా సమస్యలన్నింటినీ ఒకేసారి పరిష్కరించ ప్రయత్నించరాదని, ఒకేకేంద్రంనుండి సమస్యలన్నింటిని పరిష్కరించేప్రయత్నం చేయరాదని వాటివల్ల తెలుస్తుంది. ఈ సలహాను పాటించడంవల్లనే 'యూరోపియన్ ఎకనామిక్ కమ్యూనిటీ'కి భాగ్యంవర్ధిల్లి స్థిమితము, శాంతిలభించినవి. ఇలాగే ఎసోసియేషన్ ఆఫ్ సౌత్ ఈస్ట్ ఏషియన్ నేషన్స్, వెస్ట్ ఆఫ్రికన్ ఎకనామిక్ కమ్యూనిటీ, ది ఎకనామిక్ కమ్యూనిటీ ఆఫ్ వెస్ట్ ఆఫ్రికన్ స్టేట్స్, ఎండియన్ ఫాక్ట్ మొదలైన సంస్థలుకూడా విజయాలు చేకూర్చినవి. లాగోస్ లో సమావేశమైన ఆఫ్రికన్ దేశాల అధినేతలు తమ ఆఫ్రికాఖండాని కంతకు ఒక ఆర్థిక కార్యాచరణ ప్రణాళికను ఆమోదించారు. మెక్సికో, వెనజోలా దేశాలు తమ యిరుగు పొరుగు సెంట్రల్ అమెరికన్, కరీబియన్ రాజ్యాలకు నూనె అందజేసి, దానివెలను ఆదేశాల అభివృద్ధికి సహాయం చేస్తామని ప్రకటించారు. ఈరెండు ప్రపంచధోరణులకు సమాంతరంగా నడిచే వేరు ధోరణులు అయినా పోటీపడని ధోరణులేగాక ఒకచర్య మరొకచర్యకు దోహదం చేయగలదు.

ఉత్తర- దక్షిణ దేశాల చర్చలమీద ఆధారపడి వచ్చేఅభివృద్ధికి సమతౌల్యము లేకపోవచ్చు. నిర్భరతకూడా ఏర్పడవచ్చు. అందువల్ల బీదదేశాల అభివృద్ధికి పైజెప్పిన అమెరికన్, ఆఫ్రికన్ దేశాల అధినేతల వాగ్దానాలు ఒకరకమైన ఆశాజ్యోతిగా వున్నయ్యి. ప్రాంతీయసహకారము నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థకు ఒక ముఖమని చెప్పవచ్చు. ప్రాంతీయ సహకారాలవల్ల వివిధ ప్రాంతాలమధ్య విరోధంరాదు. అందువల్లనే యూరోపియన్ కమ్యూనిటీ, 58 ఆఫ్రికాదేశాలు (కరీబియన్ అండ్ పసిఫిక్) సహకరించుకుంటున్నారు. అదేవిధంగా యూరోపు, ఆఫ్రికా, అరబ్ దేశాలమధ్య సహకారం జరగాలి. ఇందులో సాంస్కృతిక అనుబంధాలు, చారిత్రక సంబంధాలు తమపాత్రను నెరవేర్చితే, 'ఆర్థిక తప్పనిసరి దనము' యిందుకు తోడుకాగలదు.

## అతిబీదదేశాలకు మొదటగా సహాయం

(సి) అత్యయిక పరిస్థితుల వత్తిడి గట్టిది. వేగంగా జోక్యం చేసుకుని చెడును తొలగించాలి. ఎక్కువ బాధపడేవారికి ముందుగా తొందరగా సహాయం చెయ్యాలి. వీటివల్ల ప్రధానసమస్య వెనుకబడాలని ఎవరూ అనరు. చాలా వర్ధమానదేశాలకు తొందరగా సహాయం అందాలి. ఇంధనాన్ని వృద్ధిచేయడానికి ప్రపంచబ్యాంకు చేసే ఆర్థిక (పెట్టుబడి) సహాయంయింకా విస్తృతంకావాలి. వర్ధమానదేశాల వాస్తవ పరిస్థితుల్నిదృష్టిలో వుంచుకుని, అంతర్జాతీయ ద్రవ్యనిధికూడా వర్ధమానదేశాలకు సరళమైన షరతులమీద తొందరగా వనరులను (సౌకర్యాలు తాను యివ్వగల్గినవి) సమకూర్చాలి. అధికార ఆర్థికసహాయం పెరగాలని మిత్రరాజ్యసమితి సెక్రటరీ జెనరల్ చెబుతున్నారు. ఇది అనుసరించవలసినవిషయం. చాలతక్కువ అభివృద్ధివల్ల అతిహీనంగావున్న దేశాలకు సహాయం చేయవలసిన అవసరానికి ప్రాధాన్యత యివ్వవలసివుంది కాబట్టి సహాయం చేయగలస్థితిలోవున్న పాశ్చాత్యదేశాలు, సోషలిస్టు దేశాలు, నూనెఉత్పత్తిచేసే దేశాలు సహాయంచెయ్యాలికాబట్టి వెంటనే వారు కార్యోన్ముఖులు కావటము అవసరము. అయితే అందరూకలసి ఐక్యంగా పనిచేస్తే మంచిఫలితం వస్తుంది. ఏ సమస్య కూడా పరిష్కారానికి అతీతంకాదు. నిరుత్సాహన్ని క్షమించరాదు. ఆలోచనతో, పట్టుదలతో పనిచేయడానికి సమయం వచ్చింది. పరిస్థితులు క్షీణిస్తున్నాయి. మనచేతల కనుసారంగానే భవిష్యత్తు వుంటుంది. కొన్ని తృతీయ ప్రపంచదేశాలు - అనగా వర్ధమానదేశాలు- బాగాప్రయత్నించి సత్వర ఆర్థికాభివృద్ధిని, అంతర్జాతీయ వ్యాపారాన్ని, ద్రవ్యస్థిమితాన్ని, ప్రాంతీయ ఐక్యతను పెంపొందించుకోవడం ముదావహం. ఇందువల్ల మంచి ఫలితాలు చేకూరగలవనే ఆశ కన్పిస్తోంది ఈ ఆశల్ని వాస్తవాలుగా మార్చాలి. నూతన అంతర్జాతీయ ఆర్థికవ్యవస్థ తన్మూలంగా ఉద్భవించాలి. ఈ వ్యవస్థరావడం ఉత్తర- దక్షిణదేశాలకు సమానంగావుండే ఇచ్చకు అనుకూలము. మానవజాతి ఇంతకంటె కోరే మంచి మరేమీ వుండదు. నూతన అంతర్జాతీయ ఆర్థికవ్యవస్థ ఏర్పడటం చాలన్యాయంగాను, సబబుగాను వుంటుంది.



# పుష్పొడి చినుకులు

"సాంధ్యశ్రీ"

పుడమి తల్లి పూర్ణ గర్భిణి
పుట్టుకలతో నిత్య బాలెంత
తరాల్ని మోస్తుంది - అంతరాల్ని
ఆహ్వానిస్తుంది - ఆదరిస్తుంది ....

రంగు లద్దిన పూల రేకులమీద పుప్పొడి సందేశాలు రాసి
చరిత్ర కప్పగిస్తుంది
తుమ్మెదలై తిరిగే జాతి ఎల్లల్లో బంధింపబడదని
నేలకు తెలుసు ....

సుత్తు లెత్తిన చేతుల్లో పూల గుత్తులు పూయిస్తుంది
పరిమళ శ్రామికులారా ఏకం కండని ....

గుండెల్ని వెల్తురు జండాలుగా ఆకాశం నిండి పొమ్మని
ఆదేశిస్తుంది ....

యుగం నిత్య నూతనంగా మలచబడుతున్న
మట్టి చేతుల్లో
ఒడిగిపోతున్న పసిబాలుడు ఎదిగిపోతున్నాడు శిఖరంలా...
పులకించి పోతున్న పుడమి కలలు కడిమి పూలైన చోట
ప్రజలు నవధాన్యాల బస్తాలు బళ్ల కెత్తి
నాగళ్లకు తయారవుతున్నారు ....

జవసత్త్వాల జడి వాన
జన సముద్రంలో
పంట ముత్యపు చిప్పలు కుప్పతెప్పలు ....

వెలుతుర్ని పార నివ్వని
చీకటి చోటును కూకటి వ్రేళ్లతో పెళ్లగించి
దృష్టి సంచార దీవుల్లో వెల్తురు మొక్కలు నాటి
నింగి నీలానికి పంపే ఖబర్లో
పుప్పొడి చల్లుతాను - సరిహద్దుల్లో సంజె పొద్దుల్లో
చినుకుకు పులకించి తలపు వాసల్ని తట్టకెత్తిన నేల
కడుపు పంట ఔన్నత్యాన్ని
కళ్లతో తాగుతుంది - తనివి తీరా ....

అంతరంగాన్ని స్పృశిస్తున్న మట్టివాసనలో
పర్వతాల గుండెల నిర్భయ వికాస తరంగాలు
అర్ణవ తరంగాగ్ర శీతల శీకర మాలికలో
మానవీ(నీ)య మహాదర్శనాభిజాత్యాలు ...

గగనాగ్రి చుంబిత వృక్ష శిఖరాగ్రాంచలాల విశ్వ దృష్టి
సంకేతాలు

విప్లవిస్తున్నప్పుడు
సూర్యమండలోపాసన జేస్తూ
మానవ శిశువు
మాతృగర్భంలో భూమండల యాత్రకు సమాయత్తమవు
తున్నాడు ....

మూలికా మాలికలు
వనస్పతులు
వసంత సంతర్పణలు
అజస్రంగా అందిస్తున్న హరిత బహుకుర్వీత వ్రత
మట్టి
ఒడిలోకి మనిషి రావటం మహాపర్వం ....

కనుకనే మనిషిని కనేతల్లి
తపసుకు ముందు మృత్తికా మాతృశక్తికి
మోకరిల్లుతుంది ....

తేజోపాసిత పర్జన్యం చినుకుల్ని ఒలికిస్తుంది.
చినుకుల్ని ఒడిగట్టి నేల ధాన్యాన్ని చిలికిస్తుంది

◆ ఈ దశలోనే
తల్లి తపసు నేర్పుతుంది పిండ సంస్కారానికి ....
ఈ క్రమాస్నాతుడైన మనిషికి
ఆహ్వాన గీతాలు రాస్తూ ....

---

◆ "యాభి రాదిత్య స్తపతి రశ్మిభిస్తాభిః పర్జన్యో వర్షతి....
.... .... .... .... ....
........విజ్ఞానేన ఆత్మానాం వేద యతి."

శ్రీ బులుసు వేంకట రమణయ్య

# ఈ శతాబ్దిలోని విజయనగర విద్వత్కవులు

విజయనగర సామ్రాజ్య పతనానంతరం 18 వ శతాబ్దిలో ఉత్తరాంధ్రంలో విజయనగర రాజ్యం తలయెత్తి పెక్కుమంది విద్వాంసులను, కవులను పోషించినది. దానిని పాలించిన రాజులు కూడా స్వయంగా విద్వాంసులూ, కవులూ వుండేవారు. గత శతాబ్ది చరమ భాగంలో ఉండిన అభినవ భోజుడు ఆనందగజపతి మహారాజు, ఆంధ్రభోజుడైన శ్రీకృష్ణదేవరాయలకు అన్నివిధాలా సాటి అయినవాడని ప్రఖ్యాతిపొంది పెక్కుమంది విద్వత్కవులను పోషించడమే కాక పాశ్చాత్య విద్వాంసులకున్నూ, ఇతర ప్రాంతాలలోని భారతీయ విద్వాంసులకున్నూ సాటిలేని ఆర్థిక సహాయం చేసి గొప్ప పేరు గడించి యున్నాడు. ఆయన కాలంలో ఉండిన విద్వాంసులు కొందరు ఈ శతాబ్దిలోకూడా చాలాకాలం జీవించి ఉన్నారు. విజయ నగర విద్వాంసు లందరిని గురించీ వ్రాస్తే ఒక చరిత్ర గ్రంథం తయారవుతుంది. అందువల్ల ఇప్పుడు విస్మృతిపథంలో పడుతూ, ప్రసిద్ధికెక్కిన పండితులనూ, కవులనూ గురించి మాత్రమే కొంత చెప్పదలచుకొన్నాను. నేను చెప్పబోయేవారి పేర్లు కొందరికి తెలిసి వుండవచ్చును. కాని వారిని గురించి తెలియకపోవచ్చును. అట్టి ప్రసిద్ధులను గురించి తెలిసికోవడం ఇప్పటివారికి అవసరమని భావించి యీ వ్యాసం వ్రాస్తున్నాను.

ఈ వ్యాసంలో తెలుపబడినవారిలో శాస్త్రవేత్తలూ, కవులూ, చరిత్రకారులూ, భాషా సాంఘిక సంస్కర్తలూ, సంగీత విద్వాంసులూ, మల్లవిద్యాప్రవీణులూ ఉన్నారు.

చదువు ప్రాథమిక పాఠశాలతోనే ముగిసినా, దృఢశరీరుడు కోడి రామమూర్తినాయుడు తన నిరంతరాభ్యాసంమూలంగా మల్లవిద్యలో ఆరితేరి విశ్వవిఖ్యాతిని గడించిన మహావీరుడు విజయనగరంవాడే. ఆయన ఒక సర్కస్‌సంస్థ స్థాపించి తనబలగంతో యావద్భారతం సంచరించడమేకాక, ఇంగ్లాండువెళ్ళి ప్రదర్శన లిచ్చి జార్జి చక్రవర్తి ప్రశంసలను అందుకొన్న ఘనుడు. అప్పట్లో మనదేశంలో కోటి రామమూర్తి సర్కస్, తారాబాయి సర్కస్ అనే రెండు సర్కస్‌లు మాత్రమే ప్రసిద్ధంగా ఉండినవి. బీదలకు టిక్కెట్టులేకుండా ప్రదర్శనలు ప్రత్యేకంగా ఇచ్చిన త్యాగి. చివరి దశలో ఆర్థికంగా చిక్కులలోఉన్నా, పండిత మదనమోహన మాళవ్యా, తమ కాశీ విశ్వవిద్యాలయంలో వ్యాయామశాఖాధిపత్యానికి ఆహ్వానించినా, ఒకరికింద పనిచేయదలచని ఆత్మాభిమాని.

శాస్త్రవేత్తలల్లో మహామహులు విజయనగరం వారే: గుమ్ములూరి సంగమేశ్వర శాస్త్రిగారు న్యాయ వైశేషికాలలో ఉద్దండ పండితులు. ఆయన పెక్కుమంది పేరుపడిన తర్కశాస్త్ర విద్వాంసులను తయారుచేసి విఖ్యాతిగాంచినవారు. వారి సంగమేశ్వరక్రోడపత్రాన్ని ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రకటించినది.

పేరి కాశీనాథశాస్త్రిగారు గొప్ప వ్యాకరణ పండితులేకాక సంస్కృతాంధ్ర సాహిత్యాలలో సమర్థులు. బాణమహాకవి కాదంబరిని సమగ్రంగా కంఠస్థంచేసిన పట్టుదల మనిషి. ఈయన తెలుగులో పూర్వశాకుంతల నాటకాన్ని రచించి ప్రకటించారు. శతకాలు వ్రాశారు. అవి నామమాత్రావశిష్టాలు. వీరు సుప్రసిద్ధ విద్వాంసులు, మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయ శాస్త్రిగారికి మామగారు. తిరుపతి వేంకటకవుల ప్రతిద్వంద్వి.

మహా మహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు బహుముఖ ప్రజ్ఞాధురీణులు. సకల శాస్త్రవేత్తలు. వ్యాకరణ, సాహిత్య శాస్త్రాలు వారి అభిమాన దర్శనాలు. వ్యాకరణ, సాహిత్య శాస్త్రాలలో చాలమంది ప్రసిద్ధ పండితులను తయారుచేసినవారు. విద్యార్థి పక్షపాతులు. గుణం లేశమైనా ఉన్నా, ప్రశంసించి ప్రోత్సాహమిచ్చే కొద్దిమంది పండితులలో వీరగ్రగణ్యులు. వీరికీర్తి భారత దేశమంతటా వ్యాపించింది. వీరి వ్యాకరణ శాస్త్ర గ్రంథం శేఖర గురు ప్రసాదాన్ని మొదట వీరే ప్రకటించారు. అది అసమగ్రం.

వీరి శిష్యులలో ముఖ్యులు ప్రజ్ఞానిధులు పేరి వేంకటేశ్వర శాస్త్రిగారు గట్టి వ్యాకరణ విద్వాంసులు. వారు కావ్యనాటకాదులను కూడా బోధించేవారు. అసమగ్రంగా ఉన్న గురువుగారి గురుప్రసాదాన్ని వీరు పూర్తిచేశారు. ఆ సంపూర్ణ గ్రంథాన్ని ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రచురించింది.

తెలుగు భాషతో పరిచయం బాగా ఉన్నవారికందరికీ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారి పేరు కొత్తది కాదు. అయన ఎందరో విద్వత్పట్టభద్రులను తయారు చేశారు. వారి వలెనే వారి శిష్యులలోనూ కొందరు కళాప్రపూర్ణులే! అయన విజయనగరం సంస్కృత కళాశాలలోనూ, మద్రాసు, ఆంధ్ర విశ్వవిద్యాలయాల లోనూ పరిశోధకులుగానూ, అధ్యాపకులుగానూ పనిచేశారు. బాల వ్యాకరణోద్ద్యోతం, వైయాకరణ పారిజాతం, ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వం, చింతామణి విషయ పరిశోధన మున్నగు గ్రంథాలను, వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యాన విమర్శనము లను రచించారు. కొన్నిటిని వావిళ్లవారు, కొన్నిటిని యూనివర్సిటీ వారు ప్రకటించగా, కొన్నిటిని స్వయంగానే ప్రకటించారు.

విజయనగర ప్రభువుల ఆశ్రితులు, విమర్శకులు, శాసన పరిశోధకులు, సంఘ సంస్కర్త, వ్యావహారిక భాషావాది అయిన గురజాడ వెంకట అప్పారావుగారి వాఙ్మయ సేవను ఎరగని వారె వ్వరూ ఉండరు. అయన వ్రాసిన కన్యాశుల్కం ఆంధ్రులందరి ఆదరాన్నీ పొందినది. గిడుగు రామమూర్తి పంతులుగారు ప్రారం భించిన వ్యావహారిక భాషోద్యమంలో ఆయనకు అండగా నిలిచిన ప్రముఖులిద్దరిలో ఈయన ప్రథములు. రెండవవారు బుర్రా శేషగిరి రావుగారు. వీరు ముగ్గురు కలిసి చేసిన సాహితీసేవ, భాషాసేవ మరువరానివి. విశ్వవిద్యాలయ తరగతులలో వ్యావహారికం ప్రవేశ పెట్టడానికి వీరు అప్పట్లో గట్టి కృషి చేశారు. సంఘ సంస్కరణం ఆదర్శంగా ఈయన ఎన్నో రచనలు చేశారు.

వీరి మిత్రులు, మహారాజావారి కాలేజీలో ఇంగ్లీష్ ప్రొఫె సరు అయిన బుర్రా శేషగిరిరావుగారు వ్యావహారిక వాదుల్లో ముఖ్యులు. చెప్పుకోదగిన పరిశోధకులు. విమర్శాదర్శమున్నగు గ్రంథాలు వ్రాసి, విద్వల్లోకంలో సంచలనం కలిగించారు. భారతీ తీర్థ అనే ఆంధ్రపరిశోధక విశ్వవిద్యాలయమనే సంస్థను స్థాపించి, యువకులకు ప్రోత్సాహమిచ్చేవారు. కొన్నియేండ్లపాటు భారతీ తీర్థ వార్షికోత్సవాలు జరిపి, పెక్కుమంది విద్వత్కవులను, గాయ కులను రప్పించి ఉపన్యాసాలు, గాన ప్రదర్శనలను జరిపించిన కార్యశూరులు.

విజయనగరం మహారాజావారి కాలేజీలో సంస్కృతాంధ్ర పండితులు మేడేపల్లి వేంకట రమణాచార్యులుగారు సంస్కృ తాంధ్ర ద్రావిడాంగ్ల భాషలలో విద్వాంసులు. అయన మొదట సంస్కృత కళాశాలలో కొంతకాలం పనిచేశారట. అయన ఆంధ్ర గీర్వాణ శఠకోప సహస్రం అనితిరువాయ్‌మొళికి సంస్కృతాంధ్రా లలో అనువాదం చేశారు. భాస్కర రామాయణం,ఆముక్తమాల్యద మున్నగు వాటికి విలువైన పీఠికలు, దేవవ్రత చరిత్రమనే ప్రబంధం, పెక్కువ్యాసాలు, వ్రాశారు.

వీరి గురువులు ముడుంబై నరసింహాచార్యస్వామిగారు. ఆయన ఆనంద గజపతి ప్రభువు ఆస్థాన పండితులలో ముఖ్యులు. సంస్కృతాంధ్రాలలో అనేక గ్రంథాలు వివిధ ప్రక్రియలలో రచించారు. ఈ శతాబ్దిలో రమారమి ముప్పయి సంవత్సరాలు జీవించి ఉండిరి. వీరు తమ రచనలను అచ్చువేయుటకు ఒక ముద్రణాలయాన్ని కూడా స్థాపించి కొంతకాలం నడిపారు.

కోకాంబి రామానుజాచార్యులు గారు పెంటపాడు ప్రాంతం నుండి యువకులుగా ఉన్నప్పుడే విజయనగరం వచ్చి, తమ కవితావధానంతో ఆనంద గజపతి ప్రభువును మెప్పించి, తర్వాత ప్రభువుల సహాయంతో ఆంగ్లవిద్య నభ్యసించి, మద్రాసులో ఎం. ఎ., బి. ఎల్. పట్టాలు పొంది ప్రభువుల ఆదరాభిమానాలు చూరగొని కాలేజీలో అధ్యాపకులై, తర్వాత ప్రిన్సిపలు అయారు. తత్పూర్వం చంద్రశేఖరశాస్త్రిగారను తమిళులే కాలేజీ ప్రిన్సిపలు. ఆ పదవిని నిర్వహించిన తెలుగువారిలో వీరే ప్రథములు! అక్కడ రిటైరయాక సంస్కృత కాలేజీకి ప్రిన్సిపలయి, దానిని అన్ని విధాలా అభివృద్ధికి తెచ్చారు. అధికార బాధ్యత వహించాక కవితా వ్యాసంగం మానుకున్నట్లున్నది. మంచి విమర్శకులు. తమ కార్య నిర్వహణలోను, సత్యవాక్పాలనలోనూ శ్రీరామునికి సమానులని మెప్పుపొంది 'రామావతారం' అనిపించుకున్నారు. చాలామందికి ఆయన అసలుపేరు తెలియదు. రామావతారంగా రంటేనే తెలిసేది.

విజయనగరంలో విద్య నభ్యసిస్తూ, విశ్వవిద్యాలయ పరీక్షలు లేని ఆరోజుల్లో కలకత్తా- కావ్యతీర్థ పరీక్షలో కృతార్థు లైన పురాణం సూర్యనారాయణ తీర్థులుగారు తెలుగులో చక్కని కవులు. తిరుపతి వేంకటకవులు వీరికవితాగురువును. మేడేపల్లి వారు విద్యాగురువులు. తిరుపతి వేంకటకవుల వలెనే రసవంతమైన కవిత్వం చెప్పేవారు. కొంతకాలం 'కామేశ్వరి' అనే సాహిత్య మాసపత్రికను నడిపారు. విద్య ముగించుకొని మద్రాసు వచ్చి ఆనంద ప్రెస్సులోను, వావిళ్లవారి వద్దను పనిచేసి, తర్వాత దేశో ద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి ఆదరాన్ని చూర గొని ఆంధ్రపత్రిక ఆఫీసులోచేరి ఆంధ్రవిజ్ఞానసర్వస్వ విభాగంలో పనిచేశారు. వీరు స్వాతంత్ర్య ప్రియులైన కవులు.

కాలేజీలో తెలుగు పండితులుగా ఉండిన మల్లాది విశ్వనాథ శర్మగారు విశ్వనాథ కవిరాజుగా ప్రసిద్ధి చెందారు. చిన్న చిన్న నాటికలు వ్రాయడంలో సిద్ధహస్తులు. హాస్య నాటికారచన వీరి ప్రత్యేకత. ఈయన రచించిన 'అసంపూర్ణరామాయణం' చాలా మందిని ఆకర్షించింది.

భోగరాజు నారాయణమూర్తిగారు మహారాజా కాలేజీ హైస్కూలులో తెలుగు పండితులు. చిన్నప్పుడే చక్కని కవిత్వం చెప్పి 'బాలకవి' బిరుదం సంపాదించారు. విజ్ఞాన

రుధిరోద్గారినామ సంవత్సర ఉగాది శుభాకాంక్షలతో

సుజాత
చిరస్థాయి నటన!

దేసు వెంకట సుబ్బారావు సమర్పించు
శ్రీ విఘ్నేశ్వర సినీ ఆర్ట్ క్రియేషన్స్

# భార్యాభర్తల అనుబంధం

కలర్

భర్త యింటికే
పరిమితం
కావాలా?
సమాజంలో
వ్యక్తిగా
గౌరవించబడాలా?
ఈ ఏటి మేటి
మహిళా చిత్రం!

Rajo/Bachi

నిర్మాత: S.V. సుబ్బారావు • దర్శకత్వం: B. మల్లేష్
మాటలు-పాటలు: గోపి సంగీతం: రాజన్-నాగేంద్ర
కూర్పు: నరసింహారావు

చంద్రికా గ్రంథమాల వారు ప్రకటించిన 'విపులాదేవి' నవల మూలంగా వీరు తెలుగు వారందరికీ పరిచితులయ్యారు. లక్షణ, చంద్రగుప్త, ధరణికోట, ఆంగ్లరాజ్య స్థాపనం మొదలైన నవలలూ, కృష్ణకుమారి, పండుగకట్నం, కంకణము, కోకిలా వసంతం మొదలైన పద్యకృతులు వీరి రచనలు. విజయనగర ప్రభువుల 'దర్బారుకవి' గా పేరు పొందారు. 'భారతి' పత్రిక ప్రారంభమైన కొలదికాలంలో 'ఆంధ్రకవిత్వ తత్త్వం' అనే గ్రంథాన్ని కొన్ని నెలలపాటు అందులో ప్రచురించారు. తర్వాత అది గ్రంథరూపంగా వచ్చింది. కర్ణపర్వం, లవంగి మున్నగునవి ఈయన రచించిన నాటకాలు.

గంటి సూర్యనారాయణ శాస్త్రిగారు చక్కని రచయితలు. ఉత్తమగ్రంథ ప్రకటన వీరిప్రధాన లక్ష్యం. మద్రాసులో కొన్నేండ్లు ఉండి ఖాదీభాండారంలో పనిచేసి 'ఖాదీశాస్త్రి' అని పిలవబడేవారు. అక్కడే శృంగార గ్రంథమాలను స్థాపించి చక్కని అకృతిలో మేలైన బైండుతో ప్రాచీన శృంగార గ్రంథాలను ప్రచురించారు. తర్వాత తిరిగి విజయనగరం వచ్చి కొంతకాలం 'కల్యాణి' మాస పత్రికను నడిపారు. తర్వాత "ఆంధ్ర విజ్ఞానసమితి" పేర విలువైన గ్రంథాలు కొన్ని ప్రకటించారు. 'శ్రీరామతీర్థ చరిత్ర' వీరి వచన రచన.

కళాప్రపూర్ణ, విద్యారత్న నిడుదవోలు వేంకటరావు గారు విజయనగరంవారే. అక్కడి కాలేజీలో పట్టభద్రులై, తండ్రిగారి వలె నిరంతర సాహితీకృషి సలుపుతూ పెక్కువ్యాసాలను 'భారతి' మున్నగు పత్రికలలో ప్రకటించారు. తర్వాత మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖలో పనిచేసి, తర్వాత తెలుగు శాఖకు అధ్యక్షులై పెక్కు గ్రంథాలు పరిష్కరించి ప్రకటించారు. తెలుగు కవుల చరిత్ర, దక్షిణాంధ్ర వాఙ్మయ చరిత్ర, వచన కవిత్వ చరిత్ర, ప్రాచీనోదాహరణములతో కూడిన ఉదాహరణ వాఙ్మయం, మించుపల్లె మున్నగునవి వీరిరచనలు. చివరికాలంలో హైదారాబాదులో స్థిరనివాసం కల్పించుకున్నారు.

మద్రాసు విశ్వవిద్యాలయంలో ప్రాచ్య పరిశోధన సంస్థ ప్రారంభమైనప్పటినుంచీ తెలుగు శాఖకు అధ్యక్షులై ఆ పదవి లోనే రిటైరైన కోరాడ రామకృష్ణయ్యగారు విజయనగరం వారే. అక్కడి కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేశారు. భాషా శాస్త్రంలో ప్రత్యేక కృషిచేసి, ప్రామాణికులైన భాషాశాస్త్ర వేత్తలుగా పేరు పొందారు. భాషాశాస్త్ర విషయ గ్రంథాలు చాలా

వ్రాసి ప్రకటించారు. చక్కని సాహితీ విమర్శకులు. వీరి ఆంధ్ర భారత కవిత్వం గురించిన గ్రంథం తిక్కన కవితా తత్త్వానికి ఆదర్శప్రాయమైనది.

వీరేకాక మహామహోపాధ్యాయ పేరి లక్ష్మీనారాయణ శాస్త్రి, నౌడూరి వేంకటశాస్త్రి, కొంపెల్ల విశ్వనాథశాస్త్రిగార్ల వంటి శాస్త్రవేత్తలు, ఆకుండి వేంకటశాస్త్రి, దువ్వూరి వేంకట రమణ శాస్త్రి గార్లవంటి ఆంధ్ర విద్వాంసులును లేకపోలేదు.

శాస్త్రవిద్యకు వలెనేగాన విద్యకును విజయనగరం పెట్టినది పేరు. తెలుగు నాట ఎక్కడా సంగీతాన్ని బోధించే కళాశాల లేని సమయంలో రమారమీ డెబ్బయి ఏళ్ళక్రిందటనే ఇక్కడ విజయరామ గానకళాశాల అనే సంగీత విద్యాలయం ప్రారంభించ బడింది. అక్కడ గాత్రసంగీతం, వీణ, వాయులీనం, మృదంగం, నాదస్వరం విద్యలు బోధింపబడుతూ ఉన్నవి. ఇటీవల నాట్యం కూడా నేర్పబడుతున్నట్లు తెలిసింది. ఇక్కడ విద్యనేర్చి పొందిన సర్టిఫికెట్లకు విశ్వవిద్యాలయ పట్టాలకున్నంత విలువ ఉండినది. దీని మొదటి ప్రిన్సిపలు హరికథా పితామహ, లయబ్రహ్మ, పుంభావ సరస్వతి ఆదిభట్ల నారాయణ దాసుగారు. ఆంధ్రదేశంలో హరికథా విధానానికి అంకురార్పణ చేసి ఆయన అనేకమంది హరి దాసులను తయారుచేశారు. సంగీతంలోనే కాకుండా సంస్కృతాం గ్లాంధ్ర సాహిత్యాలలోనూ ఆయన సమర్థులు. పర్షియన్ భాషలో కృషిచేసి ఉమర్ ఖయ్యాంను మూలం ఆధారంగా సంస్కృతాంధ్రా ల్లోకి తర్జుమా చేసి ప్రకటించారు. సంస్కృతాంధ్రాలలో ఎన్నో గ్రంథాలు రచించారు. ఎన్నో హరికథలు వ్రాశారు. వారి హరి కథను విని ఆనందించని వ్యక్తి ఉండరంటే అతిశయోక్తి కాదు. ఆయన మూలంగా విజయనగరం కీర్తి విశ్వవ్యాప్తమయింది.

విజయరామ గాన కళాశాల వైస్ ప్రిన్సిపలు విశ్వ విఖ్యాత వాయులీన విద్వాంసులు ద్వారం వేంకటస్వామి నాయుడుగారు. నాయుడుగారి పేరు ఎరగని సంగీత ప్రియులు దక్షిణ దేశంలో ఎవ్వరూ ఉండరనుకుంటాను. వాయులీన వాద్య విద్యలో ఆయన కాయనయేసాటి. నారాయణదాసుగారు రిటైరైన తర్వాత ఆ సంగీత కళాశాలకు ఆయనయే ప్రిన్సిపలు అయినారు. ఎందరో శిష్యులను ఉత్తమ విద్వాంసులుగా తయారు చేశారు.

మధురాతి మధుర కంఠస్వరం కలిగి, శాస్త్రసంగీతంలోనూ, లలిత సంగీతంలోనూ ప్రఖ్యాతి గడించి, తాము కీర్తి శేషులయినా ప్రతి నిత్యమూ రేడియో మూలంగా అందరినీ అలరింప జేస్తున్న ఘంటసాల వెంకటేశ్వరరావుగారు విజయనగర గానకళాశాలలోనే పట్రాయని సీతారామశాస్త్రిగారి వద్ద సంగీత విద్య అభ్యసించి తన మూలంగా గురువునకూ, కళాశాలకూ కీర్తిని సంపాదించి పెట్టారు. ఈయన విజయనగర విద్వాంసులనే విషయం చాలమందికి తెలియక పోవచ్చును.

ఈ విధంగా పేరుపొందిన విజయనగర విద్యావేత్తలు ఇంకా చాలామంది ఉన్నారు. ఇంకా మరికొందరిని నేను విస్మరించి ఉండవచ్చును. జ్ఞప్తి ఉన్నంతవరకూ తెలియజేశాను. అందర్నీ గురించీ వ్రాస్తే ఒక చరిత్ర గ్రంథమే తయారు కాగలదని ముందే మనవి చేశాను.



# పాడవే కోకిలా!!

## శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

పాడవే కోకిలా! పాడవే కోకిలా!!
నవ శుభోదయ రాగ మీ వేళ!
నవ యుగోదయ గీత మీ వేళ!

నీ పాట గుండెలో చైతన్యముల నించు
నీ రాగ ధుని యెడల నీరసము హరియించు
ఎండిపోయిన లతల పల్లవాల్ చిగురించు
బండలౌ బ్రతుకులో పండువుల్ పరుగెత్తు

కోకిలా నీ బ్రతుకు ఆదర్శ మార్గమ్ము
మానవాళికి నీవు ఆనంద స్వర్గమ్ము
ఆకులను అలములను నీవు తింటావు!
ఆమనికి మధువులను పంచిపెడతావు!

నీవు నిల్చిన చోటు బృందావనమ్ము
నీవు పాడిన చోట గంధర్వలోకమ్ము
నీవు చూచిన చోటు రాగభరితమ్ము
నీవు ఎగిరిన చోటు పావనత్వమ్ము

కూయన్న నీ రాగ కూజితములోన
ఏయే ప్రబంధాలు దొర్లిపోయినవా!
ఏయే కవిత్వాలు పొర్లిపాటినవా!
ఏయే వసంతాలు రాజ్యాల నిల్పినవా!

బండలే పులకించు గుండెలే కదులు
శుక్ల పక్షపు దివ్యశోభలే మెదులు
నీ గీతి రహియించు నెల్లకాలమ్ము
సత్కావ్య విధము - విశ్వశ్రేయతా పథము!

తెలుగు పొలమున నీవు మధురిమలు చల్లావు!
తెలుగు కవులకు నీవు దారి చూపావు!
తెలుగు కవులందఱూ నీకు ప్రతి రూపాలు!
తెలుగు కవితలు నీదు రాగ గీతాలు!

సుప్తాంత రంగాల సప్తార్చి మాలికలు
మేల్కొల్పు నీ పాట ఝుంఝూనిలమ్ము
కృష్ణపక్షములోన కౌముదీ దీపికలు
వెలుగించు నీ గీతి విశ్వశ్రేయమ్ము!

జాతి సేవకు అంకితమ్ము నీ కంఠమ్ము
జాతి ఔన్నత్యమె ప్రీతి జీవితాంతమ్ము
నీవు లేనిదె జాతి నిర్వీర్యమైపోను
నీవు లేనిదె గీతి కర్థమ్ము కరవౌను!

విషమ శైశిర పవన వ్యాఘాతములచేత
నిలువెల్ల వణికి ఆకులపాటు నొందితిమి
మందాహతా మంద మలయ మారుత విధము

పులకింపజేయు మపూర్వ రాగావళుల!
మనిషి మనిషికి పనికిమాలు కావేషాలు!
మనసు మనసుకు నడుమ మతిలేని రోషాలు!
నీ పాట మాలోన వెలిగించవలె శాంతి
నీ రాగ మెదలోన జల్లవలె కాంతి!

మహిత ధార్మికభావ మార్గమ్ము మనది!
మధుర వైభవమగ్న దేశమ్ము మనది!
సంకుచిత భావాలు మనకు గిట్టనివి
సహృదయ రావాలు మనల మెట్టినవి!!

పాడవే కోకిలా! పాడవే కోకిలా!!
నవ యుగోదయ రాగ మీ వేళ!
నవ శుభోదయ గీత మీ వేళ!!

—*—*—

వసుంధర

# నిత్యశంకితుడు

మా పక్కింటి సీత అన్నా, క్లాస్‌మేట్ శంకర్రావు అన్నా నాకు విపరీతమైన జాలిగా ఉండేది.

సీత నాకంటే నాలుగైదేళ్లు చిన్న. మనిషి నల్లగా వుంటుంది ఎత్తుపళ్ళు. మనిషిలో ఏవిధమైన ఆకర్షణాలేదు- మంచితనం తప్ప

సీతను హైస్కూల్లో అంతా ఏడిపించేవారు. తోటి ఆడపిల్లలే చిన్నచూపు చూసేవారు. నాకు మాత్రం సీతంటే జాలిగా ఉండేది. వీలున్నపుడల్లా కథలు చెప్పేవాణ్ణి. మాయింట్లో క్యారమ్సు ఆడనిచ్చే వాణ్ణి. వాళ్ళింటికివెళ్ళి గుళ్ళబోర్డు ఆడేవాణ్ణి. ఈ కారణంగా సీత నన్ను చాలా అభిమానించేది.

శంకర్రావు మాస్కూలు హెడ్మాస్టరుగారబ్బాయి. అతడు తెల్లగా, సన్నగా, అందంగా ఉంటాడు. క్లాసులో మంచి మార్కులు తెచ్చుకుంటాడు. వార్తాపత్రికలు చదివి, రేడియోలో విని ప్రపంచం లోని ఎక్కడెక్కడి విశేషాలూ తెలుసుకుంటాడు.

నిజానికి అతడిని చూసి జాలిపడదగ్గ అవసరమేమీలేదు- అతడిలో అనుమాన గుణం లేకపోతే.

క్లాసులో అతడికి మంచి మార్కులు వస్తాయి. అందుకు కారణం తనతండ్రి హెడ్మాస్టరు కావడమేనని అనుమానిస్తాడు. ఏ సబ్జక్టులోనైనా మంచిమార్కులు రాకపోతే అందుకు కారణం ఆ టీచరుకు తనతండ్రి అంటే ఉన్నకోపం అనుకుంటాడు ఎవరైనా పొగిడితే తనతో అవసరముందను కుంటాడు. తిడితే తన్నుచూసి అసూయ పడుతున్నారనుకొంటాడు.

శంకర్రావుకు పదిసంవత్సరాల వయసు వచ్చేక అతడికో చెల్లాయి పుట్టింది. ఆరోజునుంచీ తలిదండ్రులకు తనమీద ప్రేమ తగ్గిపోయిందని అతడనుమానించాడు. ఆవిషయం తలిదండ్రులు త్వరగానే గ్రహించి అతడికలాంటి తలపు కలగకుండా ప్రవర్తించ సాగారు. అప్పుడు శంకర్రావు- నేను ఉద్యోగంలోచేరాక నా పెళ్ళికి వచ్చే కట్నం చెల్లాయి పెళ్ళికి ఉపయోగించాలికదా. అందుకే అమ్మా, నాన్నా నామీద ప్రేమ నటిస్తున్నారు- అనుకునేవాడు.

శంకర్రావు తన మనోభావాలు ఒక్కటొక్కటిగా నాకు చెబుతూండేవాడు. అప్పట్లో నాకు మనస్తత్వాల గురించిన అవగాహనలేదు. అందువల్ల అతడుచెప్పినవన్నీ నిజమనే అనుకుని జాలిపడేవాణ్ణి. ఆ తర్వాత పెద్దచదువులకు వెడుతూ మేము విడి పోయాక అడపాతడపా ఉత్తరాలు వ్రాసుకుంటూండేవాళ్ళం. నాబుద్ధి వికసించడం ప్రారంభించాక శంకర్రావు అనుమానగుణంతో ఏం సుఖపడతాడా అని జాలిపడేవాణ్ణి.

నా చదువైపోయింది. నేను సెంట్రల్ బ్యాంకులో గుమాస్తాగా చేరాను. నాకు పెళ్ళిసంబంధాలు వస్తున్నాయి. అయితే ఆఫీసరుగా ప్రమోషన్ వచ్చేవరకూ పెళ్ళిచేసుకోరాదని నేను నిశ్చయించు కున్నాను.

ఈలోగా ఆ వూళ్ళోనే స్టేట్‌బ్యాంక్‌లో ప్రొబేషనరీ ఆఫీ సరుగా వచ్చాడు శంకర్రావు. మిత్రుడి అదృష్టానికి నేను రవంత అసూయపడ్డమాట నిజం. కానీ మేమిద్దరం ఒకే ఊళ్ళో కలసి ఉంటామన్న సంతోషం ఆ అసూయను మించినది. రిటెన్‌టెస్టులో శంకర్రావు అ ఖండుడు. అసలు అయ్యేయస్ సెలక్షన్ ఎందుకు రాలేదో అనుకున్నాను. మొదటిసారి కలుసుకున్నప్పుడే ఆ ప్రశ్న అడిగాను.

శంకర్రావు ఏమీ మారలేదు - “నేను బ్యాంకుటెస్టులో నెగ్గానని తెలిసినవాళ్ళంతా ఆ విషయం మెచ్చుకోకుండా ఈ ప్రశ్నే వేస్తున్నారు”- అన్నాడు.

తనను చిన్నబుచ్చడానికే ఈప్రశ్నవేసినట్లు శంకర్రావు భావించాడు. చిన్నప్పట్నించీ తెలిసుండీ అతడినలాంటి ప్రశ్న వేయడం తప్పేమరి. అసలే అతడంటే నాకు జాలి. వెంటనే తప్పు క్షమించమని అడిగేను. అతడినలా అడిగేది నేనొక్కడినే! శంకర్రావు చాలా సంతోషించాడు.

శంకర్రావుకు పెళ్ళి సంబంధాలు ముమ్మరంగా వస్తున్నాయి. నేను శంకర్రావు స్నేహితుడినని తెలిసేక ఒకరిద్దరు నావద్దకు వచ్చారు, తమ కేసులు రికమెండ్ చేసిపెట్టమని. నా ద్వారా శంకర్రావుకు రెండు సంబంధాలు వచ్చాయి.

ఓ అమ్మాయి రంభలా ఉంటుంది. చదువుకుంది. కట్నం అయిదు వేలకు మించి ఇచ్చుకోలేరు. పెళ్ళికూడా ఆర్భాటంగా చేయలేరు. గుళ్ళో పెళ్ళి!

శంకర్రావుకు పిల్లనచ్చింది. అయితే పెళ్ళివారి ఆర్థిక పరిస్థితి దీన దశలో లేదని అతడికి అనిపించింది. వాళ్ళు తన్నులోకువ చేశారనీ, పిల్లనుచూసి ఒప్పేసుకుంటాననుకుంటున్నారనీ అన్నాడు. కట్నం పదిహేను వేలకు తగ్గదన్నాడు. పెళ్ళి ఆర్భాటంగా జరగాలన్నాడు. తలిదండ్రుల సంగతి ఎలా ఉన్నా అతడే ఈ విషయమై మంకుపట్టు పట్టాడు.

అప్పటికీ నేను చెప్పాను - పెళ్ళివారు అబద్ధాలు చెప్పడం లేదనీ - వారిశక్తి అంతకు మించదనీ!

"నువ్వు గుమస్తావు కాబట్టి నీకొస్తే కట్నం రాదు. అందుకని నాకూ తక్కువ కట్నం వచ్చే సంబంధం చూడాలనుకుంటున్నావు—" అనేశాడు శంకర్రావు.

మరెవరైనా ఆమాట అంటే బాధపడేవాణ్ణే! శంకర్రావు గురించి నాకు చిన్నతనంనుంచీ తెలుసు కాబట్టి సారీచెప్పుకున్నాను. అతడికి నామీద కలిగిన అనుమానం పోగొట్టు కొనడం కోసమే రెండో సంబంధం శంకర్రావుకు తీసుకుని వచ్చాను.

ఈసారి కట్నం పాతిక వేలు. పెళ్ళి ఆర్భాటంగా చేస్తారు. పిల్లకూడా బాగుంది. ఈసారి ఏవిధంగానూ వంక పెట్టడానికి లేదు.

కానీ శంకర్రావు శంకర్రావే!

"పిల్ల బాగున్నప్పటికీ పాతిక వేలు కట్నం ఇస్తున్నారంటే - ఆ పిల్లలో ఏదో లోపముండి ఉండాలి. బహుశా ఆ అమ్మాయి గుణం మంచిదయుండదు—" అనేశాడతను.

నేను దెబ్బతిన్నాను. కట్నం తక్కువిస్తే తనను లోకువ కట్టారంటాడు. ఎక్కువిస్తే పిల్లగుణం మంచిది కాదంటాడు.

నేను శంకర్రావు ఆలోచనా విధానాన్ని మెచ్చుకున్నాను. అందువల్ల ఓ ఆడపిల్లకో మంచి సంబంధం పోగొట్టి ఉండవచ్చు. కానీ ఇలాంటి అనుమాన గుణం గల భర్తతో ఆ పిల్ల మాత్రం ఏం సుఖపడుతుంది?

ఆ తర్వాత నుంచి నేనింక శంకర్రావుకు పెళ్ళి సంబంధాల గురించి ప్రయత్నించలేదు.

ఓ రోజు శంకర్రావే అడిగాడు - "నాకింక సంబంధాలు రావడం మానేశాయా?"

"నేనే చూడ్డం లేదు...."

"ఎందుకని?"

"నీ కెలాంటి పిల్లకావాలో నాకేం తెలుస్తుంది?" అన్నాను.

"మా నాన్నగారుకూడా ఇలాగే అన్నారు...." అన్నాడు శంకర్రావు.

నేను నవ్వి ఊరుకున్నాను.

"పిల్ల చదువుకుని ఉండాలి. ఎందుకంటే చదువుకోనివాళ్ళకు సంస్కార ముండదు. మొగుణ్ణి నానా అల్లరీ పెడతారు. అలాగని పిల్ల మరీ ఎక్కువ చదువుకుందుకు వీల్లేదు. అప్పుడాపిల్ల ఆధునిక భావాలను మనం జీర్ణించుకోలేం. స్త్రీ పురుషులు- సమానహక్కులు అంటూ ఉపన్యాసం ప్రారంభించి మన జీవితాలను నరకం చేస్తారు. సంస్కారవంతుడైన మగవాడు భార్యను బాగానేచూసుకుంటాడు. అయితే ఆడది మాత్రం అతడికి అణగి మణగి ఉండాలి—" అన్నాడు శంకర్రావు.

"ప్రతి విషయాన్నీ నువ్వు చాలా బాగా ఆలోచిస్తావు...." అన్నాను. అతడి ఆలోచనా విధానం నాకేమీ నచ్చకపోయినా అలా గనడం నాకు అలవాటు అయిపోయింది.

శంకర్రావు ముఖంలో వెలుగు కనిపించింది— "ఉద్యోగం చేసే ఆడపిల్లని చేసుకోకూడదు. ఆమెకు మగవాళ్ళతో మసలడం అలవాటయుంటుంది. ఆమె శీలాన్ని నమ్మడం కష్టం...."

నేను నవ్వి - "సంస్కారవంతుడైన మగవాడు పెళ్ళికి ముందు భార్య శీలం గురించి ఆలోచించ కూడదేమో!" అన్నాను.

శంకర్రావు తిరగబడతాడనుకున్నాను. కానీ అతడు నన్నాశ్చర్య పరుస్తూ విపరీతంగా మెచ్చుకుని - "చాలా బాగా చెప్పావు. ఇంట్లో ఉంటూ పొరపాటున తప్పుచేసిన ఆడదాన్ని మన్నించవచ్చు. కానీ ఉద్యోగం చేస్తూ తప్పుచేసిన ఆడదాన్ని మన్నించకూడదు. ఎందుకంటే ఆమె మగవాళ్ళ సాహచర్యానికి అలవాటు పడడం వల్ల పెళ్ళయ్యాకకూడా తప్పులు చేస్తూనే ఉంటుంది...." అన్నాడు.

శంకర్రావులో మరీ యింతగా అనుమాన గుణం పెట్టినందుకు భగవంతుణ్ణి నిందించానారోజు. అయితే సరిగ్గా రెండు నెలల తర్వాత శంకర్రావులో అనుమాన గుణం పెట్టినందుకే భగవంతుణ్ణి అభినందించాను.

తనకు పెళ్ళయ్యే అవకాశం లేదని నిరాశ చెందిన సీతను శంకర్రావు కట్నం లేకుండా పెళ్ళి చేసుకున్నాడు.

అతడెలాంటి అమ్మాయిని చేసుకుంటాడా అని కుతూహల పడుతున్న నాకు- ఆరోజునుంచీ సీతపైన జాలిపడవలసిన అవసరం తొలగి పోవడమేకాక- శంకర్రావు అనుమానగుణంపైన అభిమానం కూడా బయల్దేరింది.



# మహాత్ముడు

శ్రీ ఇంద్రగంటి భానుమూర్తి

నమ్మకంగా తీసుకువెళుతూన్న దారి
హఠాత్తుగా ఆగిపోయినట్టు,
అంతా గోదార్లై పోయినట్టు,
నమ్మకంగా వేలుపుచ్చుకు నడిపించుకు వెడుతూన్న చెయ్యి
నడుమ, అర్థాంతరంగా విడిచి మాయమై పోయినట్టు,
ఇంక దారీ తెన్నూ ఏమీ లేనట్టు,
కళ్ళన్నీ కారుమబ్బులైపోయి
గద్గద గద్గదంగా
"మహాత్ముణ్ణి ఎవరో కాల్చి చంపేశారట
మహాత్ముడు చచ్చిపోయాడు"
ఏ నోట విన్నా ఆ మాటే ఆనాడు —

◆ ◆

ఈనాడూ, ఆ మహాత్ముడు
క్షణ క్షణమూ చచ్చిపోతున్నాడు
అడుగడుగునా, అణువణువునా
పల్లెల్లో, పట్నంలో పార్కుల్లో, కూడల్లో —
వెన్నెముక లేని మనుషుల మధ్య,
పిచ్చి పువ్వులు పూసే మనసుల మధ్య,
గుండెల్లేని వాళ్ళ మధ్య,
తిండం కోసమే బతికే వాళ్ళ మధ్య,
బతకడం కోసమైనా తిండిలేని వాళ్ళ మధ్య,
వేళ్ళలోంచీ పుచ్చిపోతూన్న జాతి సత్య తత్త్వం మధ్య,
తన దుస్తే ధరించి. తన ఆదర్శాలనే వల్లిస్తూ
చుట్టూ ఎగిరే చిలకల మధ్య,
బొమ్మ రూపు మారిపోయి,
సిగ్గుతో వొంగిపోయి,
చేతి కర్ర జారిపోయి,
కుప్ప గూలిపోతూ, కాపోలితూ —

◆ ◆

ఆవు నీ మహాత్ముడు, స్వేచ్ఛ కోసం
ఈ నేల గాలీ కళవళించినప్పుడు,
ఆకాశాలూ కలవరించినప్పుడు,
గంగా, ఆవేశంగా, తరంగలించినప్పుడు,
పుడమి పురిటి నొప్పులుపడ్డప్పుడు,
పుట్టుకొచ్చాడు —
ఆవేళ, అక్టోబరు రెండే !
ఆవూరు పోరుబందరే !

ఈ గాల్లోని ఏ సువాసనల్ పీల్చుకొన్నాడో,
ఈ మట్టిలోని ఏ సారం ఒంట బట్టించుకొన్నాడో,
ఈ వెలుగులో వెలుగులేవి సాక్షాత్కరించుకొన్నాడో,
అలుపులేని, సొలుపులేని
అవిరామ జీవన సాగర మహా మథనంలో
ఆఫ్రికా అవమానాల, అపహాసాల, ఆంక్షల, ఆక్రోశాల
నిశితానుభవ చైతన్యాగ్ని హోత్రం లోంచి,
మెహతా, రెనడే, తిలక్, గోఖలే, అరవిందాదిమేధావిమేధా
విభిన్న భావ సంఘర్షణా క్షేత్రంలోంచి, మహాభారత
క్షోణి లోంచి,
సరికొత్త మనిషిగా సాక్షాత్కరించాడు.
అతను వర్ధమానుడి ఔరసుడు, బుద్ధుడికి వారసుడు;
సేవాభావం అతని ప్రాణధాతువు !
అహింస అతడి జీవ హరితం ;
సత్యాగ్రహం అతని చేతి నూరంచుల కత్తి!
అదొకప్పుడు సహాయ నిరాకరణం —
మరొకప్పుడు ఉప్పు సత్యాగ్రహం —
ఇంకొకప్పుడు క్విట్ ఇండియా —
తన భావం జాతి భావంగా,
తన మాట, మనసు, చేత, జాతిమాటగా, మనసుగా,చేతగా
ముందు నిలిచాడు, ముందుగా నడిచాడు,
ముందుకే నడిపించాడు —
జాతిపితయాడు, మహాత్ముడయాడు —
ఆయన కాలిపోయి ఉండవచ్చు, ఎప్పుడో —
ఆయన భావాలు, అనుభవాలు, అహింసా సూత్రాలు,
ఆశయాలూ గాలికి పోతూండవచ్చు, ఇప్పుడు —

అయితే,
ఇది ఇండియా,
ఇది గుండెకాయ,
ఇది కురుక్షేత్రం —
ఇందులోంచే భగవద్గీత పుట్టింది —
ఇందులోంచే మహాత్ముడూ పుట్టుకొచ్చాడు —
కాలిపోయాడు బోసి నవ్వు నవ్వుతూనే —
మళ్ళా, ఈ బూడిదలోంచే, మహాత్ముడే, సుసంస్కృత
వాసనా బలంతో పుట్టుకొస్తాడు,
అదే బోసి నవ్వు నవ్వుతూనే !

---

శ్రీ వి. శ్రీరామచంద్ర

# యోజనా భవన్

[ఒక మాట: "వర్షం" శీర్షికతో దుందుభినామ సంవత్సర సంచికలో అచ్చయిన నా వ్యాసం మన ఆర్థిక ప్రణాళికలు అనుకున్న ఫలితాలను ఎందుకు సిద్ధింపజేయలేకపోయాయో వివరించడానికి ప్రయత్నించింది. వ్యవసాయ రంగంమీద వాతావరణ పరిస్థితుల ప్రభావం ఒక ముఖ్య కారణంగా పేర్కొనడం జరిగింది. మరికొన్ని అంశాలను పేర్కొని యీ చర్చను సమగ్రం కావించడానికి మరొక ప్రయత్నం యీ వ్యాసం. — రచయిత]

1. కేంద్ర రాజధాని ఢిల్లీ నగరంలో పార్లమెంటు స్ట్రీటు లేక సంసద్‌మార్గ్ అనే రాజవీధిలో "యోజనాభవన్" అనేపేరుగల అయిదతంస్థుల భవనంలో ప్రణాళికా సంఘం యొక్క కార్యాలయం పని చేస్తున్నది. ముప్పది రెండవ సంవత్సరంలో అడుగిడిన ప్రణాళిక యొక్క రూపకల్పన జరిగిన యీ కార్యాలయంలో పై అంతస్థుల్లో అంకెల సేకరణ, పట్టీల తయారీ, విశ్లేషణ, పరిశోధన జరుగుతుంటాయి. మధ్య అంతస్థుల్లో ఫలితాల పత్రాలు, సమస్యల వివరణ, వాదోపవాదాలు కొనసాగుతుంటాయి; మొదటి అంతస్థులో నిర్ణయాలు తీసుకుని, విధానాలు రూపొందించి వాటిని అమలు జరపడంలో వచ్చే చిక్కులను పరిశీలిస్తూ కార్యక్రమం కొనసాగుతూ వుంటుంది. ఇప్పటికి 5 ప్రణాళికలు, 3 సంవత్సరాలు ప్రణాళికా విధానం గ్రహణంపాలై, ప్రస్తుతం ఆరవ ప్రణాళికలో వున్నాం. (మధ్యలో జనతా ప్రభుత్వపు రోలింగ్ ప్లాను 1978లో వచ్చింది 1980లో వెళ్లిపోయింది). ఈ మొత్తం కాలంలో మనంసాధించింది. నగటున సాలుకు 3.5 శాతం పెరుగుదల మాత్రమే. సాలుకు 1.8 నుంచీ 2.0 శాతం చొప్పున పెరుగుతున్న జన సంఖ్యకు సవరిస్తే తలసరి ఆదాయం 1.5 నుంచీ 1.7 శాతం కన్న ఎక్కువ పెరగలేదు. గాలిలో వూగిసలాడే దీపం చుట్టూ రక్షణ వుండటం అవసరం. మబ్బులో నీరు భూమిలో సారం వంటిది కాదు. ఎండలో వేడి, గాలిలో తేమ రైతు చేతిలో శ్రమ, విత్తులో జీవం వంటివి కావు. ప్రకృతి విలాసం పంటలు పండించవచ్చు, కరువు వరదలు చిందించవచ్చు. అయితే యీ కార్యాలయం యొక్క బాధ్యత ఏమిటి ? అక్కడకూడా ఒక వాతావరణం వున్నది. ఉష్ణోగ్రతలు వర్షపాతల స్థితిగతులుఎరిగి పనిచేసుకునేవారు సఫలులు, లేనివారు గాలిలో దీపాలు. అలుతే వైయక్తిక జయాప జయాల సంగతిఎలా వున్నా ప్రణాళికా రచనలోనే రాబోయే యిబ్బందుల నూహించి వాటి నివారణోపాయాలను సిద్ధపరిస్తే ప్రయత్నం జయప్రదమవుతుండేది. ఆ విధంగా జరక్కపోవడానికి కారణాలు అనేకం.

1) జిల్లా, రాష్ట్రప్రణాళికలను జాతీయప్రణాళికగా సమీకరించవలసిన అవసరం

2) రాజకీయ పక్షాలు, వర్గాల ఒత్తిడులు

3) ప్రణాళికా వ్యవస్థపట్ల అధికార యంత్రాంగం యొక్క దృష్టి

4) సామాజిక, ఆర్థిక, రక్షణ రంగాలలో జనించే తాత్కాలికపు యిబ్బందులు

5) ప్రాంతీయ తారతమ్యాలు

6) సాంకేతిక పరిజ్ఞానం, సాధన సంపత్తి, ప్రాజెక్టుల ఎంపిక

7) అంతర్జాతీయ వాణిజ్యము, సంస్థలు, సహాయం

8) ప్రణాళికా రచయితల వైయక్తిక దృక్పథాలు

2. అరువది ఎనిమిదికోట్ల ప్రజలు, ఆరులక్షలగ్రామాలు, నాలుగువందల యాభై జిల్లాలు, ఇరవైఅయిదురాష్ట్రాల అవసరాలు, కోరికలు క్రోడీకరించిన ప్రతిపాదనలను దీర్ఘకాలిక జాతీయ లక్ష్యాలు దృష్టిలోవుంచుకుని సమీకరించడంలో ఎన్నో చిక్కులుంటాయి. ఎవరి ప్రతిపాదనలకు వలసిన వనరులు వారివద్ద వుండకపోవచ్చు. ఒకచోట ఉక్కు కర్మాగారం నెలకొల్పడం, లేక రైలుమార్గం వెయ్యడం జాతీయ ప్రయోజనాలదృష్ట్యా వుత్తమం కాకపోవచ్చు. ఒకే ప్రాజెక్టును తమ రాష్ట్రంలో నెలకొల్పాలని ఒకరు, తమ రాష్ట్రంలో నెలకొల్పాలని మరొకరు కోరవచ్చు. మధురలో నూనె శుద్ధి కర్మాగారం వుండాలా అక్కరలేదా, ఉక్కు ఫ్యాక్టరీని ఆంధ్ర, తమిళనాడు, కర్ణాటకలలో ఏవిధంగా ఏర్పాటు చెయ్యాలి, నాగార్జున సాగర్ ఎప్పుడు పూర్తికావాలి, రాజస్థాన్ కెనాల్ నర్మదా నదీజలాల పంపిణీ ఏర్పాట్లు ఎలా జరగాలి — ఇవన్నీ దేశం యొక్క అవసరం మాత్రమే దృష్టిలో వుంచుకుం

నిర్ణయిస్తే జిల్లాలు, రాష్ట్రాల ప్రతిపాదనలు తోసి రాజనే అవకాశం వున్నది. అయితే రాజ్యాంగంలో రాష్ట్ర ప్రభుత్వాల అధికార పరిధిలోని అంశాలకు సంబంధించిన ప్రతిపాదనలనే పరిశీలించి మిగిలినవి కేంద్రానికి వదిలి వెయ్యవచ్చు. "కంకరెంటు లిస్టు" (కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల వుమ్మడి పరిధిలోని అంశాలు) లోని రంగాలు చాలావరకు తలనెప్పికి కారణమయ్యాయి. సంపన్నమైన రాష్ట్రాలు ఎక్కువ మాత్రం ప్రభుత్వపు ఖజానాలో చేరుస్తుంటాయి. ఎక్కువ చెల్లిస్తున్నాం గనుక ఎక్కువ కేటాయింపు జరగాలని కోరుతుంటాయి. కేంద్ర ప్రభుత్వం మీద ఎక్కువ ప్రభావం చూపగల రాష్ట్రాలు ఎక్కువ ప్రతిపాదనలకు అంగీకారం పొందుతుంటాయి. భౌగోళికంగా, చారిత్రికంగా, ప్రభుత్వ విధానాల వలన, ప్రభుత్వ యంత్రాంగం యొక్క స్వరూపంవలన యీ ప్రభావం నిర్ణయింపబడుతూ వుంటుంది. ఢిల్లీతో పరిచయం వున్నవారికి యీ విషయాల యొక్క అసలు రూపం స్పష్టం అవుతుంది. ప్రాజెక్టులకు కావలసిన ధనంతో ఎక్కువ భాగం కేంద్రం నుంచీ రాష్ట్రాలకు వచ్చే కేటాయింపుల వలన వచ్చేదే. ఈ కేటాయింపులకు ఆధారం ఫైనాన్స్ కమీషన్ నివేదిక. రాజ్యాంగం ఆదేశాన్ననుసరించి ప్రతి అయిదు సంవత్సరాల కొకసారి విధిగా ఏర్పర్చబడే యీ కమీషన్ ఆదాయపు పన్ను, ఎక్సైజు పన్ను వంటి వాటి వలన లభించిన ఆదాయంతో రాష్ట్రాల వంతును విడివిడిగా నిర్ణయించడానికి ప్రాతిపదిక తయారు చేస్తుంది. అయితే ప్రణాళికలలో నిర్ణయించే ప్రాజెక్టులకు వలసిన మొత్తం ఫైనాన్సు కమీషన్ ప్రతిపాదనల వలనగానీ బడ్జెటు కేటాయింపుల వలనగానీ సిద్ధించక పోవచ్చు. ఫైనాన్సు కమీషను నిర్ణయాలలో, అవి అమలు జరిపే సమయానికి అమలులో వుండే ప్రణాళిక యొక్క అవసరాలను దృష్టిలో వుంచుకునే అవకాశం లేదు. సాంవత్సరిక బడ్జెటులో తాత్కాలికపు దృష్టి తప్పనిసరి కావడంతో ప్రణాళికకు వలసిన దైర్ఘ్యం కొరవడుతుంది. ఇటువంటి వ్యవస్థాత్మకమైన ఆటంకాలు మన తప్పటడుగులకు ఒక కారణం.

**3.** ప్రజాస్వామ్యం కనక వ్యవస్థీకృతమైన ప్రజా భావ వ్యక్తీకరణ ప్రభావ వంతంగా వుంటుంది, వుండాలి. రాజకీయ పక్షాలు, కార్మిక సంఘాలు, పారిశ్రామిక వర్గాలు, భూస్వామ్య వర్గం తదితరముల ఆసక్తులు, ప్రయోజనాలు వ్యక్తీకరించడానికి పంచాయితీలు, శాసనసభలు ప్రభుత్వ వ్యవస్థకూడా ఒక్కొక్కప్పుడు బలమైన సాధనాలుగా మారే అవకాశం వున్నది. ప్రభుత్వ నిర్వహణ రాజకీయ పక్షాలద్వారా జరుగుతూ వుంటుంది. అయిదు సంవత్సరాల కొకసారి ప్రణాళిక రూపొందించినప్పుడు, అయిదు సంవత్సరాలలో నాలుగు ప్రభుత్వాలు మారితే ప్రణాళికా లక్ష్యాలు సిద్ధిస్తాయా లేదా అంటే చెప్పడం కష్టం కావచ్చు. రాజకీయ పక్షం ఒకటి అయితే, ఎన్నికలు గెలిపించి అధికారంలోకి రప్పించిన పార్టీ మానిఫెస్టో ప్రణాళికా రచనకు కొంతవరకైనా ఆధార భూతం అవుతుంది గనుక పాలించే వ్యక్తి ఎవరైతేనేమి ప్రభుత్వ పక్షం ఒకటే అయినప్పుడు. కొంతవరకు నిజమే! అయితే వ్యక్తుల వెనుక వర్గాలు, ఆర్థిక ప్రయోజనాలు వేరుగా వుంటాయి గనుక కొంతవరకు ప్రభుత్వ కార్యక్రమాలు, ప్రాజెక్టుల నిర్ణయం ప్రణాళిక ముసాయిదాకు అనుగుణంగా వుండకపోవచ్చు. వివిధ రాజకీయ పక్షాలుకలిసి ఏర్పాటుచేసినప్రభుత్వాలలోఅయితేఎప్పటికార్యక్రమం ఫలితాలు అప్పుడు పంచుకోవడం తప్ప ఆర్థిక లక్ష్యాల దృష్ట్యా అధికార నిర్వహణ కొనసాగడం కష్టం. ఆర్థిక కార్యక్రమ ప్రాతిపదికమీద దగ్గరకు చేరిన రాజకీయవర్గాలు కొంతవరకైనా తమ కార్యక్రమాలను కొనసాగించే అవకాశం వుంటుంది. 1967 లోనూ 1977 లోనూ అనేక రాష్ట్రాలలో ఏర్పడిన సంయుక్త విధాయకదళ్, జనతా మోర్చా ప్రభుత్వాలు నడిచినతీరు ఒక వుదాహరణ. అదే విధంగా బోనసు చెల్లింపు వంటి కార్యక్రమాలకు వలసిన వనరుల సేకరణ, ప్రత్యేక పరిస్థితులవలన ఎక్కువ ప్రభావం నెరిపే రాష్ట్రాల ప్రభుత్వాల కోర్కెలను మన్నించడానికి అనుకున్న కార్యక్రమాలను కొంతవరకైనా కొంతకాలమైనా వాయిదా వెయ్యక తప్పదు. ఈ పరిస్థితి కేంద్రానికేగాదు రాష్ట్రాలకూడా ఎదుర్కోవలసి వస్తుంది. ధాన్యపు సేకరణ ధర, ఎరువుల సబ్సిడీ, బియ్యం వంపిణీ, పన్నుల మీది రాయితీలు యిలాంటి విషయాలలో వివిధ వర్గాల వత్తిడులను సమన్వయం చేసుకుని చర్యలు తీసుకోవడంలో మన పెరుగుదలకు వలసిన శక్తి కొరవడుతుంది.

**4.** ప్రజాక్షేమం ఆర్థిక ప్రగతికన్న ముఖ్యం అనేది నేటి సామాజిక నిర్వహణలో గోచరించే సత్యం. తాత్కాలికంగా ప్రజాక్షేమ భంగకరమైన సంఘటనలు జరుగుతుంటాయి. వరదలు, కరువుకాటకాలు, వ్యాధులు, ఎన్నో అవాంతరాలు ఎప్పుడువస్తాయో వూహించలేం. వస్తూనేవుంటాయి అని తెలిసినా ఎంత పరిమాణంలో నష్టం కలుగుతుందో తెలియదుగనక ప్రత్యేక ఏర్పాట్లుచెయ్యడం కష్టం. దీర్ఘకాలిక నివారణోపాయాలవలన క్రమేపీ వీటిబ త్తిడి తగ్గుతూ వచ్చింది. తాత్కాలిక క్షేమానికి భంగకరమేగాక ప్రణాళికా పథకాల అమలుకుకూడా ఇబ్బంది కలిగిస్తాయి గనుక ఆహారం, వస్త్రాలు, ఆరోగ్యం కోసం అప్పటి కప్పుడు ఏర్పాట్లు చెయ్యాలి. ఒక్కొక్కప్పుడు పెద్దపెట్టున ప్రజలు పశువులను ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతం తరలించే ఏర్పాట్లు చెయ్యాలి. వరద లొచ్చినప్పుడు జరపవలసిన పనులమీది ఖర్చుకన్న వరదలు రాకుండా నివారించేందుకు పెట్టే ఖర్చు మేలు అని తెలిసినా అలా జరక్కపోవడానికి కారణం ఏమిటో తెలుసుకుంటే మన ప్రణాళికలు ఎందుకు పూర్ణఫలితాలివ్వడం లేదో కొంతవరకు తెలుస్తుంది.

# ఉగాది శుభాకాంక్షలతో!

## మీరు మంచి ఆలోచనా పరులు, ముందు చూపు గల వారేనా? అయితే,

# సన్‌సార్

## పంఖాలు మరియు గృహోపకరణ వస్తువులను మాత్రమే కొంటారు




నాణ్యతకు, మన్నికకు మరోపేరు "సన్‌సార్". ఎందుకనగా సమర్థులైన సాంకేతిక నిపుణులు వాటిగురించి శ్రద్ధ వహిస్తారు. 'సన్‌సార్' వారి వస్తువులేవి అవకాశముపై ఆధారపడిలేవు.

ఉత్పత్తికి సంబంధించిన ప్రతి చిన్న విషయములోను అత్యంత జాగరూకత మరియు నాణ్యత గురించి శ్రద్ధ వారికి సర్వసాధారణమైన విషయము.

అందువలననే మీరు "సన్‌సార్" వారి వస్తువులను ఎప్పుడు కొనినా, తెలివైన నిర్ణయం తీసుకొన్నామనే సంతృప్తిని పొందుతారు. ఇది మీలో చిరకాలము నిలచిపోతుంది.

విక్రయించిన తదుపరి మీకు ఎప్పుడు అవసరమయినా దేశ వ్యాప్తముగా నైపుణ్యమైన సర్వీసు లభించును.

**ఈరోజే సన్‌సార్ వస్తువులను కొనండి తెలివిగల పనిచేశామని సంతృప్తి పొందండి**

associated UP/273/Te

విప్లవాత్మకమైన వుద్యమాలు, తాత్కాలిక సామూహిక ప్రకోపాలు, ఉద్రేకాలు అణిచి వెయ్యడానికి శాంతి భద్రతలు నెలకొల్పడానికి లా అండ్ ఆర్డర్ వ్యవస్థమీద ప్రత్యేకమైన ఖర్చులు, దేశ సరిహద్దులు సక్రమంగా రక్షించుకోవడానికీ, అనుకోకుండా యుద్ధాలు వచ్చినప్పుడు సైన్యాలు యితర రక్షణ వ్యవస్థలమీది ఖర్చు మన ప్రణాళిక అంచనాలను మార్చివేస్తుంటాయి. 1962, 65, 71 లలో జరిగిన యుద్ధాల ఫలితంగా ఆర్థిక వ్యవస్థలో కలిగిన మార్పులు. ఉత్పత్తిదృష్ట్యా, ప్రాధాన్యతల దృష్ట్యా, ధరల విషయంలోనూ, స్పష్టమే. వివిధ సందర్భాలలో జరిగిన విద్యార్థి వుద్యమాలు, రాజకీయ పక్షాల ఆందోళనలదృష్ట్యా పోలీసు బలగాలను విస్తృతం ఆధునికం చెయ్యడానికి అప్పటికప్పుడు డిమాండ్లు కేటాయింపులు జరగడంకూడా తెలిసినవిషయమే. ఇవన్నీ కదలబారుతున్న వ్యవస్థ యొక్క లేక పరస్పర విరుద్ధశక్తుల సంఘర్షణ వలన జనించిన అస్థిరస్థితియొక్క లక్షణాలు. ఈలక్షణాలు ఆర్థికప్రగతి, సంక్షేమం కొరవడటం వలనకూడా కావచ్చు. ఆర్థిక ప్రగతికి నిరోధకమూ కావచ్చు.

5. రాష్ట్రాలమధ్య ఆర్థిక తారతమ్యాలు మన లక్ష్యాలను, వ్యూహాలకు, పథకాలకు ప్రత్యేక స్వరూపం యివ్వవలసిన అవసరం కలిగించాయి. ప్రకృతిసిద్ధమైన తారతమ్యాలను తగ్గించడానికి ప్రయాసతోకూడిన ప్రయత్నమైనాసరే చెయ్యవలసి వస్తుంది. జాతీయలక్ష్యాల దృష్ట్యా, ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం ఆధారంగా నెలకొల్పే పెద్ద పెద్ద ప్రాజెక్టుల వలనకూడా కొంతవరకు తారతమ్యాలేర్పడతాయి. తలసరి సగటు జాతీయాదాయం కన్న హెచ్చు ఆదాయంగల మహారాష్ట్ర, పంజాబు, తమిళనాడు వంటివి, తక్కువ ఆదాయంగల ఒరిస్సా, బీహారు, మధ్యప్రదేశ్- సగటు స్థాయిలోగల ఆంధ్రప్రదేశ్, ఉత్తరప్రదేశ్ వంటి రాష్ట్రాలు. అన్నింటి ప్రగతిలక్ష్యాలు, కార్యక్రమాలు ఒకే విధంగా వుండవు. ఆదాయంలోని భేదాలను దాని అనుషంగిక లక్షణాలుగా వుండే నిరుద్యోగం, పురాతన గ్రామీణ వ్యవస్థ ప్రాబల్యం వంటి వాటిని నివారించడానికి చేసే ప్రత్యేక ప్రయత్నాలవలన వనరులకు సిద్ధించే ప్రయోజనం తరుగుతుంది. రాష్ట్రాల మధ్యనేకాక ప్రతిరాష్ట్రంలో కూడా ప్రాంతీయభేదాలు గోచరిస్తాయి. తూర్పు పశ్చిమ ఉత్తర ప్రదేశ్‌లమధ్య, ఆంధ్రప్రదేశ్‌లోని తారతమ్యాలు, పట్టణ గ్రామీణప్రాంతాల భేదాలు; పశ్చిమబెంగాలులో కలకత్తా-బర్ద్వాన్-ఖరగ్‌పూరు ఒకవైపు, మిగిలిన గ్రామీణ బెంగాలు వేరొకవైపు రాజస్థాన్‌లోని మార్వార్ ప్రాంతం, హర్యానా సరిహద్దునానుకున్న ప్రాంతాలభేదాలు తెలిసినవే. ఇంతేకాక ప్రతి ప్రాంతంలోనూ జిల్లాలమధ్య భేదాలున్నాయి. అభివృద్ధి చెందిన దేశాలలో ప్రాంతీయ తారతమ్యాలు తక్కువగా వుండేమాట పూర్తిగా నిజం కాదు. ప్రకృతిరీత్యా వున్న తారతమ్యాలు

సాంద్రిత జీవన స్థాయిలలో ప్రగతి కార్యక్రమాల కనుకూలమైన వాతావరణం వనరులలోవుండే తేడాలు కొంతవరకూ తరిగినా కొనసాగుతూనే వుంటాయి. సాధనాలను-మానవశ్రమ కానీయండి, భూసంపద కానీయండి, ఇతర సాధన సంపత్తి కానీండి-సంపూర్ణ ఉపయోగంలోకి తీసుకు రావడానికి చేసే ప్రయత్నంలో భాగంగా ప్రాంతీయ తారతమ్యాలను తొలగించడానికి ప్రాధాన్యం యిచ్చి ప్రణాళికలను రూపొందించుకొనవచ్చు. వస్తువినియోగపుస్థాయిలో-ప్రాథమికంగా కావలసిన ఆహారం వస్త్రాల విషయంలో-అత్యల్ప స్థాయిలో వున్నవారికి తగిన సదుపాయాలు చెయ్యవలసినదే! కానీ ప్రాంతీయ తారతమ్యాలు వినియోగ స్థాయిలో కనిష్ఠ వర్గానికి చెందినవారి అవసరాలు ఒకటి కావు.

**6.** ప్రణాళికా రచనకు ప్రత్యేక పరిజ్ఞానం వుండాలి. ఆర్థిక వ్యవస్థ పనిచేసే తీరు తెన్నులను గురించి గణాంకవివరాలను గురించి ప్రాథమిక గ్రామీణ స్థాయినుంచీ కేంద్రప్రభుత్వ కార్యాలయాల నియమ వ్యవహారాలను గురించి అనుభవం వుండటం అవసరం. కొండొకచో యితర దేశాలలోని అనుభవం వుపయుక్తం కావచ్చు. సాధన సంపత్తి, వనరులను గురించి నిర్దుష్టమైన వివరాలు త్వరిత గతిని సేకరించే ఏర్పాట్లు జరగాలి. అమలు జరిపిన కార్యక్రమాలు యిచ్చిన ఫలితాలను నిర్దిష్టలక్ష్యాలతో పోల్చి చూచుకుని తగిన సవరణలు చెయ్యగల వ్యవస్థ వుండాలి. ఆరవ ప్రణాళికలో పబ్లిక్ ప్రైవేటు రంగాలలో ఒక లక్ష డెబ్బది ఆరువేల కోట్లరూపాయలు పెట్టుబడి ఖర్చుకు కేటాయించినప్పుడు ఎక్కడ ఏ విధంగా ఖర్చు జరుగుతుందో అజమాయిషీ జరిగే ఏర్పాట్లు లేకపోతే ప్రయత్నంవృధా. అయితే దురదృష్టవశాత్తూ సగద్బందీగా ప్రణాళికారచన, లక్ష్యనిర్ణయం కార్యక్రమం అమలు జరగడానికి వలసిన గణాంక వివరాల సేకరణ వ్యవస్థ ఏర్పడలేదు యింత వరకూ. వ్యవసాయ రంగంలోని వైయక్తిక ఆదాయం అంచనాలు తయారు చెయ్యడంలో కష్టం విషయం చూసినా, శ్రామికులు ఉద్యోగులకు సంబంధించిన లెక్కలు సరైనవికావు. పారిశ్రామిక రంగంలోనూ, సర్వీసెస్ రంగంలోనూ వున్న పనిచేసే వారిసంఖ్య వర్గీకరించి వివరాలు నమ్మకంగానే యివ్వబడుతున్నాయి. జనాభా లెక్కల పట్టీలలో వ్యవసాయం వృత్తిగా జీవించేవారికి వివిధ సెన్సస్ సమయాలలో వేరుగా వర్గీకరించారు. వృత్తిరీత్యా వ్యవసాయంమీద ఆధారపడి పూర్తిగా కానీండి, కొంతవరకు కానీండి, స్వంత భూమివలనగానీ, కవులకుపుతం వలన గానీ శ్రమ చేసిగానీండి- జీవించేవారి సంఖ్య, మొత్తం పనిచేసేవారి సంఖ్య యివ్వబడుతున్నాయి. స్వయంసమృద్ధి దాయకమైన ఉపాధి కల్పనా కార్యక్రమాలకు కావలసిన శ్రామికులు, పనిచేసే రోజులు, గురించిన వివరాలు లభ్యంకావడం లేదు. ప్లానింగ్ కమిషన్ ఆధ్వర్యంలోనూ యితరత్రా కొన్ని ప్రయత్నాలు జరిగినా లోటుపాట్లు సరిదిద్దడానికి మరొక ప్రయత్నం అవసరం. అదేవిధంగా వ్యక్తుల మధ్య వ్యవసాయభూముల విభజన, అంటే ఒక్కొక్క వ్యక్తికి మొత్తం ఎంతభూమి వున్నదో, ప్రభుత్వానికి తెలియదు. స్వంత కమతాల సేకరణ గ్రామాలు, తాలూకాలు, జిల్లాలు, రాష్ట్రాలుకూడా దాటి వెళ్ళినప్పుడు అటువంటి పని కష్టసాధ్యం అవుతుంది. పారిశ్రామిక రంగంవలె సుస్థిరమూ వ్యవస్థీకృతము అయినరీతిలో వ్యవసాయం కొనసాగే దశకు వచ్చినప్పుడు యీపని సాధ్యం అవుతుంది. అదేవిధంగా. ఒకరాష్ట్రంలో జరిగిన సంగతి ఉత్పత్తి అయిన విద్యుచ్ఛక్తికీ, మొత్తం వినియోగం లెక్కలోకి వచ్చిన విద్యుచ్ఛక్తికీ మధ్య 20 శాతంపైగా తేడా చూపించబడింది. విద్యుత్ప్రసారణలోని లీకేజీలవలన, దొంగతనంగా వాడుకోవడం వలన, మీటర్ల కొలతలలో న్యాయంగా వచ్చే జోడింపు తేడాల (ఎగ్రిగేషన్ ప్రాబ్లెమ్ ఇన్ మెషర్‌మెంట్ ఆఫ్ డీసెంట్రలయిజ్డ్ కన్‌సమ్షన్) వలనగానీ యింత తేడా వచ్చిందంటే కొంచెం ఆశ్చర్యంగానే వుంటుంది. మరొక రాష్ట్రంలో, వుత్పత్తి అయిన విద్యుచ్ఛక్తి పెరిగితే అమ్మబడిన విద్యుచ్ఛక్తితరిగిపోయింది. (శాతంలోకాదు,మొత్తంలోనే).ఇలాంటి చికాకులు అక్కడక్కడ ఎప్పుడైనా దొర్లినా ఫర్వాలేదు. కానీ ప్రణాళికా రచనకు వలసినప్రాథమిక గణాంకవివరాలలోనే వుంటే అంచనాలు ఒకరకంగానూ, ఫలితాలు మరొకరకంగానూ వుంటాయి.

**7.** ప్రపంచంలో ఏదేశమూ ఒంటరిగా మనజాలక పోయినా యితర దేశాలతోడి సంబంధ బాంధవ్యాలు ఆర్థికవ్యవస్థ స్వరూపం మీద (రాజకీయావసరాలు అటుంచి) ఆధారపడి వుంటాయి. చిన్న దేశాలు వనరులు సాధన సంపత్తిలో వైవిధ్యంలేని దేశాలు తమ వుత్పత్తులను ఎగుమతి చేసుకుని అవసరమైన యితర వస్తువులను దిగుమతి చేసుకుంటాయి. మధ్య ప్రాచ్యంలో కొన్ని దేశాలలో జాతీయాదాయంలో 30 శాతంనుంచీ 60 శాతంవరకూ అంతర్జాతీయ వాణిజ్యం ద్వారా నిర్ణయించు కుంటున్నాయి. మనదేశంలో యీశాతం 7 లేక 8 కన్న ఎక్కువలేదు. ఇదివరలో 5 శాతం మాత్రమే వుండేది. అంతర్జాతీయ వాణిజ్యం యొక్క శాతం (జాతీయాదాయంలో) పెరిగిన కొద్దీ ఆ దేశపు ఆర్థిక వ్యవస్థమీద యితర ఆర్థిక వ్యవస్థల ప్రభావం హెచ్చుగా వుంటుంది. ఆయా దేశాలలో మార్కెట్ల స్థితిగతులు, ప్రభుత్వ విధానాలు, ఉద్యోగావకాశాలు, ధరలు, పెట్టుబడి - వీటి ప్రభావం వస్తు క్రయ విక్రయాల ద్వారా ఆర్థిక వ్యవస్థలోకి జొరబడుతుంది. ఆదేశపు ఆర్థిక విధానాలు, ప్రజల జీవన స్థితిగతులు, ఉత్పత్తి పద్ధతులు అన్నీ ఇతర దేశాల ఆర్థిక వ్యవస్థలను దృష్టిలో వుంచుకుని పరిణామం పొందుతుంటాయి. ప్రణాళికల కార్యక్రమాలకు కావలసిన యంత్ర సామాగ్రి, సాంకేతిక పరిజ్ఞానం, ముడిసరుకు దిగుమతి చేసుకునేటప్పుడు ఒప్పందాలలోని మార్పులు చేర్పుల వలన లక్ష్యాలు తారు

మారయ్యే అవకాశం వున్నది. ఫ్రీ ఎక్స్ఛేంజి రేట్ల అలవాటు యూరపు అమెరికా ఖండంలోనూ మారప్రాచ్యంలోనూ అమలులోకి వచ్చిన తర్వాత వస్తుక్రయ విక్రయాల ధరల మార్పిడి తరచుగా జరుగుతూ వచ్చింది. కేటాయించిన దానికన్నా ఎక్కువ విదేశ మారక ద్రవ్యం యొక్క అవసరం ఏర్పడింది. ఏదోఒక విధంగా దేశంలోని వినియోగం తగ్గించి, సబ్సిడీలిచ్చి ఎగుమతులకు ప్రాముఖ్యం కల్పించి విదేశ మారక ద్రవ్యం ఆర్జించవలసిన అవసరం ఏర్పడుతుందటువంటప్పుడు. ప్రణాళికా కార్యక్రమాలకు విదేశాలు అంతర్జాతీయ సంస్థలు అందించే సహాయం సాధారణంగా షరతులతోగూడి వుంటుంది. ప్రాజెక్టు ప్రతిపాదనల సమగ్ర పరిశీలన జరగనిదే విదేశ సహాయం లభించదు. ఒక్కొక్కప్పుడు ప్రాజెక్టుల నిర్ణయం యీపద్ధతివలన ప్రభావితం అయ్యే అవకాశం వున్నది. ఆర్థిక వ్యవస్థ సమస్యలకు విదేశ సహాయంయొక్క అవసరం ఎక్కువైనకొద్దీ, దుష్ఫలితాలు సిద్ధించే అవకాశంకూడా హెచ్చుతూ వుంటుంది. ఆర్థికప్రగతి అనేది జాతీయభావన ప్రాతి పదికగా జరిగే ప్రయత్నంయొక్క ఫలితం అంతర్జాతీయ సహాయ సహకారాలు యిందులకు కొంతవరకూ దోహదంచేసినా ప్రణాళికా విధానం అంతర్జాతీయ పరిధిలోగానీ, ప్రభావాల దృష్టితోగానీ జరగడం అసంభావ్యం(కొన్ని ప్రత్యేక దేశాలు ఎక్కువశాతం ఎగుమతి దిగుమతి వాణిజ్యంద్వారా జాతీయాదాయం నిర్ణయించు కునేవి తప్ప.)

8. ఆడమ్ స్మిత్ నాటినుంచీ అనండి, చాణుక్యుడి నుంచీ అనండి నేటివరకూ ఆర్థిక శాస్త్రం శాఖోపశాఖలుగా విస్తరించింది. ఊడలు నాటుకున్నది. ప్రణాళికా సిద్ధాంతం-విధానం అనేదికూడా ఒక శాఖ. అయితే ప్రణాళికా రచన ఆర్థిక వ్యవస్థలోని అన్ని రంగాలకు సంబంధించిన లక్ష్యాలు కార్యక్రమాలకు సంబంధించిన అంశం గనుక వ్యవసాయం, పరిశ్రమలు, వాణిజ్యం, బ్యాంకింగ్, ద్రవ్యవిధానం, విత్తం-పన్నుల విధానం, గణాంక వివరాలు మొదలైనశాఖలలో నిష్ణాతులు అనుభవజ్ఞులు అయిన వ్యక్తులు ప్రణాళికా రచయితలుగా నియమింపబడటం అవసరం. ప్రణాళికా విధానానికి పాదు చేసి నీరు పోసిన మహలనోబిస్ గణాంక శాస్త్రంలోనూ, సిస్టమ్స్ ఎనాలిసిస్‌లోనూ, ప్రగతి సిద్ధాంతంలోనూ అశేష ప్రజ్ఞగలవాడు. రెండవ ప్రణాళికలో భారీ పరిశ్రమలకు ప్రాముఖ్యం యిచ్చి వ్యవసాయం వెనుకబడింది. అప్పటి సమస్యల దృష్ట్యా మొదటి ప్రణాళికలో వ్యవసాయం ఆహారం ఎక్కువ ధనం కేటాయింపు పొందాయి. దీర్ఘకాలిక దృష్ట్యా వ్యవస్థకు ప్రాతిపదిక కల్పించడానికి రెండవ ప్రణాళికలోనూ మూడవ ప్రణాళికలోనూ పారిశ్రామిక రంగం ముందుకు వచ్చింది. నాల్గవ రంగంలో వ్యవసాయానికి ప్రాముఖ్యం కొంతవరకూ తిరిగి వచ్చింది. మహలనోబిస్ తర్వాత గాడ్గిల్, పీతాంబరపంత్, హక్సర్ వంటివారు ప్రణా

ళికా రచన సమర్థవంతం గావించవానికి విపులమైన కృషి చేశారు. ప్రణాళికా రచన యొక్క బాధ్యత అప్పగించబడిన శాస్త్రజ్ఞులు అర్థిక శాస్త్రంలో తమకు అసక్తిదాయకమైన, తాము నిష్ణాతులైన శాఖల సమస్యలకు ప్రాముఖ్యం యివ్వడం కొంత సహజం. అయితే రాజకీయ పరంగా, ప్రాముఖ్యం యివ్వవలసిన అంశాలను ముందే నిర్ణయించుకుని వానిలో విజ్ఞులైన వారిని ప్రణాళికా రచనా కార్యక్రమంలో చేర్చడం మరొక పక్షం. కానీ కొన్ని స్థూల సూచికలననుసరించి యీ తేడాలు మన సాఫల్యపు స్థాయిలో ఎలాంటి మార్పులు తేలేదనిపిస్తుంది. ఎదుగుతున్న జనాభా "పార్శ్వ రేఖా చిత్రం" లేదా రూపరేఖల యొక్క సహజావసరాలు తీర్చడానికి కావలసిన రీతిలో వస్తువుల వుత్పత్తి నిర్ణయం, వనరుల కేటాయింపు, లక్ష్యాల ఎంపిక జరగడం లేదు. పెట్టుబడి వుత్పత్తుల రేషియో పెరిగిపోతూ జనాభా పెరుగుతూ పొదుపు- జాతీయాదాయ శాతం ఒక స్థాయిని మించి పెంచడానికి వీలులేనప్పుడు ఉద్యోగావకాశాల కల్పన ఎలా సాధ్యం? జనాభా పెరుగుదల రేటు ఎన్నో దశాబ్దాల వికాసానంతరం తగ్గే స్థాయికి అందుకునే స్థితిలో లేనప్పుడు ప్రణాళికా రచన ఎలా సాగించాలి? ప్రణాళికలు ప్రజావర్గాల మధ్య (వృత్తుల కోసం ఆదాయవర్గాలకోసం) వనరుల పంపకం కోసం అమలు జరగాలంటే ఆదాయవిభజనను గురించి నిర్దిష్ట విధానాలు వుండాలి. 'ఉత్పత్తి' ప్రణాళికల ననుసరించి, "విభజన" సామాజిక సంఘర్షణ ఫలితంగానూ వుండాలంటే సమాజంలో మరింత వైరుధ్యం తప్పనిసరి అవుతుంది. అందుకన్న ఉత్పత్తుల స్వరూపం, స్థాయి నిర్ణయించేటప్పుడే విభజనను గురించి కూడా నిర్దిష్ట విధానాలు రూపొందిస్తే ప్రణాళికలు మరింత ఫలితాలు చేకూర్చేవి. ఉత్పత్తుల స్వరూపం కొంతవరకు వినియోగ దారులను గురించి సూచించినా, వాణిజ్యం యొక్క మార్గాలద్వారా వినియోగ దారులను మార్చివేసి తగిన ఫలితాలు మరొకరు పొందే అవకాశం వున్నది. ఈ వికృతిని తొలగించి ప్రణాళికా రచన కట్టుదిట్టం చేస్తే బడుగులు కష్టపడవలసిన అవసరం వుండదు.



## శ్రీ నిఖిలేశ్వర్

భూఖండాల మధ్యా
చుట్టూ ఆవరించిన జలరాశి,
నిరంతర గమనంలోనే అలల ఆరాటం
ఆ ఆరాటం కింద
రాటుదేలిన భూఖండశేషం.

పరుష సరళాల మధ్య
ఎన్ని అక్షరాలు వ్యాపించినా
సరళాల మధ్య "క చ ట త ప" లు
కేవలం దీవులనే సంగతి ఒక యథార్థం.

"క చ ట త ప" లే
ఒక వ్యక్తి జీవిత పరిణామంలో
"గ జ డ ద బ"లై వర్గ స్వభావం మారినా
సామ్యవాద వ్యవస్థ నిర్మాణంలో
కొత్త వర్గం అధికారపు కోరలు పెంచుకున్నా
నిరంతరం ప్రశ్నించే శ్రమశక్తి
మానవ జీవితసారమనే
సాంస్కృతిక పోరాటాయుధాన్ని
చారిత్రకావసరంగా నిలుపుతుంది ఎదుట!

ఒక మహానుభావుడు
సమాజ అవసరానికి ముందే
ద్రష్టగా మహాస్రష్టగా అవతరించినా,
వివేక గమనానికి
ఒక సోక్రటీస్ విషం తాగినా,

కొందరి దృష్టిలో మార్క్స "మహర్షిగా"
శంకరాచార్యుడి మాయావాదం —
వరసలోకే వచ్చాడనే భ్రమవున్నా,
అనాటి అవసరానికే
వాళ్ళు అతికినా అతకకపోయినా
సజీవంగా ప్రవహించే కాలవాహిని మధ్య
"ఎన్నో మన్వంతరాలు గడిస్తే తప్ప
ఎక్కడో
మరో ఎవరెస్టు శిఖరాగ్రమంతటి
కారణజన్ముడు ఎలా జన్మిస్తున్నాడు?"
ఈ ప్రశ్నకు కాలపరిణామమే జవాబు.

సమాజపు ఆలోచనాక్రమం మరిగి మరిగి
ఉత్తుంగ తరంగాలపై
పయనించే మేఘాలకు ఆకృతి నిచ్చి
చిలికే చినుకే
స్వాతి ముత్యమైతే
శ్రమశక్తి నిత్యం రగిల్చే
పోరాటమే ఆ కాంతి స్రోతస్సు!

ధనిక-పేద ధృవాల మధ్య
ఎన్ని పరాన్న వర్గాలు ఉద్భవించినా
వ్యవస్థ ఉపరితలం
అలంకరించాలనే క్రమంలో
శ్రమ జీవుల భూతలమే నిచ్చెన!

[ప్రశ్న లేవనెత్తిన భాషా శాస్త్రవేత్త ప్రొఫెసర్ భద్రిరాజు కృష్ణమూర్తిగారికే నమ్రతతో అంకితం.]



శ్రీ కె. బి. కృష్ణ

# మరణం ధ్రువమ్

పుట్టినవాడు గిట్టక తప్పదు. మరణం అనేది ప్రతివ్యక్తి తప్పక ఎదుర్కోవలసిన సంఘటన. అయితే ప్రతివ్యక్తి ఎన్ని సంవత్సరాలు బ్రతుకుతాడు? అతని ఆయుర్దాయం అతనికి తెలుస్తుందా?

శ్రీరామమూర్తిగారు పరమ నైష్ఠికుడు. త్రిసంధ్యలు వార్చకుండా ఆయనకు రోజు గడవదు. క్షణం క్షణం రామనామ స్మరణ.

ఆయనకు నలుగురు కొడుకులు, నలుగురు కుమార్తెలు. ఆ రోజుల్లో కుటుంబ నియంత్రణ అమలులోలేదు. అందరికి వివాహాలు చేసి బాధ్యతలు వదిలించుకున్నారు. అందువలన ఆయన నిశ్చింతగా వున్నారు. కష్టార్జితంతో కట్టుకున్న స్వంత ఇంట్లో వుంటూ, పెద్దలు సంపాదించి పెట్టిన భూమిని సాగుచేయించుకుంటున్నారు. మూడు వాటాలు అద్దెకు ఇచ్చి, తాము ఒక వాటాలో వుంటున్నారు.

భార్య రామలక్ష్మమ్మగారు. ఆయనకు తగిన భార్య. ముమ్మూర్తులా లక్ష్మీదేవి. దానధర్మాలు తెలిసిన అన్నపూర్ణ. భర్తకు ఏ సమయంలో ఏది కావాలో సమకూర్చి ఆయనతోపాటుగా భగవంతుని స్మరించడం ఆమె విధి.

తీరికగా వున్నప్పుడు, కొడుకులు, కోడళ్ళ గురించి, కూతుళ్ళు అల్లుళ్ళ గురించి ఆలోచించుకొని సంబరపడుతుంటారు ఆ దంపతులు. ప్రతీ వేసవిలోనూ పిల్లల శెలవులకు కొడుకులు కూతుళ్ళు శ్రీరామమూర్తిగారి ఇంటికే రావాలి. అది ఆయన కోరిక. కోడళ్ళను కూడా కూతుళ్ళతో సమానంగా చూసే సమదృష్టిగల వారాయన.

"ఏమోయ్. శెలవులు ఇంకా ఎన్ని రోజులకు మొదలవుతాయంటావ్?" రాత్రి భోజనం చేసిన తరువాత వక్కపొడి నములుతూ, కాళ్ళ దగ్గర కూర్చున్న లక్ష్మమ్మగారిని అడిగేరు.

"భలేవారండీ ఈ రోజేగదా ఉత్తరాలు వచ్చాయి అందరి దగ్గరనుండి, శెలవులకు వస్తామని. ఇంక రెండు రోజులుంది."

"పాలవాడికి, పెరుగువాడికి, నెయ్యివాడికి చెప్పి ఎక్కువలు కావాలన్ని. పిల్లలు అందరూ వస్తారు కదా, ఏమైనా తినడానికి చెయ్యి. రేపు బజారుకు వెళ్ళి బిస్కట్లు, చాక్లెట్లు తీసుకువస్తాను" అన్నారు శ్రీరామమూర్తిగారు.

"మీరేమీ హైరాన పడకండి. నేను అన్నీ చూసుకుంటాను."

వరండాలో మడత మంచంమీద పడుకున్న ఆయనకు, లక్ష్మమ్మగారు కాళ్ళు పడుతుండగానే నిదురపోయారు.

2

సూర్యభగవానుడు మామూలుగా తన దివ్య కిరణాలతో ఈ లోకాన్ని వెలుగుతో నింపుతున్నాడు. అది మే నెల కావడంవలన, రోహిణీకార్తె కావటం మూలాన్న ఉదయం ఆరున్నర గంటలకే సూర్యకిరణాలు చురుక్కుమంటున్నాయి.

శ్రీరామమూర్తిగారు అనుష్ఠానం చేసుకుని పడకకుర్చీలో కూర్చుని కాఫీ సేవిస్తున్నారు.

ఆయన మనస్సును తనకురాత్రి వచ్చిన కల సూర్యకిరణాల వేడికన్న మిన్నగా దహించి వేస్తోంది.

అయితే ఇది జరుగుతుందంటావా శ్రీ రామా?

నన్ను నీ దగ్గరకు జేర్చుకుంటున్నావా?

నీసన్నిధిలో కూర్చుని రామనామ స్మరణ చేసుకుంటూ, రామదాసు కీర్తనలు మనసారా పాడుకుంటాను స్వామీ, నన్ను కరుణించు స్వామీ — అయితే లక్ష్మిని ఎవరు చూస్తారు? అదిగో మనస్సు వశం తప్పుతూంది. పెద్ద కొడుకు మంచివాడు. కోడలు కూడా చాలా మంచిది. ఈ ఆలోచన వచ్చేక మనసుకు ఊరట కలిగింది.

"లక్ష్మీ...."

"ఏమిటీ హడావిడి పొద్దున్నే" అంటూ కొంగుతో చేతులు తుడుచుకుంటూ వచ్చింది.

"కూర్చో నీతో మాట్లాడాలి."

"వంటయితే పెందరాళే భోజనం చెయ్యొచ్చు. మీకు అసలే నీరసం. తరువాత మాట్లాడుకోవచ్చులెండి."

"లక్ష్మీ నేను లేకుండా బ్రతికగలవోయ్."

"చాల్లెండి. చోద్యం పొద్దున్నే ఈ ఆలోచనలు ఎందుక మీకు?"

"రాత్రి నాకుకలవచ్చింది. హనుమజ్జయంతినాడు సాయంకాల ఆరుగంటలకు నేను దైవసన్నిధికి చేరుకున్నట్లుగా శ్రీరామచంద్ర

మూర్తి తయారుగా ఉండమన్నాడే." పచ్చివెలక్కాయ తించే గొంతులో పట్టేసినట్లు, ముద్ద దిగకుండా బాధపడుతున్నట్లు ఆయన గొంతు గాద్గదికమైంది.

లక్ష్మమ్మగారికి, ఉదయమే, ఈ విషయం, తన భర్తకు వచ్చినది కలే అయినా అగ్నిపర్వతం పగిలి తనవైపుకు అతి వేగంగా లావా వస్తున్నట్లుగా గజ గజ వణికి పోతూంది ఆమె.

ఒకవేళ నిజమైతే —

అమ్మో ఆయన లేకుండా నేను వుండలేను.

"పిచ్చిగాని .... కలలు ఎక్కడైనా నిజం అవుతాయా?" ఇన్ని ఆలోచనలతో కన్నీటి తెరలలో శూన్యాన్ని చూస్తోందామె.

"పిచ్చి లక్ష్మీ బాధపడకు. గీతలో చెప్పినట్లు, మృత్యువు అనేది చిరిగిన పాత వస్త్రం తీసి క్రొత్త వస్త్రం ధరించినట్లే మన జీవితం శాశ్వతంగాని వాటి కోసం తాపత్రయం అవివేకం." అని సముదాయిస్తున్నారామెను.

ఆయన మనస్సులో లోతు తెలియని దిగులు. కొడుకులు, కోడళ్ళు, కూతుళ్ళు, అల్లుళ్ళు, మనుమలు, మనుమరాళ్ళు, ఆత్మీయులు, స్నేహితులు, వీళ్ళందర్నీ వదిలి ఈ ఆత్మ పయనించాలి పైకి - పైపైకి. ఈలోకం శాశ్వతం కాదు. ఈ భవ బంధాలు వెఱ్ఱిప్రేమలు. ఇవన్నీ మనస్సును కట్టిపడేసి ఒక్కోసారి భగవంతుని స్మరించడానికి కూడా అవకాశం ఇవ్వవు.

అయితే ఇవన్నీ జీవితానికి అవసరం లేదా? అవసరమే. మానవ జన్మ ఎత్తేక కొన్ని ధర్మాలు ఆచరించాలి. షేక్స్‌పియర్ **"As you like it"** లో చెప్పినట్లు, మనిషికి ఏడుదశలు—బాల్యం, విద్యార్థి దశ, ప్రేమికుడు, వీరుడు, న్యాయనిర్ణేత, వృద్ధుడు, మరణం ఆసన్నమైనవాడు. అందుకని తను చివరి దశలోవున్నాడు. మరణం సమీపిస్తున్నదని బాధపడటం అవివేకం.

ఎదురింటి వారి అబ్బాయిని పిలిపించి తన ప్లీడరును వెంటనే రమ్మని కబురు చేశారు. ఎదురింటి శేషాద్రిగారు వచ్చారు.

"ఏమిటి మూర్తిగారూ ప్లీడరు కోసం కబురు చేశారుట. ఏమయింది?"

రాత్రికి తనకువచ్చిన కల వివరం చెప్పారు మూర్తిగారు.

పగలబడినవ్వేరు ఆయన. "శేషాద్రిగారూ నవ్వకండి, ఇది నిజం అవుతుందని నాకు ఎందుకో గట్టి నమ్మకంగా వుంది." అన్నారు మూర్తిగారు.

ప్లీడరు గారు వచ్చారు. ఇల్లు నాలుగు వాటాలు నలుగురు కొడుకులకు, ఎనిమిది ఎకరాలు పొలం నలుగురు కొడుకులకు, నలుగురు కూతుళ్ళకు సమానంగా వ్రాశారు. ఈ తతంగమంతా కన్నీటి తెరలలో గమనిస్తూంది లక్ష్మమ్మగారు.

"లక్ష్మమ్మగారూ విచారించకండి. ఈపని ఎప్పుడైనా చేయవలసిందే. ఏమీ జరగదు. అయితే శ్రీరామమూర్తి గారు మాత్రం చాలా దూరదృష్టితో ఈపని చేశారు. అనుకోకుండా ఇంటి యజమాని చనిపోతే అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు, స్థిర చరాస్తుల కోసం తగవులాడుకొని చితికి పోయిన సంసారాలు నాకు ఎన్నో తెలుసు." అని శేషాద్రిగారు ఇద్దర్నీ సముదాయించారు.

3

కొడుకులు, కోడళ్లు, కూతుళ్ళు, అల్లుళ్ళు వస్తారనుకున్న రోజు వచ్చింది.

పెద్ద కొడుక్కి నలుగురు సంతానం.
రెండవ కొడుక్కి ముగ్గురు పిల్లలు.
మూడవ కుమారుడికి ఇద్దరే పిల్లలు.
నాలుగవ కొడుక్కి ఇంకా సంతానంలేదు.

నలుగురు అమ్మాయిలకు కలిపి పదిమంది సంతానం. ఒక రోజు అటూ ఇటూగా అందరూ రావటంతో, ఇల్లంతా నిండిపోయి పెళ్ళివారి ఇల్లులావుంది.

అందరూవచ్చేక లక్ష్మమ్మగారు ఏడుస్తూ విషయం చెప్పింది. అందరూ ఒకేసారి గొల్లుమన్నారు. ఏం జరిగిందోనని శ్రీరామ మూర్తిగారు లోపలకువచ్చారు. అందరూ ఆయన్ని చుట్టుముట్టేరు.

"నాన్నగారూ! మీకు ఏంజరగదు. మీరు ఎప్పుడూ ఆరాధించే శ్రీరామచంద్రమూర్తి మాకు అన్యాయం చెయ్యడు అన్నారు కొడుకులు, కూతుళ్ళు.

"మీరందరూ కంగారు పడకండి. భగవంతుడు నాకు సమయం దగ్గరైందని హెచ్చరించాడు. అయితే ఒక్క విషయం వినండి. మీ అమ్మనుమాత్రం జాగ్రత్తగా చూసుకోండి. అమ్మ పెద్దాడి దగ్గర వుంటుంది.

ఎటువంటి ప్రలోభాలకు లొంగకండి. ఆస్తి అందరికి సమానంగా విల్లు వ్రాశాను. సంతోషంగా అందరూ ఇలాగే ప్రతి వేసవికి సెలవులకు కలుసుకోండి. నేను పైనుండి ఆనందంతో చూస్తాను." 'అని ఆయన అనగానే, నలుగురు కొడుకులు ఆయన్ని, మాట్లాడనియ్యకుండా ఆపేశారు బయట వరండాలో కూర్చున్నారు. లోపల లక్ష్మమ్మగారి మాటలు, కోడళ్ళు, కూతుళ్ళ మాటలు పిల్లల పేచీలు చిన్న సంతలా వుందా ఇల్లు.

# మేము పెట్టుబడిదారుని ఎంపికకే ఎక్కువ శ్రద్ధ చూపిస్తాము!

# ఎ పి సిఓ బి యొక్క క్రొత్త సేవింగ్ డిపాజిట్ స్కీములు

గృహలక్ష్మి డిపాజిట్ స్కీము : 6¼ సం. కాలంలోనే మీ పెట్టుబడి రెట్టింపగును.

ఉన్నత విద్యా డిపాజిట్ స్కీము : నెలసరి ఆదాయంతో విద్యా వ్యాసంగంలో అత్యున్నత శిఖరాల్ని అందుకొటకు మీకు సహాయపడును.

వివాహ డిపాజిట్ స్కీము : వివాహ ఖర్చులపై శ్రద్ధ వహించును.

పెన్షన్ డిపాజిట్ స్కీము : వృద్ధాప్యంలో శాంతి, సౌఖ్యములను చేకూర్చును. పదవీ విరమణ గావించిన వారందరికి తప్పనిసరిగా అవసరమయినది.

క్యాష్ సర్టిఫికెట్ స్కీము : అశోక మార్గములో ధనాభివృద్ధి.

ఇంకనూ వలయు వివరములకు



[APCOB]

## ది ఆంధ్రప్రదేశ్ స్టేట్ కోఆపరేటివ్ బ్యాంక్ లిమిటెడ్ (ఎ పి సిఓ బి)

(ఒక షెడ్యూల్డు బ్యాంక్)

హె. ఆ.: ట్రూప్ బజార్,
హైదరాబాద్ - 500001

టెలిఫోన్ నెం. 44481-3
43122
42640

ను గాని, లేక
ఏ శాఖనైననూ దయచేసి సంప్రదించండి!

## మీ యెడ ప్రత్యేక శ్రద్ధ వహించు బ్యాంక్

ఆర్. రామలింగరాజు, ఎం. ఎల్. ఏ.
అధ్యక్షులు

యమ్. బి. రాఘవేంద్రరావు, ఐ. ఏ. ఎస్.
మేనేజింగ్ డైరెక్టరు

ఆ ఇంట్లో రోజులు చాలా భారంగా గడుస్తున్నాయి. ఒక రోజు శివాలయంలో రుద్రాభిషేకం — ఇంకోరోజు నవగ్రహాల జపం. రోజూ ఆ ఇంటి పురోహితునిచే మృత్యుంజయ స్తోత్ర పారాయణం.

ఆ రోజు వచ్చింది. అందరికీ దిగులు. పిల్లలంతా మామూలుగా ఆడుకుంటున్నారు.

మూర్తిగారు ఆ రోజు ఉదయమే లేచి పూజాకార్యక్రమాలు చేసుకున్నారు.

పగలు తనకు ఇష్టమైన వంటకాలు చేయించుకుని భుజించారు, విశ్రమించారు.

మధ్యాహ్నం నిద్రలేచి త్వరగా వంట చెయ్యమన్నారు. ఎప్పుడూ రాత్రి తొమ్మిదికిగాని భోజనం చెయ్యని ఈయన సంగతి ఏమిటని అనుకుంటూ ఆమె వంట చేసింది.

బయట వరండాలో అందరినీ తన చుట్టూ కూర్చోబెట్టుకుని కూర్చున్నారు శ్రీరామమూర్తిగారు. శేషాద్రిగారుకూడా వచ్చేరు.

అందరికీ ఒక ప్రక్క ఇది జరగదులే అని అనుకున్నా, వారి మనసుల్లో దుఃఖం గూడు కట్టుకుని వుంది.

"శేషాద్రీ.... ఒకవేళ నేను చనిపోయినా ఏంగొడవలు జరగకుండా పిల్లలను —" ఆయన నోటికి చెయ్యి అడ్డంపెట్టి లక్ష్మమ్మగారు "దయచేసి మీ కాళ్ళు పట్టుకుంటాను ఇక మాట్లాడకండి" అంది సజల నయనాలతో.

సమయం ఆరు అవుతోంది.

శ్రీరామమూర్తిగారు కనులు మూసుకుని

"శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే
సహస్రనామ తత్తుల్యం రామ నామ వరాననే" జపం

చేసుకుంటున్నారు. అందరూ కనులు మూసుకుని భగవన్నామ స్మరణ చేసుకుంటున్నారు.

"లక్ష్మీ.... లక్ష్మీ—వొరేయ్ మీ అమ్మను చూడండిరా" అనే తండ్రికేక విని అందరూ కళ్ళు తెరిచారు.

శ్రీరామమూర్తిగారి పాదాల దగ్గర జీవం లేని లక్ష్మమ్మగార్ని చూసి అందరూ గొల్లుమన్నారు.

తన ఎదురుగా వున్న శ్రీరామచంద్రమూర్తి పటంలో శ్రీరామమూర్తిగారికి కళ్ళల్లో నీరు చేరటంవల్ల క్షణంసేపు సీతమ్మ తల్లి కనుపించలేదు.

## మా ఖాతాదారులకు రుధిరోద్గారి ఉగాది శుభాకాంక్షలు

## మీ సరుకులను మా సంరక్షణకు ఒప్పగించండి




# కమర్షియల్ గూడ్స్ ట్రాన్స్‌పోర్ట్స్ Regd.

అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసు :

**247, తంబుచెట్టి వీధి**

పి. బి. నెం. 1254

**మద్రాసు - 1**

ఫోన్ నెం. 24485 & 25748

హెడ్ ఆఫీసు :

**కొత్తపేట, పి. బి. నెం. 89,**

**గుంటూరు - 1**

ఫోన్ నెం. 20560

సిటీ బ్రాంచీలు : మౌంట్ రోడ్డు, 11 బి, అత్తిపట్టన్ వీధి ఫోన్ : 846708.

బుకింగ్ ఆఫీసు . మద్రాసు-1, 125, తంబుచెట్టి వీధి, ఫోన్ : 22648

అంబత్తూర్ : ఇండస్ట్రియల్ ఎస్టేట్.

వాల్టాక్స్ రోడ్ : 98, రాసప్పశెట్టి వీధి.

బొంబాయి : 20, ఓల్డు బెంగాలిపుర వీధి, ఫోన్ : 338837.

మరియు బ్రాంచీలు : **బెంగుళూరు, మైసూరు, ఎర్నాకుళం**

**మరియు ఆంధ్రప్రదేశ్‌లోని 41 వాణిజ్యకేంద్రములు**

రుధిరోద్గారి నామ సంవత్సర ఉగాది శుభాకాంక్షలతో

గంగ, యమున,
సరస్వతుల
సంగమం
త్రివేణి
రుచి, సువాసన,
పరిమళాల
సమ్మేళనం
త్రివేణి వక్కపొడి

ప్రకృతి ప్రసాదించిన సుగంధ
పరిమళ ద్రవ్యములతో తయారు
చేయుటలో దీనికి సాటి మరొకటి లేదు.

MFG. BY
DESU VENKATA SUBBA RAO

**TRIVENI NUT POWDER MFG. CO.**
MANUFACTURERS OF
HIGH CLASS BETEL-NUT POWDER
PHONES 270 & 458 FORT ROAD MACHILIPATNAM—A P

DESIGNERS

dimple




Phone : 72287

*With best compliments from :*

# Rowfin Chit Funds Private Ltd.

PEDDIBHOTLAVARI STREET,

**Governorpet, :: VIJAYAWADA - 520 002**

# కల్ - డి - సాక్

'వెహ'

రంగులు పులవకపోతే ఈ పొయ్యానికి
రాత్రికా అంతర్గహంలో రవిశంకర్ కా సితార్ వాదన్మే
ఆదంద శంకర్ ట్రూప్
మా చిన్నప్పటి పల్లె గోపల్లెలో
గోరంటాకు పెట్టుకున్న నృత్య నాట్య చిర్నగవుల చిన్ని
పాదాలు
అశుద్ధాన్ని తొక్కిన జీవన రియలిజపు డర్టీ పిట్‌లో
క్రూరంగా
హేయంగా
భీకరంగా
అనృతాల్లో నృతించి
రుతించి
జీవన జ్వాలని పైకెగిరి ఎగసి పట్టుకొని
పావురం పెద్ద రెక్క పెడవిరిచి చిన్న రెక్కలు మీసాల
కత్తెరతో తెగేసి
నామెడమీద నోపెద్ద పరశురాముడి గొడ్డలి వేటువేసుకుని
నొప్పిలేని వేళ్ళ కొనగోళ్ళసి నక్షత్రమూలాల్లా కత్తిరించి
కడుపులో ఉంగలు చుట్టుకున్న పేగుల్ని
బజారకి చిరుకాంక్షలకై పట్టుకెళ్ళే బాస్కెట్‌లా అల్లిల్లి
చచ్చీ చావని బిసెంట్ రోడ్‌మీద కిరసనాయిల్ బుడ్డీమీద
పడుకుని చేతులు బార్లా జాచిన జీసస్ చాక్‌పీస్
కలర్ బొమ్మ పేగుల్ని సిరి సన్నని బైల్‌డక్ట్‌ని
సుతారంగా జందెంలా వేసుకుని

◆ ◆

రంగులు పులవకపోతే ఈ పొయ్యానికి
నేను రాత్రికే పుట్టలేదు రహస్యానికే ప్రసవించలేదు
రహదారినే నడవలేదు తమోరణ్యాల తీతువునై
కూయలేదు
గొడ్డలి పెట్టి నా కొనగోటి వేళ్ళ అశ్రు బిందువుల్ని
నరుక్కోలేదు

పేదరికానికో రంగు పావర్టీకో రంగు పతితకో రంగు
పతివ్రతకో రంగు
ఆకాశానికో రంగు సీసాకో రంగు కళ్లు కళ్లు కోసు
కుంటున్న కీరియోగ్రఫీకో రంగు
క్రాస్ బ్రీడ్ రంగు రత్నాలు కాంతి శూలాల్తో పొడుచు
కుంటున్న
ముక్కుపుడకలకో రంగు కాళ్లల్లో కాళ్ళవేళ్ళు గుచ్చుకొని
లీనమైన
లీలా నాయుడి కళ్ళ కాంతికో రంగు రుచి వాసన
శిల్పం తల్పంమీద మూర్ఛిల్లిన నరాల విశ్రాంతికో రంగు
పులవకపోతే ఈ పొయ్యానికి
ప్రజల్ని పల్లెల్ని పుటకల్ని ఆకల్ని స్ట్రగుల్స్‌లో వేదనల్ని
నవల్లో నాటకంలో వీధి దీపాల్లో బెల్లులేని కుక్కల
కుయ్యోల్లో
యూరప్ అంతా తిరిగితిరిగి తిరిగొచ్చి చూచి అనుభవించి
చాచిపెట్టి లెంపకాయ కొట్టినట్టు ఈ పొయ్యాంలో
రంగులు పులవకపోతే
ఈ కవిత సిలబిల్ సిలబిల్‌కీ ఎగిరి ఎగిరెగిరి
ఆక్రోశించకపోతే
ఫాల్‌రైజ్ రితమ్‌లో ఎక్కడ దుఃఖం ఉందో అక్కడల్లా
ఫాల్‌రైజ్ రితమ్‌లో ఎగసి ఎగసి ఎక్కిళ్లెక్కిళ్లు
పడపోతే

◆ ◆

రంగులూ రూపాలూ శోకాలూ శాపాలూ
డిస్కోలో ఆనంద శంకర్ నమస్కారాలూ
ఓంకారంలో మొదలైన జాజ్ ఈక్వేషన్
జగమేలే పరమాత్మా ఎవరితో మొరలిడుదూ
సితారలో వొణికిన తొలి స్వప్నం కనుబిందువు
కాటుక రాల్చిన చీకటి కటి నంటుకున్న పాపం
శోకాల మూటల్ని బుజానేసుకుని
బిసెంట్ రోడ్డులో లంగాలమ్ముకొంటున్న

ఆ రూపాయి లాటరీ పాయిల్వాడితో స్నేహం
వాడికి పేక్ హేండిచ్చినపుడు
గుప్పెట్లోంచి జారిపోతుంది గుండెకాయ
వాడి చేతిలో పరక, పట్టుకోంది హంతకుడ్ని
కుంకం బొట్టు పెట్టుకున్న నల్లని నుదిటిన
తెల్లగా నవ్వుతూ ఇన్సర్ట్‌లో అజంతా
మాంత్రికుడిలా ఈ పాయంలో రంగుల్నల్నీ తుడిచేస్తూ
ఎవరో ఉమ్ముతాడు తుపుక్కు నకారా కిళ్ళీనేలతల్లి తెల్లనిబళ్లో
చెట్టునుంచి కోసిన మల్లెపూలు తల కొమ్మల్లో చిక్కు
కున్నపుడు



అన్ని దారులూ కలుస్తాయి
రంగుల్లో ఆనందశంకర్ డ్రీమ్స్ ఫరెవర్‌లోలా
నృత్యం నాట్యం నాటకం మైమ్ పొయిటిక్ డ్రామా
సంగీత రూపకం రుజాగ్రస్త బుజాలు రాసుకుంటూ
ప్లాస్టర్ ఆఫ్ పారిస్ చంకలో మరీ లోతుగా చిల్లుపడి
బ్రాంజ్‌లో మలిచిన పెల్విక్ గర్డిల్ ముక్క రాలిపడి
తామరాకు మీద పాదరసంలా పక్కకిజారుతుంది సెక్స్
ముత్యం

కవిత తన శుద్ధ రూపాన్ని వీడి
రంగుల్తో రూపంతో నృత్తంతో నాట్యంతో
హత్యతో ఆర్తనాదంతో ఆకల్తో
రాజకీయాల్తో ఆక్రమిస్తోన్న గుడిసెల్తో
బిగించిన పిడికిళ్ళతో మెట్లెక్కి ఎక్కిఎక్కి వెళ్తోన్న
కోపపు పద నర్తనలతో న్యూయార్క్ స్ట్రీట్ మ్యూజిక్‌తో
ఫైరింజన్ల ఘంటానాదాల సిటీ మాప్‌లతో
రూపాంతరం చెందకపోతే వృ
ధా !

దాసరి నారాయణరావు

అపూర్వ ప్రజాదరణతో
ఆంధ్రదేశమంతటా
విజయభేరి మ్రోగిస్తున్నారు!

నంగనూరు శ్రీనివాసరావు సమర్పించు
లక్ష్మీ ఫిలిమ్స్ కంబైన్స్

# రాముడు కాదు కృష్ణుడు

కలర్

నిర్మాత: యన్.ఆర్. అనూరాధాదేవి

కీత —
DWARAKA



# ...... పల్లకీల మోత!

శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

ఎవరమ్మా అక్కడ ?
ఉగాది వెలుగులు ఉవ్వెత్తుగా లేచినట్లే లేస్తున్నాయి
మా అందరి గుండెల్లో మల్లెలు పూచినట్లే పూస్తున్నాయి
మోడు వారిన వృక్ష సంతతి మోసులెత్తి
ఒడుబోయిన జీవితాలకు ఆశావాదాన్ని మెత్తి
పల్లవిస్తున్నాయి ప్రజాస్వామ్య వ్యవస్థకు పల్లవిపాడుతూ!
వసంత లక్ష్మి చిలకపచ్చ చీర పైటగాలులు మందంగా
వీస్తున్నాయి
అందంగా అతిసూక్ష్మంగా ఆవరించిన అంధవిశ్వాసాల్లాగా!
కొత్త చివుళ్ళను ఒబ్బిడిగా మెక్కడం కోసం కోయిలలు
సన్నాయిస్వరనినాదంతో సాటిపక్షుల్ని మైమరపిస్తున్నాయి
పరభృతాలనిపించు కొంటున్నాయి-
పాలక మనస్తత్వంతో !
ఊరికి ఉత్తరంగా పేరుకపోయిన స్వార్థాలకు ప్రతీకలుగా
ఉన్నవారి మేడల్లా విస్తరించిన ఊడల మఱ్ఱి నీడల్లో
కత్తిగట్టి వదలిన మొనగాళ్ళ మెప్పుకోసం
నోరులేని కోళ్ళు హోరున పోరు కొనసాగిస్తున్నాయి
నోరున్నా తీరు తెలియని తిక్క మనుష్యుల్లాగా !
ఆలయప్రాంగణంలో ఆశావాదప్రసంగం పంచాంగశ్రవణం
సామాన్యుణ్ణి భవిష్యత్తులో ఊపుతూ ఊరట పరుస్తూఉంది.
సవ్యంగా సాగుతున్నట్లే కనిపిస్తున్న ప్రగతిపథకాల్లాగా!
పాటక జనం పడిన పాట్లకు ప్రతిఫలంగా
గాదెలు నిండినట్లే గర్వపడుతున్నాయి -
అభ్యుదయాన్ని ఆలపించే కవి కంఠశోషలాగా !
ఈ వినూత్న శోభను విశ్వానికి విడమరచి
చెప్పతలచిన వాళ్ళం
గమిస్తున్న ప్రగతి రహస్యాన్ని చుట్టి పరిభ్రమిస్తున్న
మొనగాళ్ళం
విప్లవంతో వియ్యమందిన వాళ్ళం
అభ్యుదయంపై ఆశలు పెంచుకొంటున్న వాళ్ళం
సంప్రదాయానికి సాగిలబడి మొక్కుతున్న వాళ్ళం
పర్వదినాన గర్వపడు సంప్రదాయాన్ని
సంతృప్తిగా మెక్కినాము
ఎవరమ్మా అక్కడ ?
కనుపించినట్లే కనుపిస్తున్నావు కనుమరుగైపోతున్నావు
వచ్చినట్లేవస్తున్నావు దూరదూరంగానేతారట్లాడుతున్నావు
చూస్తున్నట్లే చూస్తున్నావు రావడానికి సందేహిస్తున్నావు
ఎవరమ్మా అక్కడ ?

యుగాది నుండి ఉగాది లక్ష్మిని
బొట్టూ కాటుక పెట్టి పిలుస్తున్నాం
పిలిచిందే తడవు! ఆమెకేమీ కంటపడదు.
సరాసరి వస్తుంది సంబరాల్ని తెస్తుంది.
ఇంటి ఆడపడుచుగా యింటింటినీ అలరిస్తుంది.
ఎదురుచూస్తున్నది ఆమె కోరకు
ఎలుగెత్తి వత్తి పత్తి ఆహ్వానాలు పలుకుతున్నదామెకోరకు
ఎందుచేతనో ఆమె జాడ కానరాలేదు యింతవరకు !
మా స్మృతి పథంలో, మా సంస్కృతీ విధంలో, గతంలో
మరొక్కరు ఈ తావులో తారట్లాడినట్లు దాఖలాల్లేవు !
ఎవరమ్మా అక్కడ ?
ఆఁ!.... నీవేనా ఉగాది లక్ష్మివి !!
పోల్చుకోలేని స్థితిలో, అవతారమే అర్థంకాని గతిలో
నిస్పృహల సెగల్లో నిర్వీర్య పరిధుల్లో నిస్సహాయ స్థితులో
తగులుకొని పరితపిస్తున్న తరుణీ !
పుట్టింట అడుగూనటానికి పుట్టెడు నైరాశ్యాన్ని
మొగాన పులుముకున్న రమణీ !
నేటి నీ తీరుతెన్నులు అంతుపట్టక నీళ్ళు నములుతున్నాను
తామసం వద్దమ్మా ! పుట్టింటికి ఆడుబిడ్డ రాక ముద్దమ్మా !
రావమ్మా ! రా !! —
ఉన్నదానితో తృప్తిపడమను ఉద్బోధనలు తింటున్న వాళ్ళం
దరిద్రాన్ని కూడా వరంగా స్వీకరించి ధైర్యాన్ని నంజు
కొంటున్న వాళ్ళం
తలదాచుకోవడానికి తావులేకున్నా తలెత్తుకొని
తిరుగుతున్న వాళ్ళం
తాగడానికి నీళ్లు లేకున్నా సేద్యమే దేశ బాధ్యత అయినా
నిండు సముద్రాలకే నీళ్లు సరఫరాచేస్తున్న త్యాగమూర్తులం
రత్నాల తలపోతలతో రాళ్ళరప్పలమధ్య
రాయితేలుతున్న వాళ్ళం
నికృష్టమైనబ్రతుకుల్లోకూడా నీతిని నెత్తికెత్తుకొన్న వాళ్ళం
కష్టాల కడలి నీదడానికి కర్మ సిద్ధాంతాన్ని ఒంటపట్టించు
కొన్న వాళ్ళం
ఆడుబిడ్డను అనునయించలేనిఅశక్తులమని ఆవేదనపడకమ్మా
రావమ్మా ! రా !! —
నీవు వస్తున్న సంబరాన్ని చాటుకోవడానికి తలపుల
మాట ఎట్లున్నా
తల గడిగి పోసుకోవడానికి తల్లీపిల్లా బిందె చేతపట్టి
నిన్ననగా వెళ్లినారు - నిలువు కాళ్లమీద నిలబడినారు !

మంచినీళ్ల పంపు ముందర మురుగు కాలువ కంపు దగ్గర
వచ్చేసుంటారు! —
కడగొట్టు బుడంకాయ, కానులివ్వందే కదలని గడుగ్గాయ
నీవు వసున్నావన్న సంబరంలో వాడికి వాడుగా వడి
వడిగా వెళ్లి
నిన్నగాక మొన్న నిలబడినాడు —
చౌక దుకాణం ముందర సరసంగా యిచ్చే సరుకుల
కొరకు
దుకాణం దరిదాపులకు చేరి ఉండవచ్చు యింత వరకు!

వాడి కంటే పెద్దవాడు వాడి వేడి భావాలు కలవాడు
వేప పూతకు తీపి పూతలు పూయాలని కలలుగంటున్న
వాడు
వేప పూతకై వెళ్లినాడు - ఎకాఎకిని రానే వస్తాడు!

దేశాన్ని తాకట్టు నుండి విడిపించుకోవడానికి
దేహాన్ని మాత్రం మిగిల్చుకొని —
సర్వస్వాన్ని ధారపోసుకొన్న నీ సోదరుడు-స్వాతంత్ర్య
సమరయోధుడు
'స్వతంత్ర భారత పౌరుడు'గా వినుతికెక్కిన గౌరవ
నీయుడు
ఆడపడుచు పుట్టింటికి వస్తున్నదన్న ఆనందంలో
ఆలి తాళిని తాకట్టుపెట్టడానికి హడావిడిగా వెళ్ళినాడు
తిరుగుముఖం పట్టే ఉంటాడు!
రావమ్మా! రా!!

ఇంకా వెనుకాముందాడుతున్నా వెందుకూ!
నా మాట మీద నమ్మకం కుదరడంలేదా?

ఇవికావు తల్లీ ఎన్నికల వాగ్దానాలు!
నాభి నుండి వెలువడిన నగ్నసత్యాలు!! —
వచ్చేస్తారు! అందరూ వచ్చేస్తున్నారు!

ఉన్నంతలో సర్దుకపోయే సంస్కృతి మనది
తిన్నంతలో సంతృప్తిపడే సంస్కారం మనది.
కలో గంజో కలిసే తాగుదాం!

కన్నబిడ్డను కట్టబెట్టడానికి కన్నతండ్రి కన్నగసాట్లు
పడతాడు.
కానీ కళ్యాణవేదిక ముందు నిలబడి కంట తడిబెట్టడు.
పర్వదినాన గర్వపడే సంప్రదాయం మనది.

ఎందుకమ్మా సందేహం? నీకొరకేగదా ఈ సందోహం!!
రావమ్మా రా!! —

# పూల ఋతువు

శ్రీ తమ్మిశెట్టి రామారావు

వాడని వసంతకాలము
వీడని పూతావితోట విరిసెడికాలం
మోడు చివురించుకాలము
పాడని కోయిలకు గొంతుపలికెడి కాలం

గిరిరాజు శిఖపాగ తరువులై కదలాడి
మలయ మారుతమును మహిని జిమ్మ
కడలి చంద్రుని గుండెకదలాడి నదులలో
నింగి అంచులదాక పొంగిపొరల

మధు మాసమును జూసి మల్లెతీవలు బూసి
మధుపాల ఎదలోన మరులు గొల్ప
ఆమని అరుదెంచి మామిడి చివురించి
చిలుక సంతతితోడ కులుకుచుండ

వచ్చె నవయుగాది యిలకుతెచ్చె సుధను
సర్వ జనులకు పంచెను సమత, మమత
పచ్చతోరణములు తీర్చి ప్రతిగృహమ్ము
పలికె పూల ఋతువుకు సుస్వాగతమ్ము.

# ఉగాది తలపులు

డా॥ వక్కలంక లక్ష్మీపతిరావు

మనిషి సజీవంగా సమాధి చేసిన విత్తనం
మహావృక్షమై విజృంభించి
తనను నిలువునా పాతిపెట్టినవాడికి
తన చల్లనినీడ నిచ్చి సేవ దేరుస్తోంది !

నాజూకుగా వుండే మనుషులలో
బూజుపట్టిన భావాలు చూసి
కొత్త చిగుళ్ళు తొడిగిన పాతచెట్లు
పువ్వులమిషతో నవ్వుకుంటున్నాయి !

కూడుగుడ్డలకు మోమువాచిన జనసమూహం
ఉగాదికి కొత్తబట్టలు కట్టుకున్న చెట్లు చూసిను
మనిషిగా పుట్టడంకన్న
మానై పుట్టడమే మంచిదని నిట్టూరుస్తోంది !

ఆకాశాంతములకు సాగిన కొమ్మలను చూసి
అభయహస్తాలని భ్రాంతిపడి
వటవృక్షాల పాదాలదగ్గర పడివున్న పిచ్చిమొక్కలు
ధనవంతులకు వోటు వేసిన బడుగుజనాలను
తలపిస్తున్నాయి!

నీరు పోసి మందువేసి
గారాబంగా పెంచిన కామందు
నిలువునా ఊచకోత కోస్తుంటే
ఆలస్యంగా అతని ఆంతర్యాన్ని తెలుసుకున్న వరిచేలు
క్రమాంతంగా తలలు వాల్చేస్తున్నాయి !

గానుగలో నలిగిపోతున్న చెఱకుగడలు
"తేనెమనసున్న వాళ్ళగతి యింతేకదా !" అని
నిలువునా నీరై
చేదుపచ్చడితో జత కడుతున్నాయి !

ప్రాతదనంలో మరుగుపడ్డ కొత్తదనాలు
తెరతీసుకువచ్చే పండుగ యీ ఉగాది !
"చేదుబ్రతుకులో తీయదనాలను
చేదుకొ"మ్మని చెప్పేపండుగ ఉగాది !

డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

# జీవ పరిణామం ఒక అద్భుత ప్రక్రియ!

మానవుడు ఎలా ఉద్భవించాడనేది ఇప్పటి ప్రశ్నకాదు. జిజ్ఞాసువు అయిన మానవునికి ఈ ప్రశ్న ఎప్పుడో తారస పడినది. దీనికి నిర్దుష్టముగా సమాధానించడం కష్టసాధ్యం. మానవ పరిణామం అంతసులభముగా బోధపడేదికాదు. మానవుని ఆగమనాన్ని విశదపరచడంలో ఎందరో మహామహులు తమవంతు పాత్రలను నిర్వహించినారు. నిర్వహిస్తూనే ఉంటారు. ఎన్నో సందేహాలను తీర్చుకుంటూ, మానవ క్రమగతిని వివరిస్తూఉన్నా, ఇంకా ఈనాటికి కూడా, మనిషి పుట్టుక అంతుబట్టని రహస్యంగానే ఉన్నది. అసలు భూమి ఎట్లా ఏర్పడినది? జీవరాశులు ఎట్లు ఏర్పడినాయి? ఇవి శాశ్వతమా? అశాశ్వతమా? వాటి లక్ష్యమేమిటి? అవి చేరుకోవలసిన గమ్యమేమిటి? అనే ప్రశ్నలన్నీ ప్రశ్నలుగానే ప్రాణం పోసుకొంటున్నాయి. సృష్టి ఎలా జరిగిఉంటుందనేది విచిత్రమైన సమస్యే అయినా విశ్లేషించడానికి వీలుకానంత విపరీతమైన సమస్యకాదని నా అభిప్రాయం. తర్కమీమాంసలో తెలియనిదాని తెలుసుకోవడం కూడా పరిష్కారమేనని విజ్ఞులు గ్రహించవలె. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని సృష్టిసిద్ధాంతాలను గురించి చర్చించడం ఎంతో సముచితం.

ప్రత్యేక సృష్టివాద మొకటి ఉన్నది. ఈ వాదం ప్రకారం సర్వశక్తి వంతుడు, కాలాతీతుడు అయిన ఒక విశ్వభవుడు ఉన్నాడు. అతనే విశ్వాన్ని, అంటే ప్రకృతిని సృష్టించినాడు. అతని ఇష్టానుసారమే ఆ విశ్వం నడుచుకుంటూ ఉంటుంది. అతని శక్తికూడా నిర్దుష్టమైన నియతిని, క్రమగతిని కలిగివుండి విశ్వచక్రాన్ని విస్పష్టమైన సరళిలో నడుపుతూ ఉంటుంది. విశ్వమంటే ఏమిటి? అది ఎలా ఉంటుంది? ఈ ప్రశ్నలకు సమాధానంగా ఒక భావనను ఏర్పరచుకోవచ్చును. ఆకాశమనునది లేదా అంతరాళమనునది ఉన్నది. అది శాశ్వతము. (ప్రత్యక్షనిదర్శనములులేవు). అందులో అనేకమయిన గ్రహములు (భూమితోసహా). ఈ గ్రహాలలో లెక్కకు మిక్కుటమైన జీవరాశులు–జలచరాలు, భూచరాలు, వాయుచరాలు. ఈ గ్రహాలకు శక్తిపరధులు ఉన్నాయి. ఇవి ఆ శక్తిపరధుల ననుసరించి ఒకదానిచేత ఒకటి ఆకర్షించబడుతూ విశ్వానికి అనుసంధానించబడి ఉంటాయి. ఈ గ్రహాలకు నిర్దుష్టమైన గమనముండవచ్చును. అయితే ఈ గమనమెందుకుంటుందో ఎంతవరకు ఉంటుందో ఎవరికీ తెలియదు. అందుకే అది విశ్వనాథుని మహిమగా కీర్తించబడినది. గ్రహాల చైతన్యము, జవసత్వము ఒక్కమాటలో మొత్తం భవిష్యత్తు విశ్వభవుని చేతిలో ఉంటుంది. ఇది అతీతంగా, అనంతంగా, కొనసాగిపోతూనే ఉంటుంది. ఈ విశ్వభవుని ప్రభావంవల్లనే గ్రహరాశులు రూపొందుతాయి. ఆ విధంగా భూమిమీద జీవరాశులు ఏర్పడినాయి. ఈ జీవరాశులన్నీ ఒకే సమయంలో సృష్టించబడినవని నమ్మకం. సృష్టి ప్రారంభమైనది మొదలు ఆ జీవరాశులలాగే ప్రత్యుత్పత్తిద్వారా తమ సంతతిని కొనసాగించుకొంటూ వస్తున్నాయని చెబుతారు. అంటే సృష్ట్యాది నుంచి కూడా నరులు, వానరులు, మృగాలు, క్రిమికీటకాదులు అన్నీ కలిసికట్టుగా ఉన్నాయని భావం. అయితే గత రెండువందల సంవత్సరాలుగా అభివృద్ధిచెందిన "సైన్సు" ఈ విధమైన సృష్టివాదాన్ని ఒప్పుకోదు. "సైన్సు" ప్రకారం మానవ పరిణామం ఒక నిర్దుష్టక్రమాన్ని అనుసరించి జరిగిన ప్రక్రియ. దీని ప్రకారం నిమ్న స్థాయిజీవుల నుంచి ఉచ్ఛస్థాయికి చెందిన మానవుడు ఏర్పడినాడు. దీనికి అవలంబనగా ఉపాలంభంగా నిలిచే ఎన్నో సాక్ష్యాధారాలను శాస్త్రవిజ్ఞానం చూపించగలిగింది. ఈ శాస్త్రరీత్యా పరిణామం ఎలా రూపొందినదని చెప్పబడుతున్నదో, అదే విధమైన అభిప్రాయాన్ని మన పూర్వీకులు కూడా భావించడం ప్రత్యేకించి చెప్పుకోవలసిన విషయం. ఉదాహరణంగా దశావతారాల ప్రస్తావనను ఉటంకిస్తాను. పది అవతారాలలోను మొదటిది మత్స్యావతారం. సృష్టి సముద్రంనుండి ప్రారంభమయినదని చెప్పడానికిది గురుతు. జలచరాలనుంచి భూచరాలు ఏర్పడ్డాయనే శాస్త్రభావనకు అనుకూలంగా చేప ఇక్కడ చోటు చేసుకొని కూర్మావతారానికి దారితీయడం ముదావహం. "సైన్స్" ప్రకారం చేపలనుంచి ఉభయచరాలు, ఉభయచరాలనుంచి సరీసృపాలు, సరీసృపాలనుంచి పక్షులు ఒకవైపు, క్షీరదాలు రెండవవైపు అభివృద్ధి చెందినట్లు భావించడం జరుగుతోంది. ఈ క్షీరదాలలో ప్రముఖస్థాయికి చేరుకున్నవాడే మానవుడు. దశావతారాలు కూడా అంతే. ఇదే ప్రసక్తిని తెలియచెప్పుతున్నది. చేపనుండి తాబేలు, ఆ తాబేలునుంచి వరాహము [ఇది క్షీరసముద్రము] ఈ వరాహమునుంచి నరసింహము (ఈ ఊహసరికాదు అని చెప్పడానికి వీలులేదు. ఎందుకంటే మత్స్య కన్యలను, అంటే సగం మానవాకారము, సగము చేప

ఆకారము ఉన్న విచిత్రజంతువులను ఎందరో చూచినట్లు సాక్ష్యాధారాలు వున్నాయి. అలాగే నరసింహం కూడా!] ఈ నరసింహము నుంచి మానవాకారము వెలువడినట్లు దశావతారాలు తెలుపుచున్నాయి. చివరి అవతారమయిన కల్కిఅవతారము కూడ త్రోసిపుచ్చటానికి వీలులేదు. ఎందుకంటే "న్యూక్లియార్ ఎక్స్‌ప్లోషన్" లవల్ల విడుదలయ్యే "రేడియేషన్ ఎఫెక్ట్" అపరకల్కి అవతారము కాక మరిఏమిటి? మొత్తానికి జీవపరిణామం ఒక క్రమపద్ధతిలో జరిగిందనే విషయం నిర్వివాదాంశం. ఎలా జరిగివుంటుంది? అనే ప్రశ్నను పరిశీలించవలె. ఈశ్వరవాదాన్ని ప్రక్కనపెట్టి, శాస్త్రవాదాన్ని కూలంకషంగా చర్చిద్దాం.

భూవిజ్ఞాన శాస్త్రాధారాల ద్వారా భూమి వయస్సు ఐదు వేల మిలియన్ సంవత్సరాల పైచిలుకని తెలిసివస్తున్నది. భూమి జీవితకాలాన్ని ఐదు మహాయుగాలుగా విభజించినారు. దాదాపు 290 కోట్ల సంవత్సరాలపాటు మొదటియుగం కొనసాగింది. ఈ ఆదిజీవ మహాయుగంలో ఏకకణజీవులు మాత్రమే ఉండేవని అంచనా. ఆ తరువాత ప్రథమజీవమహాయుగం 150 కోట్ల సంవత్సరాలపాటు పరిగణించబడి నిమ్న స్థాయికి చెందిన ప్రాథమిక, సాగర అకశేరుకాలతో (వెన్నెముక లేనివి) పరిఢవిల్లింది. తరువాతది పురాజీవమహాయుగము. దీని వయస్సు 37 కోట్ల సంవత్సరాలని అంచనా. ఈ యుగంలో జలచరాలు, ఉభయచరాలు, వృశ్చికాలు, సరీసృపాల వంటి భూచరాలు ఉద్భవించినాయని శిలాజాల ద్వారా తెలియవస్తోంది. ఆ తరువాత 16.7 కోట్ల సంవత్సరాల కాలాన్ని మాధ్యమిక మహాజీవయుగంగా గుర్తించినారు. ఈ యుగంలో సరిసృపాలు మహాద్భుతంగా వికసించినాయి. ప్రాథమిక స్థాయికి చెందిన క్షీరదాలు, పక్షుల తరువాత క్రమంగా అదేకాలంలో ఏర్పడినాయి. ఆధునిక మహాయుగం 63 కోట్ల సంవత్సరాలుగా కొనసాగుచున్నది. ఈ యుగంలో క్షీరదాలు పతాకస్థాయికి చేరుకొని మానసికంగా మహోన్నతమైన దశను చేరుకున్న మానవులకు ఆస్కారమిచ్చినాయి. ఈ క్షణం వరకు జంతుశాస్త్ర పరిభాషలో, పరిణామరీత్యా ఉత్కృష్టమైన స్థాయిలోవున్న జంతువుగా మనిషి గుర్తించబడినాడు. ఎంతగానో కీర్తించబడినాడు. మరి సంస్కారపు మాటేమిటని ఎవరైనా ప్రశ్నించవచ్చును. దానిని తరువాత చర్చిస్తాను.

జీవులుగత 60 కోట్ల సంవత్సరాలుగా మాత్రమే ఉన్నట్లు శిలాజాలు విశదపరుస్తున్నాయి. అంతకుముందు కేవలం ఏకకణజీవులు. ప్రాథమిక అకశేరుకాలు ఉన్నట్లుగా ఊహించబడుతున్నది. భూమి ఎట్లు ఏర్పడిఉంటుంది? అనేదానికి సమాధానంగా "నెబ్యులా" నుంచి (నక్షత్రకూటమి) 5లక్షలకోట్ల సంవత్సరాలకు పూర్వం ఏర్పడిన "కాస్మిక్" ప్రభావం కారణంగా చెబుతారు. అయితే మొదటిసారిగా ఏకకణజీవులు ఎలా ఏర్పడివుంటాయి అనే ప్రశ్నకు

సమాధానంగా ప్రాణిచైతన్యానికి రసాయనిక మూలకాలను ఆధారంగా తీసుకొంటారు. అవి కర్బనము, నత్రజని, ఆమ్లజని, ఉదజని, భాస్వరము, ("మెగ్నీషియం" ను కూడా ఇందులో చేర్చవచ్చును). ఉదజని, ఆమ్లజనిల కలయిక వలననే ప్రాణాధారమైన నీరు ఏర్పడుతుంది. ఉదజని, ఆమ్లజని, కర్బనము, ఈ మూడింటి కలయికవల్ల జీవాధారాలైన "కార్బోహైడ్రేట్" లు మరియు క్రొవ్వులు ఏర్పడతాయి. చైతన్యానికి, జవసత్వానికి, మూలప్రతీక అయిన "ప్రోటీన్" కర్బనము, ఆమ్లజని, ఉదజని, నత్రజనుల సమ్మేళనమే. ఇదే ప్రాణానికి ఆయువుపట్టు. ఈ ఒక్క "ప్రోటీన్" అణుసముదాయమే జీవిగా వ్యవహరించగలుగుతుంది. అయితే ఈ జీవిని ప్రయోగశాలలో తయారుచేయలేకున్నారు. ఇది ఇంతవరకు అంతుబట్టని సమస్య. జీవరహస్య కీలకంగా గుర్తించబడిన డి. ఎన్. కూడా కర్బనము, నత్రజని, ఉదజని, ఆమ్లజని, భాస్వరాల రసాయనిక పదార్థమే. వృక్షాలలో జీవాన్ని పోసే "క్లోరోఫిల్" కూడా ఈ మూలకాల సమ్మిళితమే. ఇందులో అదనముగా "మెగ్నీషియమ్" కూడా చోటుచేసుకొంటుంది. మొత్తానికి "ప్రోటీన్" అణుసముదాయ జీవిగా మనగలుగుతుందని తెలుసుకోవడం జరిగింది. ముందు జీవులకు, నిర్జీవులకు, మధ్యస్థంగా వుండి, జీవులో, నిర్జీవులో ఇంతవరకు అర్థంకాని "వైరస్"లు ఆ తరువాత "బ్యాక్టీరియన్" లు, "యూగ్లినా" "క్లామిడో యోనాస్" ల వంటి జంతు వృక్ష కణాలు, అమీబావంటి ఏకకణజంతువులు, ఏకకణవృక్ష జీవులు రూపొందాయి. ఏకకణజంతువుల నుంచి వర్గవికాసము జరిగి అమీబానుంచి మానవుని స్థాయి రూపొందినది. ఏకకణ వృక్షాల నుంచి అత్యధిక స్థాయికి చెందిన ఆవృతబీజమొక్కలు ఏర్పడినట్లు భావించడం జరిగినది. అయితే అమీబానుంచి మానవుని వరకు ఏర్పడేవశలు ఎట్లా ఉంటాయనేది ఆ ఏర్పడే తేరుతెన్నులు ఏ విధమైన ప్రతిపత్తిని కలిగిఉంటాయనేది వివరణను కోరే ముఖ్యమైన ప్రశ్నలు.

పరిణామ వాద సిద్ధాంతం ప్రకారం నేడు కనిపిస్తున్న అన్ని జీవరాసులు, మానవునితోసహా ప్రాథమిక స్థాయిలో రూపొందిన ఏకకణజీవులనుంచి కాలక్రమేణా పరిణితి పొందుచు పరిసరాలకు అనుగుణ్యమైన వైవిధ్యాలను సంతరించు కొంటూ ఉద్భవించిన జీవులేనని తెలియవస్తుంది. ఈ వైవిధ్యం దేహగతంగాకన్నా కూడా వంశగతంగానే ఎక్కువగా వుంటుంది. అంటే ఏకకణజీవినుంచి మానవుని వరకు జన్యుపరమైన అవిచ్ఛిన్నత ఉంటుంది. అంటే మొత్తం జంతుసామ్రాజ్యాన్ని ఒక వంశవృక్షంగా భావించవచ్చును. ఈ జన్యు సంబంధమైన బాంధవ్యాన్ని ఒక వంశవృక్షంలాగా చూపవచ్చును.

రైతు సోదరులకు మా ఉగాది శుభాకాంక్షలు

# రైతులు కోరుకొనేవి










భారతదేశపు సస్య విప్లవంలో ఆంధ్రప్రదేశ్ రైతాంగము ప్రముఖ పాత్ర నిర్వహిస్తోంది. గణనీయమైన వారి కృషిలో ఆర్. సి. యఫ్ వారి కాంప్లెక్సు ఎరువులు ప్రిల్డ్ 20:20:0, సుఫల 15:15:15 మరియు ఉజ్వల యూరియాలు అండగా నిలచి అధిక దిగుబడులకు తోడ్పడుతున్నవి. అందుచేతనే ఈనాడు రైతులు ప్రథమంగా కోరుకొనే కాంప్లెక్సు ఎరువులు ఆర్.సి యఫ్ వారి ప్రిల్డ్ 20:20 0, సుఫల 15:15:15 మరియు ఉజ్వల యూరియా.

ఇబ్బడి ముబ్బడిగా పెరుగుతున్న రైతాంగపు ఎరువుల అవసరాలను తీర్చవలసిన ఆర్.సి.యఫ్ బాధ్యత మరింతగా పెరిగింది. ఈ పరిస్థితిని సమర్ధవంతంగా ఎదుర్కొనేందుకు అవసరమైన అన్ని ఏర్పాట్లు చేయడం జరిగింది. ఏ ప్రాంతంలోని రైతైనా ఎక్కువ శ్రమపడకుండా, తక్కువ వ్యవధిలో ఇప్పుడు ఆర్.సి.యఫ్ కాంప్లెక్సులను పొందే వీలున్నది.

ఆంధ్రప్రదేశ్ అంతటా విస్తృతంగా ఉన్న ఆర్.సి.యఫ్ వారి డీలర్ల ద్వారాను, ఆంధ్ర ప్రదేశ్ ఆగ్రో ఇండస్ట్రీస్ మరియు మార్కెటింగ్ ఫెడరేషన్ వారి విక్రయ కేంద్రాల ద్వారాను, సుఫల ప్రిల్డ్ 20:20:0, సుఫల 15:15:15 మరియు ఉజ్వల యూరియాలు అందుబాటులో ఉంచబడినవి.

ప్రగతిపథంలో రైతువేసే ప్రతి అడుగులోను తమ పాత్ర సమర్థవంతంగా నిర్వహించేందుకు ఆర్.సి.యఫ్ సిద్ధంగా ఉంది.

Sobhagya




**రాష్ట్రీయ కెమికల్స్ & ఫెర్టిలైజర్స్ లి.**

(కేంద్ర ప్రభుత్వ యాజమాన్య సంస్థ) హైద్రాబాద్.

# జీవసామ్రాజ్య వంశవృక్షం




పరిణామ వాదం ఇలాగ ఏకకణజీవుల నుంచి నేటిజీవులు ఎలా ఉద్భవించినాయో చెబుతుందే తప్ప ప్రథమజీవవ్యవస్థ ఉద్భవాన్ని స్పష్టంగా తెలియజెప్పలేదు. జీవధాతువులేవో తెలిసినా ప్రయోగాత్మకంగా జీవాన్ని ప్రతిష్ఠీకరించలేక పోవడం శాస్త్రానికి ఒక సవాలుగానే నిలిచిఉన్నది. అందువల్లనే ఈశ్వరవాదానిదే పై చేయి అని అనిపిస్తుంది. జీవజాతి యాదృచ్ఛికమా? క్రమానుగతమా? అనేవి నేటికీ సమస్యలే! ప్రాణాన్నిచ్చే "అంశం" ఏది? అనేది ఇంతవరకు ప్రశ్నార్థకమే. జీవపరిణామ సిద్ధాంతాలలో ముఖ్యమైనవి లామార్క్ సిద్ధాంతము, డార్విన్ సిద్ధాంతము. శాస్త్రబద్ధంగా జీవపరిణామాన్ని వివరించిన ఘనత "లామార్కిజమ్", "డార్వినిజమ్" లకు మాత్రమే చెల్లుతుంది.

## లామార్కిజమ్

ఫ్రెంచిజంతు శాస్త్రజ్ఞుడు లామార్క్ (1744-1829 క్రీ. శ) ప్రతిపాదించిన ఈ సిద్ధాంతంలో రెండుముఖ్యమైన సూత్రాలున్నాయి. ఈ సూత్రాలను, ఆయన పరిశీలనలను "ఫిలాసఫీజులాజిక్" అనే గ్రంథములో లామార్క్ విశదపరచియున్నాడు. మొదటిసూత్రము ఉపయుక్త, నిరుపయుక్త సూత్రము. ఈ సూత్రము ప్రకారం ఒక అవయవము యొక్క అభివృద్ధికాని, అదృశ్యముకాని, ఆ అవయవాన్ని ఉపయోగించుకునే తీరుపై లేదా పూర్తిగా వినియోగించుకోక పోవడం అన్న విషయంమీద ఆధారపడివుంటుంది. జిరాఫీ చెట్ల ఆకులను తినడానికి వీలుగా మెడను పైకెత్తడం వల్ల వాటిముందర కాళ్ళను ఎత్తుగా సాగదీయడం వల్ల కొన్ని తరాలనాటికి పొడుగాటి మెడగల, పొడుగాటి ముందరకాళ్ళుగల జిరాఫీ ఏర్పడినవని లామార్క్ చెబుతాడు. ఇలాగే బొరియలలో దూరడానికి వీలుగా, ఆటంకంగా వున్న కాళ్ళను క్షీణింపచేసుకొని సులభంగా జీవనం గడపడానికి వీలుగా సర్పము రూపొందినదని లామార్క్ భావించినాడు. అయితే ఉపయోగించుకోవడం, ఉపయోగించుకోకపోవడం అనే యీ రెండు లక్షణాలద్వారా రూపొందే వైవిధ్యాలు తరువాతి తరువాతి తరాలకు అందుతాయా అన్నది ఒక ప్రశ్నార్థకము. అందే వీలులేదని చుంచెలుకల తోకలు కత్తిరించి వాటిమధ్య సంపర్కం జరిపించి, అదేవిధంగా ఇరవై తరాలవరకు చేసినప్పటికి క్రొత్తగా

ఎప్పుడే చుంచెలుకలు తోకలను పోగొట్టుకోకపోవడం వల్ల, వైస్‌మాన్ అనే జర్మన్ శాస్త్రజ్ఞుడు స్పష్టంగా తెలియజేసి, లా మార్క్ సిద్ధాంతంలోని లోపాన్ని ఎత్తిచూపేందుకు వీలుగా బీజద్రవ్య సిద్ధాంతాన్ని ప్రతిపాదించినాడు. ఇతని సిద్ధాంతం ప్రకారం జంతువుల జీవద్రవ్యం (ప్రోటోప్లాజమ్) రెండు భాగాలుగా ఉంటుంది. ఒకటి దేహద్రవ్యం, రెండవది బీజద్రవ్యం. శరీరావయవాలన్నీ దేహ ద్రవ్యసంబంధములు కాగా సంతానోత్పత్తికి కారణమైన బీజకణాలు మాత్రం బీజద్రవ్య సంబంధులు. దేహములో కలిగేమార్పులు దేహ ద్రవ్యంలో మార్పులు కలిగిస్తాయి. ఇవి తరువాతి తరానికి అందచేయబడే అవకాశం లేదు. బీజద్రవ్యంలో కలిగే మార్పులే సంతానానికి సంక్రమిస్తాయి. దీనిని కాదనలేకపోయినా దేహద్రవ్యంలో కలిగే మార్పులు బీజద్రవ్యముపై ప్రభావాన్ని చూపలేదా అనేది అంత తేలికగా వదిలిపెట్టవలసిన అంశముకాదు. దేహద్రవ్యానికి ఎంతో విశిష్టమైన పాత్ర ఉన్నది. దాని ప్రభావం తప్పకుండా బీజద్రవ్యంపై ఉంటుంది. అయినా పరిణామ చరిత్రలో ఇరవై తరాల చుంచెలుకల కథ మహోజ్జ్వల హరికథలో ఒక పిట్ట కథ. వైస్‌మాన్ అభిప్రాయం అంతసమంజసమైనదికాదని నా అభిమతము. (ఇరవై తరాలన్నా చుంచెలుకల్లో అరవై సంవత్సరాలకు మించవు. పరిణామ చరిత్రలో యీ కాలం నిలుస్తుందామరి?)

"లా మార్కిజమ్" లోని రెండవ సూత్రం ఆర్జితగుణాల సంక్రమణానికి చెందినది. ఈ సూత్రం ప్రకారం ఒక జీవి వాడుక ఏర్పరచుకోవడం వల్ల కాని లేదా పోగొట్టుకోవడం వల్లకాని తన జీవితకాలంలో ఏర్పరచుకొన్న వైవిధ్యాన్ని తన తరువాత తరానికి అందచేస్తుంది. తరాలమీద తరాలకు ఆర్జిత గుణాలవల్ల ఏర్పడ్డ వైవిధ్యం పునః పునరావృత సంచిత ప్రభావంవల్ల క్రొత్తజాతిగా ఏర్పడుతుంది. లామార్క్ వైవిధ్యం వల్లే ప్రత్యేకజాతి ఏర్పడు తుందని స్పష్టం చేసినాడు. కాని ఆ వైవిధ్యం ఎలావస్తుంది అన్న విషయంలో ఆమోదయోగ్యమైన వివరణను ఇవ్వలేక పోయినాడు.

## డార్వినిజమ్

డార్విన్ [1809–1382 క్రీ. శ] ఆంగ్లప్రకృతి శాస్త్రజ్ఞుడు తన పరిశీలనలను పరిణామవాదానికి సంబంధించిన విశదీకరణ లను ఎంతో హేతుబద్ధంగా "ఒరిజిన్ ఆఫ్ స్పీసిస్" అనే గ్రంథంలో స్పష్టంగా, బహూకరిస్తూ క్రోడీకరించి ఉన్నాడు. అదేకాలంలో వాలాస్ అనే మరో ఆంగ్ల శాస్త్రవేత్తకూడా డార్విన్ లాగే ప్రకృతి వరణ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. డార్విన్ సిద్ధాంతాన్ని కొన్ని ప్రత్యేకమైన అంశాలద్వారా చర్చించవచ్చును.

ప్రకృతిలో ప్రతిజీవజాతికి అత్యధిక సంఖ్యలో సంతానాన్ని ఉత్పన్నం చేసే శక్తి ఉంటుంది. ఉదాహరణకు "లిమ్నియా లుటియోలా" అనబడే చిన్న నత్త ఒకటి వున్నది. దాని జీవనవ్యవధి ఆరునుంచి ఎనిమిది నెలలు. ఇరవైనుంచి ముప్పై రోజుల తరువాత ఆ నత్త గ్రుడ్లను సమూహాలుగా పెడుతుంది. ఒక్కొక్క సమూహములో పదినుంచి ఇరువైఐదు వరకు గ్రుడ్లు ఉంటాయి. ఇటువంటి సమూహాలు పదహైదునుంచి ముప్ఫైవరకు ఒక్కొక్క నత్తద్వారా రూపొందుతుంది. కనిష్ఠసంఖ్యనే ప్రమాణంగా తీసు కొన్న ఒక్కొక్క నత్తనుంచి నూటయాభై క్రొత్త నత్తలు ఉత్పన్నమవుతాయి. ఈ ప్రమాణం ఇలాగే కొనసాగితే కొన్నా ళ్ళకు ప్రపంచమంతా ఈ నత్తగుల్లలతోనే నిండిపోతుంది. కాని అలా జరగడంలేదు. దానికొక కారణమున్నది.

అధికోత్పత్తి జరిగిన ఆ సంతానంలో కేవలం కొంతభాగం మాత్రమే ప్రత్యుత్పత్తిదశను చేరుకుంటాయి. మిగిలినవి నశిస్తాయి. ఆహారం కోసం, ఆశ్రయం కోసం, సంతానోత్పత్తిఅవకాశంకోసం ప్రతిజీవజాతిలోనూ ఘర్షణ ఉంటుంది. ఈ ఘర్షణలో నెగ్గినవే జీవించ గలుగుతాయి. వీటికే ప్రకృతి వరమైన స్వావలంబనం వుంటుంది. అంటే జీవించడానికి యోగ్యతను కలిగినట్టివి. వీటి సార్థక జీవనాన్నే డార్విన్ "సర్వైవల్ ఆఫ్ ది ఫిటెస్ట్" అని పిలిచినాడు. దీనినే ప్రకృతివరణం లేదా "న్యాచురల్ సెలక్షన్" అని కూడా పిలిచినాడు.

జీవులమధ్య ఘర్షణ మూడువిధాలుగా వుండేందుకు అవ కాశం వుంది. అందులో మొదటిది ఒకేజాతికి చెందిన జీవులమధ్య కొనసాగే సజాతి సంఘర్షణ. ఇదిచాలా తీవ్రస్థాయిలో వుంటుంది. ఇకపోతే రెండవది వేరువేరు జీవజాతులమధ్య జరిగే విజాతి సంఘ ర్షణ. ఈ సంఘర్షణే జీవజాతుల భద్రతను, ఉనికిని నిర్ణయిస్తుంది. చివరిది ప్రకృతి పరమైన భౌతికశక్తులతో జీవజాతులు జరిపే నిత్య సంఘర్షణ. ఇవి వరదలు కావచ్చును. భూకంపాలు కావచ్చును, అగ్నిపర్వతాల ప్రేలుళ్ళు కావచ్చును, మంచుకొండచరియలు పరం పరగా పతనం కావచ్చును, మంచుతుఫానుల విస్ఫోటకావచ్చును, వడ గాడ్పు కావచ్చును, పిడుగులు కావచ్చును, తుఫానులు కావచ్చును, కాటకాలు కావచ్చును, ఇంకేమైనను కావచ్చును. ఎలాగో ఒక లాగస్వజాతిపరమైన, పరజాతి పరమైన, ప్రకృతి పరమైన, అడ్డంకు లన్నింటిని తొలగించుకొని జీవించడానికి తగిన యోగ్య తను పొంది ప్రత్యుత్పత్తిని నిర్వహించే జీవజాతుల వల్లనే జీవ శక్తి అనంతంగా కొనసాగుతుంది.

రెండుజీవుల కలయిక ద్వారా రూపొందే క్రొత్తజీవి తల్లి దండ్రులనే పోలివున్నా పూర్తిగా పోలిఉండక కొన్ని లక్షణాలలో అయినా తేడాలను కలిగివుండి చాలా తక్కువస్థాయిలో వైవిధ్యాన్ని చూపెడుతుంది. అత్యల్ప పరిమాణంలో ఏర్పడ్డ వైవిధ్యం కొంత

కాలానికి అనూహ్యానంగా తరతరాల పరంపరలుగా పుట్టుకొచ్చే తరాలలో ప్రస్ఫుటమై కొంతకాలానికి క్రొత్తజీవజాతి ఏర్పడుతుందని డార్విన్ తెలియజెప్పినాడు. అయితే పరిసరాలవల్ల ఏర్పడే వైవిధ్యాలకు అనువంశికంగా ఏర్పడే వైవిధ్యాలకు ఉన్న భేదాన్ని డార్విన్ గుర్తించలేకపోయినాడు. పైగా వైవిధ్యాలు ఎట్లాఏర్పడుతాయి అనే విషయంలో పొరపాటు చేసినాడు. లామార్క్ నియమం. ఉపయుక్త, నిరుపయుక్తాలవల్ల (వాస్తవమైన,కాకపోయినా) వైవిధ్యమేర్పడే అవకాశముందని తెలియజెప్పినాడు. డార్విన్ అది కూడా చెప్పలేదు !

“లామార్కిజమ్”, “డార్వినిజమ్” జీవపరిణామ సిద్ధాంతాన్ని పూర్తిగా వివరించలేవు. ఆ రెండింటిలోను ఆక్షేపణలు ఉన్నాయి. డీవ్రీస్ (1848-1935) వైవిధ్యమనేది అకస్మాత్తుగా రూపొందే మార్పులవల్ల (వీటినే ఉత్పరివర్తనాలని పిలిచినాడు) ఏర్పడుతుందని ఈ మార్పు అధిక పరిమాణంలోనే వుంటుందని, ఇలాంటి మార్పువల్లే క్రొత్తజీవజాతి ఉద్భవిస్తుందని ఉత్పరివర్తన సిద్ధాంతాన్ని [“మ్యుటేషన్‌థీరి”]ని ప్రతిపాదించినాడు. అయినప్పటికీ ఈ ఉత్పరివర్తన సిద్ధాంతం ప్రకృతివరణ సిద్ధాంతాన్ని త్రోసి రాజనదు. మార్పు చిన్నదైనా, పెద్దదైనా దానికి ప్రకృతి పరమైన సాఫల్యత ఉన్నట్లయితే క్రొత్తజీవజాతి ఏర్పడే అవకాశం తప్పకుండా వుంటుందని డార్విన్ భావించినాడని మనం చెప్పుకోవచ్చు. డీవ్రీస్ కూడా ఇదే అభిప్రాయన్నే కదా తెలియజేసింది: అయితే ఒకటే తేడా. డార్విన్ ప్రకారం క్రొత్తజీవజాతి అల్పపరిమాణంలో ఏర్పడే వైవిధ్యాలవల్ల అనేకదశలలో జరుగుతుంది. కాని డీవ్రీస్ ప్రకారం ఉత్పరివర్తనంవల్ల ఒకేదశలో నూతన జాతి ఆవిర్భవిస్తుంది.



సకశేరుకాలలో పిండోత్పత్తి నిర్మాణాలు

ఇంతవరకు చర్చించిన పరిణామ సిద్ధాంతం సరిఅయినది అని చెప్పడానికి కావలసినంత సాక్ష్యాధారాలున్నాయి. ఈ పరిణామ సిద్ధాంతానికి నిదర్శనాలుగా స్వరూపశాస్త్రపరిశీలనలు, పిండోత్పత్తి శాస్త్రపరిశీలనలు, పురాజీవశాస్త్రపరిశీలనలు, శరీరధర్మశాస్త్రపరిశీలనలు, జంతుభూగోళశాస్త్ర పరిశీలనలు ఎన్నో ఎన్నో నిలుస్తాయి.

జంతువులన్నీ కణనిర్మితాలు. ప్రతికణంలోనూ జీవపదార్థము వుంటుంది. అందులో కేంద్రకం, కణద్రవ్యం తప్పనిసరిగా వుంటున్నాయి. నిమ్నస్థాయి జీవులనుంచి, ఉచ్ఛస్థాయి జీవుల వరకు జీర్ణ వ్యవస్థలోకాని, నాడీ వ్యవస్థలోకాని, రక్తప్రసరణ వ్యవస్థలోకాని ప్రత్యుత్పత్తి వ్యవస్థలోకాని, ఏ వ్యవస్థలో తీసుకున్నప్పటికి నిర్మాణ సామ్యసంబంధము, క్రియాసామ్యసంబంధము వున్నాయి. అందువల్ల జీవజాతులన్నీ ఒకదానినుంచి ఒకటి క్రమానుగతంగా ఏర్పడినవేననితెలియవస్తుంది. స్వరూపశాస్త్రపరిశీలనలద్వారా మనకు లభ్యమయ్యే నిదర్శనాలివి.

పిండోత్పత్తి దశలు ఒక నిర్దుష్టమైన క్రమంలో జరగడం పరిణామవాదానికి బలమైన దృష్టాంతం. సంయుక్తబీజకణ విభజన తీరు “బ్లాస్టులా”, “గ్యాస్ట్రులా” వంటి దశలతో సహా చేప మొదలు మనిషివరకు ఒకేవిధంగా వుంటుంది. ప్రాథమికదశలో ఏ పిండము ఏ వర్గానిదో చెప్పడం చాలా కష్టం. పరిణితి దశలోనే వర్గ వికాసాన్ని గుర్తించడానికి వీలుంటుంది. శ్వాసించడానికి అనుకూలించే మొప్పలు అన్ని వర్గాలలోనూ కనిపించడం విశేషం. అభివృద్ధి జరిగే కొలది మొప్పల ప్రాముఖ్యత ఉచ్ఛస్థాయికి చెందిన జీవులలో పడిపోతుంది. పిండం పూర్తిగా జీవిగా ఎదిగేనాటికి ఎక్కువగా వర్గవికాసము జరిగిన జంతువులలో మొప్పలసేవే ఉండవు. చేప, తాబేలు, కోడి, కుందేలు మరియు మనిషికి సంబంధించిన పిండోత్పత్తి దశలను చూచినట్లయితే, అన్నివర్గాల జీవుల్లోనూ ఒకవిధమైన జన్యుపరమైన ఏకత్వం ఉందని, అపేభిన్నత్వానికి దారి తీస్తుందని అంగీకరిస్తారు. కాబట్టి పిండోత్పత్తి శాస్త్రపరిశీలనలు పరిణామ వాదానికి ప్రబల తార్కాణాలని భావించడంలో ఎంత మాత్రమూ అసమంజసం లేదు. హెకెల్ [క్రీ. శ 1834-1919] ప్రతిపాదించిన “బయోజెనిటిక్ సిద్ధాంతం” (జీవజన్యుసిద్ధాంతం) లేదా “రీకాప్పిటులేషన్ సిద్ధాంతము”, (పునరావృత సిద్ధాంతం), ఎంతగానో కొనియాడదగినది. ఒకజీవి జీవితచరిత్ర, ఆ జీవజాతి సంక్షిప్త వర్గవికాస చరిత్రఅన్నది ఇతనివాదం. (“ఆన్టోజనిరిపీట్స్ ఫైలోజని:”)అదియదార్థము.పరిణామసిద్ధాంతానికిఆయుష్ప్రమాణం.

# ప్రేమా, ఎక్కడున్నా చదువుకో ఈ లేఖ

డియర్ ప్రేమా.

ఎన్నో రోజుల నుంచి నీకి ఉత్తరం రాయాలని—కాని తీరిక ఎక్కడిది? ఉదయం నుంచి రాత్రి దాకా పరుగే పరుగు. ఒక క్షణం తీరిక దొరికితే నీకు లేఖ రాసే ప్రశాంతత. ఏకాగ్రత వుండదు ఇంతకీ నువ్విప్పుడు ఎక్కడున్నావు? ఏం చేస్తున్నావు?

తీరికలేని జీవితం గడుపుతున్నా అనుక్షణం నువ్వు నాకు జ్ఞాపకం వస్తుంటావు. సూర్యుడు, చంద్రుడు, తారల తళుకులు, కదులుతూ తేలిపోయే మబ్బులూ, వర్షమూ—వెన్నెలా, పుట్టలూ—పిట్టలూ, కొండలూ—నదులూ వీటిని చూస్తున్నప్పుడల్లా నువ్వే నాకు కనిపిస్తూ వుండిపోతావు అంతా "ప్రేమమయంగా" తోస్తుంది నీలాగా వాటికి అందరూ సమానమే ఎప్పుడూ వాటిమధ్య మమతా సమతా ఉన్న అనుబంధం వున్న మనిషి వాటిలా మమతనీ; సమతనీ ఎందుకు పెంచుకోలేకపోతున్నాడో? వాటిని ఆదర్శంగా తీసుకుని మనిషి మనిషిగా కావాలని నా తాపత్రయం. ప్రేమమయి మదర్ థెరిసా అన్నట్లు "ఈ ప్రపంచంలో కరువు అన్నానికి, వస్త్రానికి కాదు—ప్రేమకు" అన్న మాట అక్షరాలా నిజం అందుకు అనుదినం మనకి ఎన్నో ఉదాహరణలు. అందాకా దేనికి సుప్రసిద్ధ హాలీవుడ్ తార మార్లిన్ మన్రో నటిగా ప్రపంచ ఖ్యాతి పొందింది కావల్సినంత డబ్బు గడించింది కీర్తికి కొదువలేదు కాని నిజమైన 'ప్రేమ' దొరక్క ఆమె ఆత్మహత్య చేసుకుంది! ఇలాంటి ఆలోచనలతో మనసు వికలమైపోతూ వుంటుంది అలాంటప్పుడు గతాన్ని నెమరువేసుకుంటూ వుంటాను—

ప్రేమా! నీకు గుర్తుండే వుంటుంది 27 ఏళ్ళ క్రితం నేను ఏం. ఏ. అయ్యాక ఈ పట్టణంలో ఉద్యోగాలు లేక అందంగా పేర్చిన మిఠాయి దుకాణాల ముందు ఆకలి కళ్ళతో చూస్తూ నిలబడినప్పుడు 'రావ్' అనే టైలర్ భుజంమీద చెయ్యివేసి నన్ను మీ ఇంటికి తీసుకు వచ్చాడు. అప్పుడు నువ్వూ మీ తమ్ముడు సత్యం మీ చెల్లెలు ఆశ డాబామీదా కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుతున్నారు గుర్తు ఉందా? ఆ పున్నమి వెన్నెలలో కొబ్బరి చెట్లకు వేలాడే గిజిగాడి గూళ్ళని చూస్తూ. నేనూ—ముభావంగా కూర్చున్న నువ్వూ—ఆశ చాలా ప్రోత్సాహం ఇచ్చింది సత్యం నేను వుంటాం కదా పర్వాలేదన్నాడు—మీరంతా బాసటగావుంటే ఏమైనా చేయగలనని నాకు నమ్మకం చిక్కింది. కొండంత ధైర్యం వచ్చింది.

ఆ రావ్ కుట్టించిన రెండు జతల పైజామా లాల్చీలు రామస్వామి ఇచ్చిన 30 భోజనం టిక్కెట్లలో నువ్వు పిల్చుకు వచ్చిన పది మందికీ నేను మాస్టారునయినాను. అప్పుడు నా వయస్సు పంతొమ్మిది నా అంతవాళ్ళకి నేను చదువు చెప్పడం! తల్చుకుంటే తమాషాగా వుంటుంది. తర్వాత ఎన్నో వసంతాలు. హేమంతాలు వచ్చాయి వెళ్ళాయి మబ్బులూ. వానలూ ఎండా. వెన్నెలా వస్తున్నాయి—పోతున్నాయి చెట్లూ, పిట్టలూ, కొండలూ, కోనలూ అప్పటి నా ఆదర్శాలు. వాటి వాటి నైజాలను మార్చుకోకుండా వుంటున్నాయి ఒక లక్షమందికి పైగా విద్యార్థులు నా శిక్షణలో చదివి వివిధ వృత్తులలో, వ్యాపకాలలో స్థిరపడ్డారు. ఇంజనీర్లు, డాక్టర్లు, లాయర్లు, ఉపాధ్యాయులూ, ఆఫీసర్లూ. వ్యాపారస్తులూ. యిలా అన్ని రంగాలలో వారి వృత్తి ఏదైనా వ్యాపకం ఏదైనా నాకు మాత్రం వారంతా విద్యార్థులే! జీవితంలో ఎందరో కవులు. కళాకారులు. చిత్రకారులు, శిల్పులు. క్రీడాకారులు—పరిచయమయినారు. ఇది నా అదృష్టం—నీ చలవ. కాని ప్రేమా! ఒక్కో సారి జీవితం ఎంతో శూన్యంగా తోస్తుందో చెప్పలేను. డబ్బుకి విలువ యిచ్చి మాట్లాడే మనుషులు ఎక్కువైపోయారు. "నీవెలా ఉన్నావ్" అని నీలాగా పలకరించేవాళ్ళకంటే "నీకేమయ్యా" అని ఈర్ష్య ధ్వనించేలా పలకరించే వాళ్ళెక్కువయారు. రంగస్థల నటులు, మధుర గాయకులు వారి నటనతో, మధుర గానంతో ప్రేక్షక శ్రోతల్ని పరవశింపచేస్తారు. ఆనందించి హాయిగా ప్రేక్షక శ్రోతలు వెళ్ళిపోతారు. కాని ఆ కళాకారుల గురించి ఎందరు ఆలోచిస్తారంటావ్?

"Halls are full but hearts are empty" యీ వాక్యం జ్ఞాపకం వచ్చినప్పుడల్లా గుండె కలుక్కుమంటుంది. అంతా శూన్యంగా గోచరిస్తుంది. ఏదో వెలితి నన్నావరిస్తుంది. అలాంటి సందర్భంలోనే—ఓసారి నిన్ను చూద్దామని మీ ఇంటికి వచ్చా— "ప్రేమ—వున్నదాండీ" అని అడిగా. "ఎక్కడికో వెళ్ళిందండీ" అని జవాబు చెప్పారు మీ ఇంట్లో ఆ జవాబులో అనేక అర్థాలు స్ఫురించాయి నాకు. తల దించుకు వచ్చేశాను. మరి కొద్ది రోజులకి "సత్యం" పరారయ్యాడని పేపరులో ప్రకటన చదివా. ఆశకు అనారోగ్యంగా వుందని తెలిసింది. చాలా బాధపడ్డాను. వున్నట్టుండి ఓ రోజు మన "బాకా" కన్పించాడు, "బాకా" అంటే గుర్తొచ్చాడా? మీలో ఎప్పుడు స్నేహంగా వున్నట్టు నటించేవాడు ఎప్పుడూ తన గురించి తను మాట్లాడేవాడు. అందుకే మనం "బాకా" అని ముద్దుపేరుతో పిలిచేవాళ్ళం అతనిలో మార్పేమీ లేదు, గంటసేపు సొంత బాకా వూదాడు. అందులో ఫస్టన్నాడు—ఇందులో ఫస్టన్నాడు—ఏంటేంటో చెప్పాడు. నాకు సరిగ్గా అర్థం కాలేదు కాని తర్వాత విచారిస్తే అతడొక విద్యాసంస్థ పెట్టాడనీ. నానా రకాలుగా డబ్బు సంపాయించాడనీ తెలిసింది.

ఇవన్నీ చూస్తుంటే ఏం చెయ్యాలో అర్థం కావడంలేదు. ఓ గురువు దగ్గరా నేను నేర్చుకున్న మొదటి పాఠం యీ వివాదానికి చాలనిపిస్తుంది. అలాగే జీవిత యాత్ర సాగిస్తున్నా—నాకు పశ్చాత్తాపంలేదు అసూయలేదు అహంకారంలేదు—దానికి కారణం మీరే! ఎంతో డబ్బు వచ్చింది—పోయింది. అయినా 27 ఏళ్ళనాడు మీ డాబా మీద మొదటిసారి మనం కలిసినప్పుడు ఎట్లా వున్నానో యిప్పుడూ అలాగే వున్నాను. చిన్న చిన్న మార్పులు లేకుండా వుండవనుకో. మనం యంత్రాలమీద తయారయిన వస్తువులం కాదు కదా—జీవం వున్న మనుషులం. ఆ మధ్య అనుకోకుండా ఓ రోజు మన సత్యం కనిపించాడు. చిక్కి సగమైపోయాడు. "కళ్ళు పచ్చబడిపోయాయట దేనికి" అని అడిగితే—"నే నెవరికి కావాలి మాస్టారూ?" అన్నాడు నిస్పృహగా. నేను ధైర్యం చెప్పడానికి ప్రయత్నిస్తే సత్యం నిట్టూర్పుగా నవ్వి—

"రోజులు మనవి కాదు సార్—మన "బాకా" తెల్సుగా—వాడి పరీక్ష పేపర్లు కొడుక్కని. కాపీకొట్టి, మార్కులు వేయించుకుని పాసయ్యాడు.—వాడూ నేనూ ఒకటేనా? చెప్పండి" అన్నాడు. "సత్యం నువ్వు తప్పక జయిస్తావు. నిజం నిలకడమీద తెలుస్తుంది" అని వూరడించాను. ఆశ కులాసాగా వుందనీ. కొంచెం కొంచెం కోలుకుంటోందనీ చెప్పాడు.

ప్రేమా! నేను యీ వృత్తిలో అడుగుపెట్టడానికి నాందిపలికిన రోజు—మీ డాబా పిట్టగోడ మీద నేను కూచునివుండగా నువ్వొక మాట చెప్పావ్—జ్ఞాపకం వుందా? నేనెప్పుడూ ఆ మాటల్నే జ్ఞాపకం చేసుకుంటూ వుంటాను. అది ఓ అజ్ఞాత సైనికుని సమాధిపై వ్రాసిన మాటలని చెప్పావ్—"ఒక సైనికుడు తన దేశంపై గల ప్రేమతో నేలకొరిగాడు. ఎవరైనా ఆ వైపు వెళ్ళటం తటస్థిస్తే ఒక కన్నీటిబొట్టు రాల్చండి!" అని. ఆ శిలాక్షరాలే నా జీవితం. నువ్వే నా లక్ష్యం. లక్షలాది విద్యార్థులు, వారి తల్లిదండ్రులూ, ఇరుగు—పొరుగువారు, మిత్రులూ, ఆప్తులూ ఇది గుర్తిస్తే చాలు.

ఇంతకీ నీ సమాచారం తెలియనేలేదు. బావున్నావు కదూ? మునుపటిలాగే మాటా పలుకూ లేకుండా అలాగే వుంటున్నావా? ఎందుకు ఉత్తరం వ్రాయలేదు ఇన్నాళ్ళు? కోపమా? నీ హృదయంలో కోపానికి చోటులేదే! నేను మారిపోయానని అనుమానమా? కావాలంటే మీ సత్యాన్ని అడుగు, అప్పుడూ, ఇప్పుడూ అలాగే వున్నాను, ప్రేమ, సత్యం, ఆశ. శ్రమ అనే నాలుగు సూత్రాల మీద నడుస్తుంది గుంటూరులో గల "రవి కళాశాల" ఈ 27 సంవత్సరాలలో లక్షకు పైగా విద్యార్థులు శిక్షణ పొంది మమ్మల్ని ప్రేమతో పెంచారు. వారికి కృతజ్ఞతలు, అశేష ఆంధ్రులకు మా ఉగాది శుభాకాంక్షలు.

మీ సి. వి. యన్. ధన్

పురాజీవశాస్త్ర నిదర్శనాలు శిలాజాలు. పరిణామం సంభవించిందని చెప్పడానికి కాలానుగుణ్యంగా లభ్యమయ్యే ఈ శిలాజాలే ప్రత్యక్షసాక్షాలు. వీటి ఆధారంగా వర్గవికాసం జరిగిందని చెప్పవచ్చు. ఒక వర్గం నుంచి మరొక వర్గం పరిణమించినదని చెప్పడానికి వీలుగా రెండువర్గాల లక్షణాలను పొందుపరచుకొని ఉన్న శిలాజాలు అనుకూల పడతాయి. అయితే భూమి ఏర్పడటానికి ముందు ఏమి వుండిఉంటుంది అని చెప్పడానికి ఏవిధమైన ఆధారం లేదు. ఏకకణజీవులు భూమిఏర్పడిన మొదట్లో ఉన్నాయని భావించవలసిందే. అయితే ఆ భావన శాస్త్రసమ్మతమైనది.

శరీరధర్మశాస్త్రం ప్రతివర్గంలోనూ ఒకే విధంగా ఉన్నది. అన్నింటిలోనూ డి. ఎన్. ఏ. యే జన్యుపదార్థం. అదే జీవరహస్య కీలకం. "ప్రోటీన్" లు ఏర్పడే తీరు అన్నింటిలో ఒకే విధంగా ఉన్నది. "కార్బోహైడ్రేట్‌లు", క్రొవ్వులు వంటివి విశ్లేషించబడే విధానం అన్నిజీవులలోనూ సమంగా ఉంటుంది. ఏ. టీ. పీ. వంటి శక్తిజనకాలు ఎన్నోరకాల "ఎంజైమ్" లు మరెన్నో రకాల "హార్మోన్" లు అన్ని జీవులలోనూ నిర్మాణాత్మక సారూప్యతను కలిగి ఉండుటయే కాకుండా క్రియాత్మకమైన సామ్యతనుకూడా కలిగి వుంటాయి. అందువల్ల జంతువులన్నీ ఒకే మూలంనుంచి పరిణతి చెందినవేనని స్పష్టం అవుతుంది.

భౌగోళికంగా పరిణామం జరిగిందనడానికి ఎన్నో సాక్ష్యాలున్నాయి. ఉదాహరణకు ఒకే శీతోష్ణస్థితిగల (సమశీతోష్ణస్థితి) ఆఫ్రికా దక్షిణ భాగము, మెడగాస్కర్‌లలో ఒకేవిధమైన జంతువులు ఉండకపోవడాన్ని విశేషించి చెప్పుకోవచ్చు. ఆఫ్రికాలో సింహాలు, ఏనుగులు, ఖడ్గమృగాలు, చింపాంజీలు, గొరిల్లాల వంటివి ఎన్నో ఉండగా, మెడగాస్కర్‌లో ప్రాథమిక క్షీరదాలయిన "లెమ్యూర్"లు మాత్రమే ఉన్నాయి. మిగిలిన క్షీరదాలు ఈ మెడగాస్కర్ ద్వీపంలో లేవు. ఈద్వీపంచుట్టూ సముద్రం వ్యాపించటం వల్ల ఈ ప్రాథమిక క్షీరదాలు పరిణమించలేక పోయినాయి. అందువల్లనే మనకు సింహాలు, ఏనుగులు కనిపించవు. ఇదే విధంగా న్యూజిలాండ్, ఆస్ట్రేలియాలలో జంతుసంపదలు భిన్నంగా వున్నాయి. కాబట్టి జంతు భౌగోళిక శాస్త్రపరిశీలనవల్ల కూడా పరిణామ వాదాన్ని బలపరచవచ్చు.

పరిణామం ఎంతసేపూ, జీవిఅవసరాలను నెరవేర్చుకునేందుకు ఏర్పరచుకునే వైవిధ్యాలపైనే ఆధారపడివుంటుందని, పరిణామ శాస్త్రవేత్తలు చెబుతున్నారు. దీన్ని కాదనడానికి వీలులేదు. అలా అని అవునని చెప్పడానికి మనసొప్పదు. ఎందుకంటే జంతువుల వరకు అయితే ఆకలి, దప్పిక, కామవివర్చికీ ఇవే ప్రధానమనుకోవచ్చు. కాని మనుష్యుల సంగతి అలా కాదు. మనిషి మాట్లాడే జంతువుమాత్రమే కాదు. (జంతుజాలాలలో చాలా జంతువులు మాట్లాడతాయని నిరూపిస్తున్నారు) . మనిషి ఆలోచించగలడు. (ఈ ఆలోచన అనేది కొన్ని చింపాంజీలు కూడా చేస్తున్నాయని ఇటీవల ప్రయోగాలు తెలుపుతున్నాయి). మనిషి వివేచించగలడు. ఏ జంతువూ వివేచించినట్లు దాఖలాలేదు. వివేచించలేదు కూడా! అది ప్రకృతి సత్యం. ఈ వివేచన మనిషికే పరిమితం. అది అతని సంస్కారంపైన ఆధారపడి ఉంటుంది. ఆ సంస్కారపరత అతనికి ఎలా వస్తుంది? మెదడు వల్లనా? (మనిషి మెదడుకు, చింపాంజీ మెదడుకు పెద్ద తేడాలేదు). హృదయం వల్లనా? (మనిషి హృదయానికి, చింపాంజీ హృదయానికి పెద్ద తేడా లేదు.) మరైతే ఈ సంస్కారం ఎక్కడినుంచి వచ్చినట్లు? శాస్త్రంలో దీనికి సరైన వివరణలేదు. ఈ సందర్భంలోనే ఆత్మప్రసక్తి వచ్చినదని నా అభిప్రాయం. జన్మసిద్ధాంతం ఉదయించినదని నా అభిమతం. సంస్కారం ఎలా వికసిస్తుందన్నది ఈ నాటికీ ఒక అంతుబట్టని రహస్యం. అయినా నేటి "సైంటిస్టు" పట్టు వదలని విక్రమార్కుడు. విశ్లేషించగలిగే ప్రకృతిశాస్త్రం మాత్రమే "సైన్సు". అన్నీ విశ్లేషించాలని పట్టుపడితే తప్పనిసరిగా పరాభవమే! శాస్త్రీయ దృక్పథమున్న ఏ మనిషైనా ఈ మాటే అంటాడు. నేనూ అంటున్నాను. సరే! ఈ సంస్కారం విషయాన్ని ప్రక్కకు పెట్టండి.

వైవిధ్యంవల్ల పరిణామం సంభవిస్తుందని సిద్ధాంతం. అంగీకరించవచ్చు. అయితే ఆ వైవిధ్యం ఎందుకు ఏర్పడుతుంది? ప్రస్ఫుటమైన మార్పులవల్ల "మ్యూటేషన్" కావచ్చు. "రీకాంబినేషన్" కావచ్చు, డి. ఎన్. ఏ.లో వచ్చే మార్పులవల్లే వైవిధ్యం వస్తుంది. అయితే ఈ మార్పులు ఏర్పడటమనే ప్రక్రియ డి. ఎన్. ఏ. కు అందేదికాదు. దాంట్లో మార్పొస్తుంది. ఈ రావటమనేది ప్రకృతి సహజమే. ఎందుకు రావాలి అంటే దైవ ప్రణాళికలో అని చెప్పకొంటాము. [illegible] మార్పులు [illegible] ఎందుకు పూర్వగాముల పరిణామాన్ని ప్రవర్తింపజేసి. మనమెందుకు [illegible] ప్రశ్నించాము [ప్రవృత్తికీర్త్యాదాయి] అలాగే [illegible] తనుండే [illegible] ప్రస్తావనలో ఉన్న [illegible] మాదిరి ఎందుకు ప్రశ్నించాలని ప్రయత్నించటంలేదు. ఇది ఉన్న వ్యవస్థ పరిస్థితిని వారి చెస్తుందని ఎందుకు అనుకోవాలి. పూర్వగామ పరిణామమంతా సత్యమేనా? [ప్రతిలోగామ సిద్ధాంతం కూడా ఉంది. కాని దాన్ని ఎవరు పట్టించుకోవటం లేదు]. పోనీ, పరిణామ ప్రవృత్తిలో ముందడుగే కాని వెనుకడుగంటూ ఉండదనుకుందాం 'అమీబా'లు 'హైడ్రా'లు, "ప్రొటోజోవా" లు, "అనిలిడా" లు, "ఆర్థ్రోపాడ్" లు, 'మొలస్కా'లు, ఇలా ఇలా చేపలు, కప్పలు, పాములు, పక్షులు, పశువులు, మనుష్యులు అందరూ ఒకేసమయంలో ఉండటంలోని అర్థమేమిటో తెలిసిరాదు. మారే పరిస్థితులు క్రొత్తజీవులను ఏర్పరుస్తూ పోతే పాతజీవులు నశిస్తూవుండవలె. మరేదీ ఏ జీవజాతి నశించడం లేదే? (కొన్ని అంతరించిపోతున్నా

యనే దిగులు లేరే కారణాల ద్వారా వచ్చినట్టిది!] కోతినుండి మనిషి వచ్చాడు. ఇక కోతి అనవసరమేమిటి? పోనీ కోతికన్నా క్రిందిస్థాయి జంతువులో ఏమన్నా దగ్గువలవుందా అంటే అదీలేదు. అలాగే ఈ మనిషినుంచి "సూపర్‌మ్యాన్" పుట్టుకొచ్చాడా అంటే అదీ లేదు. (సూపర్‌మాన్ అంటూ మానవుడు మహోన్నతస్థాయిని ఆక్రమించినాడు. అయితే యిది మానసిక పరిణామమే. దీనికీ మనం చెప్పుకొన్నుట్టున్న పరిణామసిద్ధాంత వాదానికీ పట్టిసంబంధము లేదు.) అందువల్ల పరిణామ సిద్ధాంతాన్ని పరిపూర్ణమైన సిద్ధాంతంగా భావించ వానికి వీలులేదు. అలా అని దానిని కాదుపొమ్మనడానికీ సరియైన ఆధారం లేదు. ఎందుకంటే యీ సిద్ధాంతం కేవలం అనుమాన ప్రమాణంమీదనే నడుస్తుంది. దీన్ని బలపరిచే ప్రత్యక్షప్రమాణాలు ఏవీ లేవనే చెప్పవలసివస్తుంది. ప్రకృతిలో ఆ విధమైన ప్రమాణాలు ఉండటానికి వీలులేదు కూడా: ఎందుకంటే ఒక్కొక్క మార్పు వైవిధ్యంద్వారా ఏర్పడింది, వ్యక్తిగతస్థాయిలో, ఒక జీవిలో ప్రస్ఫుటించబడి, ఆ జీవి తర్వాత తరాలకు అనువంశికంగా అందజేయబడుతూ, స్పష్టంగా వెలుగులోనికి వచ్చేసరికి, కొన్ని వందల సంవత్సరాలు పడుతుంది. ఇది మనిషి తన జీవితకాలంలో చూడటం అసంభవం. అందువల్లనే ఈ సిద్ధాంతం సిద్ధాంతపరంగా చిరంజీవి. దృష్టాంతపరంగా చాలయోగి. ఏదియేమైనా క్షీణించిన రెక్కలతో ఉన్న కొన్ని పక్షులు (అసలీపక్షుల అవసరమేమిటో ఇంతవరకు అర్థంకాలేదు). క్షీణించిన కాళ్ళతో ఉన్న కొన్ని కొండ చిలువలు పరిణామ సిద్ధాంతానికి బ్రతికి ఉన్న నిదర్శనాలుగా నిలిచి వుండటం వల్ల, ఈ సిద్ధాంతాన్ని ఆమోదించవలసే ఉంటుంది.

మనిషి ఆవిర్భావానికి సమాధానం అరకొరిగానైనా చెప్ప గలిగాము. కాని మనిషి ఆవిర్భావానికి, ఒక మహాఋషి ఉద్భ వానికి ఎవరు సమాధానం చెప్పగలరు? అది చెప్పగలిగితే మనిషి ధన్యుడే! మనిషి అని ఎందుకంటున్నానంటే "సైన్సు"ను మనిషి నడపాలికాని, మనిషిని "సైన్స్" నడపకూడదనే సదుద్దేశ్యము తోనే!

అలోచనాపరులు ఆదరింతురు గాక!

✿

# బొబ్బట్లు - మంచినీళ్ళు

డా॥ పోచిరాజు శేషగిరిరావు

౧

బరంపురము తెల్గుల, కా
పురము నిన్న-మొన్న కూడ
ఆంధ్రుల సంస్కృతి కయ్యది
అద్దము పట్టిన దెప్పుడొ!

ఒడ్డె రాష్ట్రమందుండిన
గడ్డ, తెలుగు బిడ్డలకును
అచట పుట్టి ఆనకొనల
యంచులు దాకిరి ఎందరో ?

ఆతిథ్య ప్రియతయందు
ఆంధ్రులదే పెద్ద పీట
భోగము నెరిగిన జాతి!
త్యాగము నేర్పినజాతి !

భోగ త్యాగములు రెండు
కవలలుగా నుదయించెను
అల 'జయంతి' వారింటను
అది జాతికె వైజయంతి

'కామేశము పంతులు' నిర
తాన్నదాన పరుడుగాన
వాసికెక్కె, నిప్పటికీ,
కోకొల్లలు కథలున్నవి.

న్యాయివాది వర్గమందు
నాడెమైన రత్నమతడు
ఆంధ్ర జాతి గర్వించెడు
జాతిరత్నమే 'జయంతి'.

కామేశము 'వక్కిలే'
కాదు, వాసిగన్న కవియు,
ఆతని శతకము లెన్నియొ
లోకము వాకొను చుండును.

సంగీతము _ సాహిత్యము
లనినను చెవికోసు కొనును
సంగీతము సారస్యము
నెరిగి, వారి గౌరవించు.

నాట్యమనిన - నృత్యమనిన
అభిరుచి కంతమె లేదు
ఎంతమంది నాట్యకర్తె
లామందిరమున నాడిరో !

రసికత కది పుట్టినిల్లు
రసజ్ఞులకు మెట్టినిల్లు
కవి_గాయక_నర్తకులకు
కామేశమె స్వాంతయిల్లు.

౨

ఒకనాడొక అన్నదాన
సంతర్పణ జరుగుచుండె
ఎంతమందితిన్నారో !
ఎవరి కెరుకతీరికేది ?

అన్నదాత కీర్తించుచు
తృప్తిగ త్రేన్చుచును. బోవు
వారలు వందలును, వేలు
ఎల్లజాతు లిందున్నవి

తిన్నదెంతొ? తినకయుండి
పారవేసినది యెంతయొ !
అన్నదాత కామేశము
హర్ష పులకితాబ్ధి యెపుడు

రాతిరి నిదురింపబోవు
సమయమందు మెల్ల మెల్ల_
తల్లి వచ్చి కూర్చుండెను
అవీ ఇవీ మాటలాడ

మాటల సందునను, తల్లి
వంటువాని దొంగతనము
పళ్ళెరమ్ము నిండ రాత్రి
బొబ్బట్లను గొనిపోవుట:

చెప్పి, చెప్పి ఛాందసముగ
వాపోయిన దెంతొ చింత!
ముది వగ్గున కెందులకో!
మూతి వంకరింత లేలో !

కామేశము కథనువిన్న
యనంతరము చెప్పెనిట్లు
"చీవాటులు పెట్టుదుమే
పాచక చోరునిని, వెళ్ళు!"

అంటూనే నిదురవోయె
గాఢముగా గుర్రువెట్టి,
తెల్లవారి లేచినాడు
దంతధావనము చేయగ,

కూరుచుండె తిన్నె మీద,
తీరికగా కామేశము,
మెల్ల మెల్ల తోముచుండె
దంతములను యథావిధిగ

ఇంటి వంటవాడు వచ్చి
లోగిటిలో ప్రవేశింప
నుంకింపగ, వానినాపి
న్యాయవాది యిట్టులనెను

"ఏరా! భడవా! నీవట!
బొబ్బట్లను దొంగిలించి
పళ్ళెరమున గొనినావట !
ఏమిబుద్ధిరా ! నీయది!

పిల్ల_మేక తినుటకునై
అడిగి తీసుకోవచ్చును_
వట్టి పిండి వంటతినిన
వంట బట్టునే బాపడ!

పొడి పొడిగా బొబ్బట్లను
తిన్నారో! యేమొ! మీరు?
హత్తుకొనునె పిల్లల కవి
ఎంత వింత! నీదుచేత!

ఫో ఇంటికి! పొమ్ము, వేగ
జారీనిండుగ నేతని
గొనిపోరా, తినుటకునై
బుద్ధిలేని వాడవురా!

అంతలోనె తల్లివచ్చి
వాకిటిలో నిలుచున్నది
న్యాయవాది కామేశము
పొరజూచి తానిట్లనె

సంతర్పణ మన్న నీవు
సంతోషము వెలిబుచ్చువు,
శేషించిన వంటకములు
పెంటపైన వేయదగున ?

అని తీరుపు నిచ్చినాడు,
అనుము మినుము అనకుండగ
తల్లి ఒసరిల్లె_వంట
వాడుపోయె జారీతో.

3

నేతితో తడిసినవి_నోటిలో కరగునవి_
తెలుగు పబ్బములలో చవులూరు బొబ్బట్లు
తేనె ధారలు చదిమి తీర్చినారెవ్వరో!
ఊటలూరునునోరు ఉత్సుకత చూచినన్

తినగ తినగను తీపి చెడని వీ బొబ్బట్లు!
తెలుగు రసనా తపఃఫలములీ బొబ్బట్లు!
బొబ్బట్ల సైదోడు 'పోళి' కన్నడములో
ఎబ్బెట్టు లేకుండ ఎన్నైన తినవచ్చు!

లోభి డబ్బును విడిచి పెట్టలేనట్లుగా
కామి కాంతా ప్రలోభమ్ము విడ లేనట్లు
మధుపాయి విడలేని మధురమైరేయమటు
బొబ్బట్లు విడలేరు భోక్తృ రసికులునేడు.

4

ఒకసారి కామేశమూరికి ప్రయాణమై
శ్రీకాకుళముచేరు త్రోవలో చిక్కువడె
అది యడవిపట్టు నిర్జనముగా నున్నయది
చండ్ర నిప్పులుగ్రక్కె చండాంశు డాయెడన

ఎండి పిడుచగ కట్టె అతని రసనాంచలము
ఇంత శ్రీమంతునకు చిటికెడైనను నీళ్లు
దొరక కుండెను_పల్లకిని మోయు బోయీలు
అనురుసుగా డస్సి అట్టె మోసిరి వారు.

సంకటం పడుచుండె స్వామి కామేశమ్ము
నీటి చుక్కలకునై, శ్రీమంతుడై యుండి,
ఎంత సిరి యిచ్చినను _ దాస దాసీలున్న-
కాల మెడగా నున్న కాసంత పనికాదు.

ఇంతలో నెదురుగా నిల్చె బాపండొకడు
వంతలను చివికి బొమికల గూడె కన్పట్టు
పంతులాతనిని ఎవ్వాడ వెటు పోయెదవు
అంచు ప్రశ్నించె దాహాతురుం డయ్యునున్

"ఇచ్చటికి దూరమ్ము — మాది కుగ్రామమ్ము-
వసతి వాడులులేని వాడ! బాపడ నయ్య!
ఒక్కగా నొక్కరుడు ఉన్నాడు బుడుతండు
వాని కుపనయనమ్ము సలుపవలె శాస్త్రవిధి

బ్రహ్మపురమందునను పంతులు-మహాత్ముడున్
సిరి సంపదలు గల్గు శ్రీమంతు డుండెనట!
ఆ మహాధర్మాత్ము దర్శింప బోయెదను
యాచించి పైకమ్ము, అలవరుచు కొనుటకై."

ఆ పల్కులను విన్న ఆ జయంతీశుండు
"వెళ్ళుదువుగాని లే- వినుము నాదొక మాట!
ఎండి పోవుచునున్నదయ్య నా నాలుకే
నీరొకింతియు లేక దాహాన తపియించి

చెంబు నిండుగ మంచితీర్థమ్ము తెత్తువా ?
తొందరగ తొందరగ, నీకు పున్నెమ్ముండు!"
అని ఆర్తితోజూచె నా పేద బాపనిన్
ఆశగా, వాడు పోయిన త్రోవనే చూచు

ఆ సవారీచూచి బోయీలనుం గాంచి
ఎవ్వడో సంపన్నుడై యుండునని యెంచి,
ప్రాభవముగల్గు ఉద్యోగి వర్యుడొ! యే మొ
అని తలంచుచుసాగె ఆ యాచకుండపుడు.

చుట్టుపట్టుల నెల్ల గాలించె నీటికై
ఎంతదూరమొ తిరిగె, ఎట్టెటో ఒక బావి
కానరాగా నిధిని గాంచినటు సంబరము
పడినాడు నిరుపేద, నీటినే పెన్నిధిగ

బారకొక యడుగుగా వచ్చె శీఘ్రంబుగా
చెంబు నిండుగ మంచినీరుగొని వచ్చుచున్
చల్లనై అమృతమ్ము చాయనున్నవి నీళ్లు
నీరు కాదది సుధాసారధారల పళ్ళు.

కామేశమునకిచ్చి కైవారముల్ సేసె
పంతులా చెంబుగొని ప్రాణ ధారకమైన
నీటినంతటి ద్రావె గడగడను తొందరగ
తృప్తి కన్నులదోప, కామేశమిటు పల్కె.

"బ్రతికించితివి నీరుపట్టికొని వచ్చితివి
ప్రాణమ్ము నిల్పితివి పరమార్థపరుడవే!
నీ వెదురుచూచు కామేశమ్ము లే దూర
మరల యింకొక తూరి పోయి చూతువుగాని

అని సవారిలో నున్న తలగడకు క్రిందున్న
ధనరాశిలోనుండి రూకలను తీయించి
చెంబునిండుగ పోసి చేతి కందిచ్చుచున్
'దీని కంటెను హెచ్చు నీవు తెచ్చిన నీరు' "

ఆ మాట విన్నంత ఆశ్చర్య విభ్రమము
లా పేదవాని కను బొమలలో తారాడె
ఎంత ఔదార్యమ్ము! ఈ మాట లందుండె
ఈత డెవ్వడొకాడు, కామేశమే సుమ్ము

వెదుక బోయిన తీవ కాల దగిలెనుగదే!
మీరె కామేశమ్ము! దాన కర్ణులు గారొ!
కానిచో* నైదువందల రూపికల నిట్లు
మంచి నీటికొసంగు మహితాత్ము డుండునే!

కామేశమును గూర్చి కథ యెద్దొ విన్నాను
అల 'ప్రభాకరగురుల' రచన ప్రేరకముగా
ఏదొ లోపలి పొరను ఇట్టులమ్ముగ తాకె
ఆంధ్రులొక్కరి దేమొ ఔదార్య గుణమన్న!

---

*19వ శతాబ్ది చివరి దశకములోని సంఘటన.




PRIDE OF INDIA




CHOICE OF MILLIONS










త్రివేణి

ತ್ರಿವೇಣಿ

ത്രിവേണി

திருவேணி

त्रिवेणि

VIJAYA

TRIVENI NUT POWDER MFG. CO.

Prop: DESU VENKATA SUBBA RAO

FORT ROAD, MACHILIPATNAM 521001

PHONES: 458.270

యాక్షన్ & థ్రిల్లర్ చిత్రాలలో మరో సంచలనం!



గీతా ఆర్టు పిక్చర్సు




డైరెక్షన్ K.S.రెడ్డి. నిర్మాత: K.మహేంద్ర

లక్ష్మీఫిలింస్

LAKSHMI PUBS.

సీడెడ్: భాస్కర్ పిక్చర్స్ గుంటూరు: V. పద్మాకరరావు తూ: పద్మావతి ఫిలింస్ మైసూర్: రామకృష్ణఫిలింస్ ఒరిస్సా: కాళికా పిక్చర్స్

# ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామికాభివృద్ధికి మకుటాయమానం

1960 లో ఆంధ్రప్రదేశ్ నందు పారిశ్రామికాభివృద్ధికి ఒక్కసారిగా ఉత్సాహం వెల్లువికినది. ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక అభివృద్ధి సంస్థ అవతరించినది. అదిమొదలు పారిశ్రామీకరణలో నిరంతర వేగము పుంజుకొన్నది. అదే అడుగుజాడలలో 340 కి పైబడి పరిశ్రమలు నెలకొల్పబడినది. ఈ సంస్థకు ఉత్తమ పారిశ్రామిక ప్రోత్సాహానికిగాను మూడు బహుమతులు లభించాయి. 2,50,000 మందికి ఉపాధి కల్పన జరిగినది. ఏ. పి. ఐ. డి. సి. మరెన్నో విజయాల సాధనకు కృషిని తీవ్రతరం చేసింది. వరుసగా రెండు సంవత్సరాలలో వారానికి ఒక పరిశ్రమ వంతున విజయవంతంగా ప్రమోట్ చేయగలిగింది. ఇప్పుడు వారానికి రెండు పరిశ్రమల వంతున నెలకొల్పడానికి నడుం బిగించబడినది.

## ఉత్సాహం గల పారిశ్రామికులకు 'ఎ. పి. ఐ. డి. సి.' ఏ విధంగా సహకరిస్తుందో గమనించండి.

- ప్రాజెక్టుల ఎన్నికలో తోడ్పడుతుంది.
- వివిధ ఏజన్సీల నుంచి అనుమతులు సంపాదించి పెడుతుంది.
- జాయింట్ మరియు అసిస్టెంట్ రంగాలలో ఈక్విటి వాటాలలో తనుకూడా పాలుపంచుకొంటుంది.
- అత్యవసర ఆర్థిక అవసరాలను ఆదుకొంటుంది.
- ఐ. డి. బి. ఐ. యొక్క సీడ్ కేపిటల్ స్కీమ్ను నిర్వహిస్తుంది.
- ఐ. డి. బి. ఐ. రీఫైనాన్స్ స్కీము క్రింద రు. 60 లక్షల వరకు ఋణాలు మంజూరు చేస్తుంది.
- పై కార్యక్రమాలతో పాటు, ప్రాజెక్టు త్వరితగతిలో అమలు పర్చుటలో తన పూర్తి చేయూతనిస్తుంది.

ఇవన్నీకూడా పరిశ్రమల స్థాపనకు అన్నివిధాల అనుకూలంగా తగినంత విద్యుత్, చాలినంత నీరు, విరివిగా కార్మికశక్తి గల ఈ రాష్ట్రంలోనే సాధ్యపడుతోంది.

మీకోసం విజయం ఎదురుచూస్తోంది. ముందుకు వచ్చి మీశక్తిని నిరూపించండి.

శ్రీ బి. ఎన్. రామన్, I. A. S.
ఛైర్మన్,

శ్రీ పి. ఎల్. సంజీవ రెడ్డి I. A. S
వైస్-ఛైర్మన్, మేనేజింగ్ డైరెక్టర్.

## ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ లి.,

పరిశ్రమల భవనం, హైదరాబాదు-500 021




అన్ని రకముల మ్యూజికల్ సామానులు సరసమైన ధరలకు లభించును.

❁ రిపేరింగు మా ప్రత్యేకత ❁

## జైభారత్ మ్యూజికల్ కంపెనీ

గాంధీనగర్ :: విజయవాడ-3.

---

## దక్షిణ భారత దేశంలో విరివిగా వాడుతున్న కిచెన్ వేర్

దశాబ్దాల తరబడి
అనుభవజ్ఞులైన
పనివారలతో
తయారు
చేయబడుతున్న
మేలైన మన్నికైన
"సింహం"
మార్కు స్టెయిన్‌లెస్ స్టీల్
&
అల్యూమినియం
పాత్రలనే
ఎన్నిక చేయండి!




# సన్‌లైట్ మెటల్ వర్క్సు

జవహర్ ఆటోనగర్, విజయవాడ-7 ఫోన్: 867346-867636

## శ్రీ ముదిగొండ ఈశ్వర చరణ్

# ఆంధ్రదేశంలోని ఆరాధ్య శైవ సంప్రదాయము ఒక పరిశీలన

"ఆగమార్థాను సంధాతా
రాగద్వేష వివర్జితా
ధ్యానయోగ సమాయుక్తాః
ఆరాధ్యాః పరికీర్తితా" —చాటువు.

"శివస్య ఇదమ్ శైవమ్"-దీని వలన శివునకు సంబంధించినది శైవమని జ్ఞాతమగుచున్నది.

మానవునికి తెలిసిన తొలి మతాలలో శైవము ఆద్యమని ఊహించడానికి ఆధారాలున్నాయి. క్రీ.పూ. 5వేల సంవత్సరాలనాటి మహెంజోదారో హరప్పా త్రవ్వకాలలో బయల్పడ్డ గోముఖాలూ శివలింగాకృతులూ పై ఊహకు బలవర్ధకాలు. ఇంతేకాకుండా ఆ తొలినాళ్ళలో శైవము భారతదేశంలోనే కాకుండా లాటిన్ అమెరికా, ఫ్రాన్సు, గ్రీక్, ఇరాన్ మొదలైన దేశాలలో కూడా విస్తృతంగా వ్యాప్తిలో ఉండవచ్చని కొందరు పండితులు భావిస్తున్నారు. పూజ్యులు శ్రీ మాధవవిద్యారణ్యుల వారు తమ "సర్వదర్శన సార సంగ్రహము"లో పదిహేను దర్శనాలను వివరిస్తూ "శైవంచ వైష్ణవం శాక్తం సౌరం గాణాపతం తథా" అని శైవము యొక్క ప్రాథమికతను సూచించారు.

మతం కాని, జాతికాని, ఆచారవ్యవహారంకాని కాలానుగుణమైన మార్పులను స్వీకరించాలి. లేకపోతే నిర్వీర్యము, నిర్జీవములై చరిత్ర పుటల్లో మాత్రమే బ్రతికి ఉంటాయి. ఈ సత్యాన్ని గుర్తించడమేకాక అక్షరశః ఆచరించినది శైవము "శ్రీ శ్వేతాది లకుళశాంతం" 140 మంది శివాచార్యులు తమతమ కాలానికి సరిపడే విధంగా శైవాన్ని తీర్చిదిద్దారు. ఇవన్నీ క్రమంగా అంతర అవాంతర భేదాలుగా స్థిరపడ్డాయి. వీటిల్లో ప్రధానములైన శాఖలు నాలుగు-సామాన్య శైవము, శుద్ధశైవము, మిశ్రశైవము, వీరశైవము.

అన్ని వేళలందు విభూతి పూసుకొని శివలింగం కనుపించగానే ప్రదక్షిణ పూర్వకంగా నమస్కరించడం సామాన్య శైవము.

శివ మంత్రోపదేశం పొంది భస్మరుద్రాక్షలు ధరించి శివలింగాన్ని పీఠంపై పెట్టి పూజించడం శుద్ధశైవము.

శివలింగముతో పాటు శక్తి, సూర్యుడు, గణపతి, విష్ణు విగ్రహాలను చేర్చి అర్చించడం మిశ్రశైవము.

గురువుగారు హస్తమస్తక సంయోగం చేసి షట్స్థల న్యాసంచేసి లింగధారణ దీక్షనీయగా అష్టావరణాలు, పంచాచారాలు నియమం తప్పక అనుష్ఠిస్తూ ఉపాసించడం వీరశైవము

వీరశైవము వైదికము అవైదికమని, రెండు రకాలు. ఈ రెంటి సిద్ధాంతము, ఉపాసనారీతి, ప్రమాణము ఇంచుమించుగా ఒక్కటే.

వీరశైవాచారములతో పాటుగా వైదికములైన ఉపనయనం, యజ్ఞయాగాది కర్మకాండ, వర్ణాశ్రమ ధర్మాల అనుసరణ వైదిక వీరశైవము యొక్క ప్రత్యేకత.

పైన చెప్పబడ్డ వైదికాచారాలను తిరస్కరించి కేవలము వీరభక్తిని మాత్రమే ప్రబోధించినది అవైదిక వీరశైవము.

వైదికమైన వీరశైవము ఆంధ్రదేశములో 'ఆరాధ్య శైవ' సంప్రదాయంగా విస్తరిల్లినది. ఈ సంప్రదాయం వారికి 'ఆరాధ్యులు లేక 'లింగధారిబ్రాహ్మణు' లని సంకేతం.

అవైదికమైన వీరశైవము కర్ణాటకంలో 'లింగాయత' లేక 'జంగమ' సంప్రదాయంగా ప్రచారం పొందింది.

ఇవి రెండూ శైవ—పాశుపత—కాలాముఖ—కాపాలికములని చెప్పబడే శైవప్రభేదాలలో పాశుపత శాఖకు చెందినవి. శ్రీ లకులీశ శివాచార్యులు పాశుపత సమయ సిద్ధాంతాలను పునరుద్ధరించి అశేషప్రచారం సాగించారు. ఈ మహాపురుషుడు క్రీ.పూ. 3వ శతాబ్దివాడుగా చెప్పబడుతున్నాడు.

ఆంధ్రదేశంలోని ఆరాధ్యశైవసంప్రదాయం విశిష్టాద్వైతమని, శివవిశిష్టాద్వైతమని శివాద్వైతమని అభిఖ్యను పొందింది.

శ్రీశ్రీ నీలకంఠ శివాచార్యభగవత్పాదులు ఆరాధ్యశైవ సంప్రదాయమునకు మూలపురుషులు. వీరికి శ్రీ శ్రీకంఠాచార్యులు అని కూడ నామాంతరము ఉన్నది. శ్రీవారి జన్మకాలము, జన్మస్థలము లను గూర్చి ఇంకా ఏకవాక్యత కుదురలేదు.

శ్రీ శివాచార్యులు ఆంధ్రదేశంలోని శ్రీకాళహస్తిక్షేత్రంలో జన్మించారని శ్రీవారి భాష్యపీఠికలో శివలోకవాసి శ్రీ ముదిగొండ వీరేశలింగశాస్త్రిలవారు నిర్ణయించారు. శ్రీశివాచార్యులు భారద్వాజస గోత్రులు. తల్లి గౌరీదేవి. తండ్రి విశ్వారాధ్యులు. నీలలోహిత రుద్రాంశ చేత వీరు అవతరించారని సంప్రదాయ విజ్ఞుల విశ్వాసం. వ్యాసమహర్షి ప్రణీతమైన బ్రహ్మసూత్రాలకు భాష్యంవ్రాసి శ్రీ శివాచార్యులు ఆరాధ్య శైవాద్వైత సంప్రదాయానికి బాటలు వేశారు.

శ్రీశివాచార్యుల కాలము వివాదాస్పదమైనది. ఆరాధ్యులు శ్రీ శివాచార్యులు శ్రీ శంకరభగవత్పాదులకన్నపూర్వుడని శ్రీవారి భాష్యమే ప్రస్తుతం లభ్యమౌతున్న భాష్యాలన్నింటిలో ప్రాచీనమని చెబుతున్నారు. వీరు సిద్ధాంతాము చేసిన శివవిశిష్టాద్వైతమే తరువాతి కాలములో శ్రీమద్రామానుజాచార్యుల వారు విష్ణు విశిష్టాద్వైతంగా సిద్ధాంతం చేశాడని ఆరాధ్యుల వాదం.

తక్కిన పండితులు శ్రీ శివాచార్యులు శ్రీ శంకరులకు తరువాతి వాడని, శ్రీరామానుజులకు పూర్వుడని కొందరు, శ్రీరామానుజులకు సమకాలీనుడని కొందరు, తరువాతి వాడని మరి కొందరు చెబుతున్నారు.

శ్రీ శ్రీశివాచార్యులు తమ భాష్య ప్రారంభంలో "పూర్వాచార్యైః కలుషితమ్" అని ప్రస్తావించారు ఈప్రస్తావింపబడ్డ పూర్వాచార్యు లెవరన్నది ఒక ప్రశ్న. 'శ్రీశివార్కమణిదీపికా' కర్తలు శ్రీ మదప్పయ దీక్షితుల వారు ఈ పూర్వాచార్యులు శ్రీ శంకర రామానుజాదులకు పూర్వులైన శ్రీ భట్టభాస్కరాదులని నిర్ణయించారు. శ్రీ భట్టభాస్కరాదుల భాష్యాలు ప్రస్తుతం లభించక పోవడం వల్ల వారి ననుసరించి భాష్యాలు వ్రాసిన శ్రీశంకరాదుల భాష్యాలనే శ్రీ నీలకంఠీయముతోపోల్చి విమర్శింపవలసి వస్తున్నదని వారి తాత్పర్యము. ఇంతేకాక శ్రీ దీక్షితులు "చతుర్మత లేశ సంగ్రహము 'లో' శ్రీకంఠీయము భగవత్పాదీయము — రామానుజము — ఆనందతీర్థీయము" అని తమ కాలములో ప్రసిద్ధములైన భాష్యాల ఉల్లేఖించారు. ఈక్రమం వల్ల ఆధునిక భాష్యకారులలో శ్రీనీలకంఠులు ప్రథములని వారి తాత్పర్యముగా భావించవచ్చును.

శ్రీశివాచార్యులు తమ భాష్యంలో బౌద్ధజైన చార్వాకాది సంప్రదాయాలను నిశితంగా విమర్శించారు. శ్రీ శంకరుల భాష్యం వ్రాయబడ్డనాటినుండి విశేష ప్రచారం పొందిందని అందరూ అంగీకరించే విషయమే. ఒకవేళ శ్రీ శివాచార్యులు శ్రీ శంకరుల తరువాతివాడైన పక్షంలో శ్రీవారి అద్వైతాన్ని కూడ ఖండించి ఉండేవారు. కాని వారి భాష్యంలోఅద్వైతప్రసక్తిలేదు. ఇందువల్ల శ్రీ శంకరులకు వీరు పూర్వీకులని తెలుస్తున్నది. ఇదిలా ఉండగా శ్రీ నీలకంఠీయమైనఅనేక ఉపపత్తులను శ్రీశంకరులు ఖండించినారు.

శ్రీమాధవవిద్యారణ్యులు 'శంకరవిజయంలో' శ్రీనీలకంఠులు శ్రీ శంకరులతో వివదించి ఓడిపోయారని వర్ణించారు. కొందరు భావిస్తున్నట్లుగా ఒకవేళ శ్రీ నీలకంఠుల శ్రీ శంకరుల తరువాతి వాడూ లేక శ్రీ రామానుజులకు సమకాలికుడూ ఐన పక్షంలో శ్రీ విద్యారణ్యులవ్రాతలసంగతములు కాకతప్పదు. శ్రీ శంకరుల తరువాత శ్రీవిద్యారణ్యులు ప్రామాణికులు వారి వ్రాతల్ని త్రోసిపుచ్చడం సంభావ్యంకాదు. తమ నాయకునికి ఉత్కర్ష సంపాదించడం కోసం అతని కన్న, పూర్వులు. ప్రసిద్ధులు అతని చేతిలో ఓడిపోయారని వర్ణించడం పరిపాటి. శ్రీ హాలాస్యనాథశాస్త్రి గారు శ్రీ నీలకంఠుల ప్రాచీనతను అంగీకరించి సమర్థించారు:

ఈ వాదోపవాదా లెలా ఉన్నా శ్రీ నీలకంఠశివాచార్యులు ఆరాధ్యులకుప్రామాణికుడు—మూలపురుషుడు. వారి కాలం, స్థలం ఏదైనా వైదిక మత సంప్రదాయములలో ఒక నూత్న మార్గ ప్రవర్తకుడు.

శివుడు, జీవుడు వస్తుతః వేర్వేరు పదార్థములు ముక్తదశలో జీవుడు శివైక్యము పొంది, శివునికి నిత్యములైన సర్వజ్ఞత్వము. నిత్యతృప్తత్వము, అనాదిసిద్ధి బోధత్వము, స్వతంత్రత్వము, అలుప్తశక్తిత్వము, అనంతశక్తియుక్తత్వము అనబడు షడ్గుణైశ్వర్యాలను అనుభవిస్తూ జగజ్జన్మాది పంచకృత్యరహితమైన ఆనందానుభూతి పొందడం శివాద్వైతము. దీనినే "సూక్ష్మ చిదచిచ్ఛక్తి విశిష్టశివశ్చ—స్థూలచిదచిచ్ఛక్తివిశిష్టశివశ్చ—తమోరద్వైతం విశిష్ట శివాద్వైతం" "అని" విశిష్టంచ విశిష్టేతమోరద్వైతమ్ విశిష్టాద్వైతము స్థూలచిదచిద్విశిష్టంబ్రహ్మ— సూక్ష్మ చిదచిద్విష్టం బ్రహ్మ—తమోరైక్యమితి " అని నిర్వచింప బడినది. అనగా అభివ్యక్త నామరూపములుకల జడజీవులతో కలసియుండు బ్రహ్మ అనభివ్యక్త నామరూపములతో కలసియుండు బ్రహ్మ ఏకత్వము. భిన్నతత్త్వములు కావని అభిప్రాయము.

నిఖిల సంసారదోషరహితమైనది, మాంగల్యగుణాధారభూతమైనది బ్రహ్మము. ఇది జగత్తునకు నిమిత్తకారణము. ఉపాదాన కారణము శక్తి విశిష్టము చంద్రునిలోని వెన్నెలలాగా. అగ్నిలోని దాహకశక్తిలాగ శక్తి బ్రహ్మమందు వ్యాపించి ఉన్నది. స్థూలమైన చిదచిచ్ఛక్తితో కూడిన బ్రహ్మము కారణముకాగా సూక్ష్మ చిదచిచ్ఛక్తితోకూడిన బ్రహ్మ కార్యము. పరాశక్తి చేతనా చేతనాత్మకమైన జగత్తు. ఇట్టి పరాశక్తి విశిష్ట బ్రహ్మమే శివుడు. అతడు, సర్వోత్కృష్టుడు. "నకించన శివాదన్యం నకించన శివాత్పరం శివాంతిరిక్తంనహిచ, సర్వంశివమయం జగత్" అని పురాణ వచనము. ఈసృష్టికి పూర్వం సత్—చిత్ లేవీ లేవు. ఉన్నదొక్కడే శివుడు. అతని శక్తి ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులుగా రూపెత్తి

## పశ్చిమ గోదావరి జిల్లా ఎగ్జిబిటర్లకు, ప్రేక్షకులకు, మా శ్రేయోభిలాషులకు

# ఉగాది శుభాకాంక్షలు!

## 1982 లో మా సంస్థ ద్వారా విడుదలైన చిత్రాలు

1. మధుర స్వప్నం
2. బంగారు భూమి
3. సావిత్రి
4. ఈశ్వర కటాక్షం
5. ఏమండోయ్ శ్రీమతిగారు
6. ఇల్లాలు-చూలాలు
7. వంశ గౌరవం
8. కేన్సర్ సుఖవ్యాధులు
9. కృష్ణార్జునులు
10. దొంగలొస్తున్నారు జాగ్రత్త
11. మంచు కొండలు
12. ప్రేమమూర్తులు
13. పట్నంమొగుడు పల్లెటూరిపెళ్ళాం
14. ముసలోడికి దసరా పండగ
15. జస్టిస్ చౌదరి
16. టిక్ టిక్ టిక్
17. శుభలేఖ
18. కోరుకున్న మొగుడు
19. పన్నీరు పుష్పాలు
20. గోపాల కృష్ణుడు
21. ఇది పెళ్ళంటారా ?
22. కలియుగ రాముడు
23. నిప్పుతో చెలగాటం
24. ప్రతీకారం
25. సీతాదేవి
26. ప్రేమనక్షత్రం
27. గోల్కొండ అబ్బులు
28. పగబట్టిన సింహం
29. కయ్యాల అమ్మాయి కలవారి అబ్బాయి
30. ఎంత ఘాటు ప్రేమయో
31. జగ్గు
32. అమరగీతం
33. మేఘ సందేశం
34. ప్రేమకు పాదాభిషేకం
35. పట్నం వచ్చిన పతివ్రతలు
36. టింగు రంగడు
37. మంత్రాలయ రాఘవేంద్ర వైభవం
38. వసంత కోకిల
39. బిల్లా రంగా
40. యమ కింకరుడు
41. షంషేర్ శంకర్
42. నా దేశం
43. మొండిఘటం
44. ఇల్లంతా సందడి
45. పగబట్టిన బెబ్బులి
46. కదలి వచ్చిన కనకదుర్గ
47. మంచుపల్లకి
48. బంధాలు అనుబంధాలు
49. ఒ ఆడది ఓ మగాడు
50. త్రిశూలం

## 1983 లో మా చిత్రాలు

1. బలిదానం
2. మనిషికో చరిత్ర
3. ప్రళయ గర్జన
4. కుంకుమ తిలకం
5. ఈశ్వరుడు శనీశ్వరుడు
6. ధర్మపోరాటం
7. పల్లెటూరి మొనగాడు
8. రఘురాముడు
9. ఊరంతా సంక్రాంతి
10. పిచ్చిపంతులు
11. స్నేహాభిషేకం
12. అభిలాష
13. కిరాయి కోటిగాడు
14. సాగర సంగమం
15. శ్రీ మద్విరాట్ వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్ర
16. నాంపల్లి నాగు
17. ఆంధ్రకేసరి
18. కలియుగ దైవం
19. రాకాసి లోయ
20. జ్యోతి ఆర్ట్ క్రియేషన్స్ ప్రొడక్షను నెం. 2
21. భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్సు ప్రొడక్షను నెం. 3
22. శ్రీ క్రాంతి చిత్ర ప్రొడక్షను నెం 4
23.
24.
25.
26.

# ఉషా పిక్చర్స్

G. N. T. రోడ్, ఏలూరు

ఫోన్లు: 657, 990, 1737 & 45

సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహాలనే పంచకృత్యాలను నిర్వహిస్తున్నది.

శివుని శక్తివిలసనము జగత్తు, శక్తి స్థూలతత్త్వము సృష్టి. సూక్ష్మతత్త్వము లయము. శక్తి మాయారూపిణియై శివుని మరపించి జీవుడు జగత్తునందే రమించునట్లు చేయును. ఇందువల్లనే జగద్రూపమైన శక్తి పాశమని చెప్పబడింది.

జీవుడు నిత్యుడు. నానాత్వశోభితుడు. కర్త, భోక్త, శరీరభిన్నుడు. శివుడితో పూర్తిగా భిన్నుడు కాని, పూర్తిగా అభిన్నుడు కానికాడు. శివుడు అంశి. జీవుడు అంశము. గాలివాటున నిప్పు ముద్దనుండి దూరంగా విసరివేయబడ్డ రవ్వలో నిప్పు లక్షణాలున్నాయి. అంతమాత్రాన అది నిప్పు అని అనలేం : జీవుడు సరిగా ఈ నిప్పురవ్వ లాంటివాడు. అనాదియైన అజ్ఞానంచేత, కర్మాచరణం కావిస్తూ, ఫలానుభవం పొందుతూ, తదనుగుణమైన శరీరాలను ప్రవేశిస్తూ, నిర్గమిస్తూ ఉంటాడు. జగద్రూపమైన శక్తి తన మాయచేత జీవుని ఇందుకు ప్రేరేపిస్తూ ఉంటుంది. ఈ ప్రేరేపణకు వశ్యుడు కావడమే జీవుని అజ్ఞానం. ఇట్టి అజ్ఞానంవల్ల జీవుడు 'పశువు' అనబడుతున్నాడు. అయితే స్వప్రయత్నం చేత పాశరూపమైన జగత్తునుండి బయల్పడి శివోపాసన చేసి శివైక్యం చెందుతాడు. దీనినే శ్రీశ్రీ నీలకంఠ శివాచార్యులు "నిరంతర శివోహమితి భావనాప్రవాహేణ శిథిలిత పాశపాతయాపగత పశుభావ ఉపాసకి శ్శివమేవభవంతి" అని స్పష్టం చేశారు.

విశిష్టాద్వైతము లేక శివ విశిష్టాద్వైతము లేక శివాద్వైతము అని చెప్పబడుచున్న ఆరాధ్య సంప్రదాయంలో పైన వివరించబడ్డ పశు-పాశ-పతి వివేకం అత్యంత ప్రధానమైన ఘట్టం. ఈ మూడున్నూ సత్యములూ, నిత్యములూ. జీవుడు శివునికన్నా భిన్నుడైనా, పాశరూపమైన జగత్తులో తన ఇచ్ఛచేతనే రమిస్తున్నా ఉపాసనా బలంవల్ల శివునితో అభిన్నుడు కాగలడని అనగా భిన్నములైన రెండు పదార్థములు ముక్తదశలో ఏకత్వము పొందగలవని చెప్పడం వల్ల ఈ సంప్రదాయం శివాద్వైతం అని చెప్పబడింది.

శివాగమములు ఈ సంప్రదాయం యొక్క ఉపాసనా విధులను, సమయసిద్ధాంతాలను నిర్దేశిస్తున్నాయి. ఇవి మొత్తం 28. శివాగమములకు, వేదములకు భేద. లేదనిరెండున్నూ శివప్రోక్తములేనని శ్రీ శివాచార్యులు చెప్పారు. "వయంతు వేద శివాగమయోర్భేదః నపశ్యామః ఉభయోరేక ఏవశ్శివః కర్తా :" అని శ్రీవారి వచనం. వేదాలు మంత్రమయాలని, ఆగమాలు వ్యాఖ్యానాలని వారు విశదీకరించారు. వేదాలు బ్రహ్మ క్షత్రియ వైశ్యజాతులు మాత్రమే అధ్యయనం చేయదగినవి కాగా ఆగమములు సర్వవర్ణములవారూ చదువవచ్చని వారి అభియుక్తి. "అనేన అవగమ్యతే ఇత్యాగమః" అని ఆగమశబ్ద వ్యుత్పత్తి. అనగా ఆగమాలవల జీవేశ్వరులకు సంబంధించిన సమస్త విషయములు తెలియగలవు

లింగధారణము, అష్టావరణములు, పంచాచారములు ఆ మోక్షాలైన ప్రధాన ఉపాసనా మార్గాలు.

శరీరము స్థూల, సూక్ష్మ కారణమని మూడు రకాలు. ఈ మూడింటిని వేధ-మను-క్రియాదీక్షలచేత మాంసపిండాన్ని మంత్ర పిండంగా పవిత్రీకరించి ఇష్ట-భావ-ప్రాణలింగములతో అనుసంధానించడం లింగధారణము. ఇష్ట-భావలింగములు ఆంతరముల ప్రాణలింగము బాహ్యము. ప్రాణముతో మాత్రమే విడువదగిన కాబట్టి దీనికి ప్రాణలింగమని పేరు. దీనిని లింగపేటికలో ఉం తలమీదనో, హృదయంపైననో ధరించి, నిత్యం షట్కాలమ అందు లేక త్రికాలములందు కనీసం ఒక్కమారైనా అర్చించాలి ఈ లింగధారణదీక్ష పాశుపతవ్రతము, అత్యాశ్రమము, శాంభవమ శిరోవ్రతమని కూడా పిలువబడుతున్నది. అన్ని వ్రతాల్లోనూ ఇ అత్యుత్తమమని చెప్పబడింది. ఈ దీక్ష పొందినవాడు మరెట్టి వ్రతములు, దీక్షలు పొందకుండానే శివసాయుజ్యం పొందగలడని, ఇ దీక్షాపరుడు శివయోగి లేక ధ్యానయోగి అనిపిలువబడుతాడని శైవాగమములు చెబుతున్నాయి.

గురువు-లింగము- మాహేశ్వరుడు-తీర్థము- ప్రసాదము భస్మము-రుద్రాక్ష-మంత్రములు అష్టావరణములు. పాశుపతుడు తప్పక అనుసరించి తీరవలసినవివి. బాహ్యములైన ప్రమాదాల నుండి ఇంటిని ఆవరణ (ప్రహరి) రక్షించు విధానదేహమనే గేహ లౌకికములైన విషయవాంఛలకు లోనుకాకుండా ఈ ఆవరణాలు రక్షిస్తాయి. "ఇమాని శివభక్తానాం భవదోతతే స్సదా నివారణై కార్యాణి ఖ్యాతాన్యావరణాఖ్యయా."

అష్టావరణముల తర్వాత అనుష్ఠింపవలసినవి పంచాచారములు. ఇవి లింగాచారము-సదాచారము- శివాచారము-గణాచారము భృత్యాచారము.

ఇంతకుపూర్వం చెప్పబడ్డట్లుగా లింగధారణ దీక్షపొందడ లింగాచారం.

వేదములు-వేదాంతములు - ఆగమములు - ఇతిహాసములు పురాణములు-శాస్త్రములు ప్రవచించేరీతిలోతన పెద్దలు అనుసరించి మార్గాన్ని అనుష్టించడం సదాచారం

తాను అనుభవించేదేదైనా మొదలు దేవునకు అర్పించి శి ప్రసాదంగా భావించి పొందడం, తాను చేసే పని ఏదైనా శివార్పణ బుద్ధితో చేయడం శివాచారం.

సత్యము-దయ-శీలము- శౌచము మొదలైన అరవైనా శీలములు కలిగి వర్తించడం గణాచారం.

ఆబాలగోపాలాన్నీ సంగీత శృంగార రస తన్మయుల్నిచేస్తూ, ఉడుగుడుగునా సన్నివేశాలతో ఉత్తేజపరిచు చిత్రంగా వస్తూంది !

అందర్నీ మురిపించి మైమరిపించే శృంగార సంగీత హాస్య
రసాత్మక చిత్రం!




హలో హలో ప్రియుడా

కలర్

రామనారాయణ, శంకర్-గణేష్, వేటూరి, ఏ.ఏ.రాజ్, గాంధీ

GOTETI

గోటేటి శ్రీరామారావు

త్వరలో మరో సంగీత రసాత్మకపు తెలుగుచిత్రం. మీ అభిమాన తారాగణంతో నిర్మిస్తున్నాం.

వివరాలకు : గోటేటి ఫిలిమ్స్, 80, VII ఎవెన్యు అశోక్‌నగర్, మద్రాసు—83 ఫోన్ : 422825

గురువు-జంగము-లింగ ములమొదలైన వారికి తాను సేవకుడ ననే భావంతో సేవించడం భృత్యాచారం.

ఈ ఆచారములు మనస్సు-బుద్ధి-వాక్కు-కాయము- కర్మము లను పరిశుద్ధంచేసి సాధకుడు త్వరగా శివసాక్షాత్కారం పొంద డంలో సాయపడుతాయి.

స్థూలంగా శివాద్వైతం యొక్క లక్షణాలివి. ఇంతకు ముందే ప్రస్తావించబడినట్లుగా ఆంధ్రదేశంలోని ఆరాధ్య సంప్ర దాయానికి, కర్ణాటకంలోని జంగమ సంప్రదాయానికి ఈ లక్షణాలు సమంగానే ఉన్నాయి. ఇక ఈ రెండు సంప్రదాయాలకుకల భేదాలను పరిశీలింపవలసిఉంది.

కర్ణాటకంలోని బసవన లేక జంగమ సంప్రదాయంలో వైదిక కర్మలు పూర్తిగా వదలి వేయబడి కేవలం భక్తితో జరిపే శివార్చనమే మోక్షహేతువని చెప్పబడింది. కులాలు, జాతులు మానవ కల్పితాలని, వృత్తిపరంగా ఏర్పడ్డవని, లింగధారివృత్తి యేదైనా అతడు మహేశ్వర స్వరూపుడైన మాహేశ్వరుడని అందురూ శివయోగులేనని బసవన్న ప్రకటించాడు. ఇందువల్లే బస వన్న, అతని బోధలు సంఘతిరస్కృతులనూ, బహిష్కృతులనూ విశేషంగా ఆకర్షించాయి.

ఆంధ్రదేశంలోని ఆరాధ్యసంప్రదాయం ఒక చెంప భక్తి మీద వలపు మరోచెంప బ్రాహ్మణ్యంబుతో పొత్తు వదులుకోలేక ఒక నూతన వ్యవస్థకు ప్రారంభోత్సవం చేసింది.

"వేదో ధర్మమూలంహి— వేదమూలం మహేశ్వరః" అని శ్రుతి. యజ్ఞోపవీతము, యజ్ఞయాగములు, వర్ణాశ్రమ ధర్మ ములు, వేదప్రోక్తములు. కాబట్టి ఇవి ప్రతివానికీ అవశ్య ఆచర ణీయములు. రాజాజ్ఞనుమీరినవాడు దండింపబడునట్లే ఈశ్వరప్రోక్త మైన వేదాచారములను మీరినవాడు కూడా దండింప బడుతాడు. ఇట్టి కర్మాచరణం వల్లనే శివోపాసన ఫలవంతమౌతుంది. కేవలంజ్ఞానం మోక్షహేతువు కాజాలదు.

"అపశ్యన్నంధకోదగ్ధః పశ్యన్నదహతిపంగులః
అంధపంగునః దన్యోన్య సాపేక్షేజ్ఞాన కర్మణేతి!"

ఒక కుంటివాడు మరొక్క గ్రుడ్డివాడు కలసి ఒకేయింటిలో నివసిస్తున్నారు. ఒకనాడు ఆ ఇంటికి నిప్పంటుకొన్నది. ఆ విషయం కుంటివాడు గ్రుడ్డివాడికి చెప్పాడు. గ్రుడ్డివాడు కుంటివానిని తన భుజములపై కెక్కించుకొని ఇల్లు దాటించాడు. ఈ రకంగా వారిద్దరూ పరస్పర సహాయంతో ఆపదనుండి బయట పడగలిగారు. ఈకథలో జ్ఞానం కుంటిది. కర్మ గ్రుడ్డిది, జ్ఞానకర్మల యొక్క పరస్పర సహాయంతో సాధకుడు ఉత్తీర్ణుడు కాగలుగుతాడు.

జ్ఞాన హీనమైన కర్మకాని, కర్మహీనమైనజ్ఞానం కాని ఫలించవు. ఇవి పక్షికికల రెండు పక్షముల వంటివి. ఏకపక్షమైన పక్షిఎగురలేదు కదా!

ఇందువల్ల సర్వధర్మములు, సర్వకామ్యములు శివమయము లని, శివప్రీతికరములని భావించి సమస్తకర్మలు శివార్పణ బుద్ధితో చేయువాడు శివయోగి అని, అట్టివాడే శివానుగ్రహం పొందగలడని శ్రీశ్రీ శివాచార్యులు నిష్కర్షచేశారు.

ఆంధ్రదేశంలో ఆరాధ్య లేక శివాద్వైత సంప్రదాయం యొక్క మహనీయస్థితికి మూలమై నిల్చినవాడు శ్రీమత్త్రిలోకగురు మల్లికార్జున పండితారాధ్యుడు. ఈమహాపురుషుడు 12వ శతాబ్దివాడు. జన్మస్థలము ద్రాక్షారామము. జననిగౌరాంబ. జనకుడు భీమన్న. గౌతమసగోత్రికుడు. శైశవావస్థలోనే వేదవేదాంగములు పురాణేతి హాస శాస్త్రములు పుక్కిటబట్టి శ్రీశైలక్షేత్రంలో కఠోర తపస్సు చేసి పండితుల చేత ఆరాధింపబడి పండితారాధ్యుడనే గౌరవపట్టం పొందిన మహితాత్ముడు. తన కాలంనాటి బ్రాహ్మణుల పంచాయ తన పూజవేదవిదూరమైనదని చాటిచెప్పి లింగధారణ దీక్ష పొంది, భస్మరుద్రాక్షలు ధరించి నిత్యమూ ఆరు వేళల నియమము తప్పక శివపూజ చేస్తుండే వాడు. నాటి బ్రాహ్మణ్యం ఈ రీతిని నిరసించగా వారిని ఒప్పించి మెప్పించి తన శిష్యులుగా చేసుకొన్నాడు. వెల నాటి చోళుని అస్థానంలో బౌద్ధాచార్యుని ఓడించి తన మతాన్ని స్థాపించుకొన్నాడు. తన మతప్రచారంకోసం ఎన్నోగ్రంథాలను రచిం చాడు. వాటిలో నాటికీ నేటికీ "శివతత్వసారం" అనేది ఆరాధ్యుల మేనిఫెస్టో" మతం దృష్ట్యానే కాక సాహిత్యపరంగా కూడా ఇది ప్రధానమైనది. కర్ణాటకంలో బసవేశ్వరుని వీరశైవానికి ఆంధ్రలో తన సంప్రదాయానికి మధ్య కలిగిన దూరాన్ని గమనించి తననాటి వేదాచారానికి కొన్ని సంస్కరణలు చేసి తన శివాచారాన్ని, బస వన్న శివాచారాన్ని సన్నిహితం చేశాడు. ఈయన ప్రధానంగా ప్రచారం చేసిన సంస్కరణ ఖననసంస్కారం. లింగధారణదీక్షచేత మాంసపిండం మంత్రపిండమై నిత్యలింగసాన్నిహిత్యం చేతపవిత్ర మైనాడు కాబట్టి ఆరాధ్యునకు ఖననమే కాని దహనం పనికి రాదని ఈయన వాదం. అద్వైతంలో కూడా సన్యాసియైన వానికి ఖననమే చెప్పబడింది. లింగధారణ దీక్ష పొందిన ఆరాధ్యుడు శివ యోగి అనబడుతాడు. గృహస్థాశ్రమంలో ఉన్నా అతడు సన్యా సియే! ఇందువల్ల ఆరాధ్యునకు ఖననమే శాస్త్రసమ్మతమని మల్లి కార్జున పండితుడు నిరూపించాడు.

ఇదిట్లుండగా సన్యాసాశ్రమ స్వీకారాన్ని పండితుడు నిరసిం చాడు. మానవుడుగా పుట్టినందుకు తన సంఘానికీ, తన దేశానికి సేవ చేయవలెనే కాని సన్యాసియై తన దారి తాను వెతుక్కోవడం సంఘద్రోహంగా ఆయన పరిగణించాడు. లింగధారి నిత్యమూ షట్కాల శివపూజారతుడు కావడం వల్ల, తానుచేసే ప్రతిపనీ శివా ర్పణబుద్ధితో చేయడంవల్ల అతడు గృహస్థ సన్యాసి. అతడు కర్మ క్షయమై శివసాయుజ్యం అతనికి కరతలామలకం. అనేకులు

తమను జగమును మరచి నేనే బ్రహ్మనని భావిస్తారు. శివాద్వైతులు యోగస్థితిలో ఉండి కూడా తానూ, జగమూ సత్యములేనని మరవకుండానే భ్రమర కీటన్యాయం చేత నిరంతరం, 'శివోహం' అని భావిస్తూ శివునికన్నా భిన్నుడైనప్పటికీ శివుడే అవుతాడన్న శ్రీ శివాచార్యుల వచనాన్ని మరింత స్పష్టంచేసి ఆరాధ్య సంప్రదాయాన్ని సుప్రతిష్ఠితం చేశాడు.

బసవేశ్వరుడు వర్ణాశ్రమ ధర్మాలను త్రోసిపుచ్చి అందరూ ఒకటేనని చాటాడు. ఆరాధ్యులు వర్ణాశ్రమ ధర్మాల పాలించటం తప్పనిసరి. ఇందువల్ల కలిగే ఇబ్బందులను గమనించి ఆరాధ్యులు త్రిలోక గురువులని, వారి శిష్యగణం ఏవర్ణం వారైనా, తమ తమ ఆశ్రమ ధర్మాలను అనుసరిస్తూనే అందరూ ఏకవాక్యత కలిగి ఉండవచ్చని పండితుడు తన సంప్రదాయాన్ని తీర్చిదిద్దాడు.

పండితునకన్నా ముందు "ఆరాధ్య" శబ్దం పూజనీయుడనే సామాన్యార్థంలో ప్రయోగింపబడింది. పండితుని కాలంనుండి శివాద్వైతులకు పర్యాయపదంగా జాతివాచకంగా ప్రయుక్తమైంది.

12వ శతాబ్దంనుండి ఈ నాటివరకూ ఆరాధ్యశైవ సంప్రదాయం ఆంధ్రదేశపు మత, సాంఘిక, ఆర్థిక, రాజకీయ, నైతిక జీవనరంగాలలో ఒక భాగంగా కలసిపోయి పరిఢవిల్లుతున్నది.

"శ్రీ కంఠోక్త శివాగమాది విధినా పంచాక్షరీ దీక్షితః
లింగాంగే నిజవర్ణ ధర్మ సహితః షట్కాల పూజాపరః
భస్మోద్యావరణాష్టకాది నిరతః శ్రీకంఠ సిద్ధాంత భాక్
వైరాగ్యాది చతుష్టయాన్వితమనాః ఆరాధ్యతే కీర్తితమ్!"

—చాటువు

## ఉపయుక్త గ్రంథ సూచి :


1. శ్రీ నీలకంఠ భగవత్పాద ప్రణీత బ్రహ్మసూత్ర భాష్యమ్.
2. మత వినోద చర్య
3. బసవపురాణ పీఠికా విమర్శనము.
4. శివాద్వైత పథవిధి.
5. శైవసర్వస్వము.
6. శివాద్వైత సిద్ధాంతము.
7. బసవేశ్వరుని వచనములు.
8. పండితారాధ్య చరిత్ర.
9. మతత్రియమ్.
10 శైవపంచకమ్.
11. శివజ్యోతి—సంచికలు 1-2.
.2 శ్రీబసవేశ్వర కమ్మెమొరేషన్ వాల్యూమ్.
13. శ్రీ బసవేశ్వర అండ్ హిజ్ టయిమ్స్.
14. శైవిజమ్ త్రూ ది ఏజెస్.
15. అరిజిన్ ఎండ్ ఎర్లీహిస్టరీ ఆఫ్ శైవిజమ్ ఇన్ సౌత్ ఇండియా.
16. ది శివాద్వైత ఆఫ్ శ్రీ కంఠ.
17. శివజ్ఞానశేఖరే —ద్వితీయభాగః.
18. లింగధారణ దీపికా.
19. వేదాంతార్థ పరిష్కారతారహారము. శ్రీమున్నంగి పున్నయ పంతులుగారి అనువాదము.
20. శివతత్త్వసారము—శ్రీ నిడుదవోలువారి పీఠికతో.
21. వైష్ణవ్, శైవ్ అవుర్ అన్య ధార్మిక దర్మన్.


[పై గ్రంథకర్తలకు కృతజ్ఞతా పూర్వక శివాభివందనల

—వ్యాసకర్త

# “……………ఉన్న-నాలో……………!”

శ్రీ కే. కిశోరుబాబు
శ్రీ కే. అశోకుబాబు

క్షుసికిపొట్లని పిలుస్తూ
మాఱు మూలలోని వృక్షంలాగా

“అలసునిగా ఉన్న నాలో”
కర్ణ పర్వంగా
నానా రుచిరార్థసూక్తుల్ని పోహణించిన
పులుగుల కూజితాల్ని
వినిపిస్తూ
మేల్కనింప జేస్తుంటుంది!
పాచిని నెమరేస్తూ
జీబుటడవిలోని గుంటలాగా

“మందునిగా ఉన్న నాలో”
తిన్నగా
చిరుచిరు తరగలకాహళికల్ని
సంధిస్తూ
నవ్య చైతన్యాన్ని చెలరేగింప జేస్తుంటుంది!
కుట్టుసురుతో జీవిస్తూ
కుదిపలోని విత్తనంలాగా

“తెవులుగొంటుగా ఉన్న నాలో”
ఒడుపుగా
ఒనరయిన ఆకుపచ్చటి మొక్కను
పుట్టింపజేసి
అనామయంగా మన్నింప జేస్తుంటుంది!
జడత్వాన్ని చప్పరిస్తూ
గరకట్టుకొని
వలిదిబ్బలాగా

“కఠోరునిగా ఉన్న నాలో”
లీలగా
ఉవ్యగంగల్ని దొర్లింప జేస్తుంటుంది!
విన్నదనాన్ని ఉమ్మివేస్తూ
వెలది వెన్నెలకి దూరమైన కలుహారంలాగా

“నిస్త్రాణునిగా ఉన్న నాలో”
వాసిగా
సుగంధ కుశేశయాల్ని
విరియ బండింప జేస్తుంటుంది!
నిశ్చేతనాన్ని ప్రతిబింబిస్తూ
రేవు పొంతలోని
పిండీకృతశాటిలాగా

“లొద్దగా ఉన్న నాలో”
వడివడిగా
బాతువుల్ని
ఎగురింప జేస్తూ
శాలిగోపికల విహాసితాల్ని
దొరియింప జేస్తుంటుంది!

“కవితా సుందరి శింజ!”

అవి
కటుకయిన, చుఱుకయిన
తెగువయిన, పదునయిన
స్నిగ్ధమయిన, ముగ్ధమయిన
సూర్యకిరణం!

అది
స్వచ్ఛమయిన, రుచిరమైన
మృదులమయిన, లలితమైన
భవ్యకరమయిన,
కళ్యాణదాయకమైన
సూర్యకిరణం!

అది
తెల్లనయిన
ఎఱ్ఱనయిన
చిత్రమైన సూర్యకిరణం!
అది

“అంధకునిగా ఉన్న నాలో”
ఎప్పుడూ
“పొద్దును” పసరింప జేస్తూనే ఉంటుంది!
పటువణింప జేస్తూనే ఉంటుంది!
“తేజోమూర్తిని” కూరుతూనే ఉంటుంది!
దోగాడింప జేస్తూనే ఉంటుంది!

Printed and Published for Nageswara Rao Estate Private Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247

శ్రీరస్తు - శ్రీ త్రిపురసుందరీ పరశివాభ్యాం నమః

# శ్రీ రుధిరోద్గారి నామ సంవత్సర పూర్ణశాస్త్రీయ (ఆంధ్రపత్రికా) పంచాంగమ్

బ్రహ్మశ్రీ శ్రీమత్పిడపర్తి సుబ్రహ్మణ్యశాస్త్రిణః పుత్రాభ్యాం

"దైవజ్ఞ చిన్తామణి" శ్రీ చినకృష్ణమూర్తి శాస్త్రి, "భాషాప్రవీణ" శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిభ్యాం ప్రణీతమ్

సహరచయితారశ్చిరంజీవినః శ్రీ పూర్ణకల్యాణవీరభద్రశర్మా - శ్రీ వీరేశ్వరశాస్త్రి ప్రభృతయశ్చ

విఘ్నేశ విధిమార్తాండ చంద్రేంద్రోపేన్ద్ర వందిత నమో గణపతే తుభ్యం బ్రహ్మణాం బ్రహ్మణస్పతే.
వేదమయీం నాదమయీం బిందుమయీం పరపదోద్య దిందుమయీం
మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీం.

## సంవత్సర ఫలము

సంవత్సరమున రాజు, మంత్రి గురుడు. రసాధిపతి చంద్రుడు. సేనాధిపతి, అర్ఘాధిపతి, మేఘాధిపతి బుధుడు. ధాన్యాధిపతి శుక్రుడు. సస్యాధిపతి, నీరసాధిపతి శని. ఇట్లు నవ నాయకులలో 7 ఆధిపత్యములు, 30 ఆధిపత్యములలో 22 ఆధిపత్యములు శుభులకయినవి. సర్వసస్య సముదాయమగు 16 వీసములలో 7½ వీసముల పంట ఫలించును. తొలకరి పంటలు వర్లపు భూములు ఫలించును. పశు పాలకుడు శ్రీకృష్ణుడు. పశువులను దొడ్డి పెట్టువాడు యముడు. దొడ్డినుండి విడిపించువాడు బలరాముడు. వాలుగు కుంచముల వర్షము. వత్సరాది ప్రభృ॥ భాద్రపద బ ౯ శు॥ పర్యంతం గొల్లపిల్లవాని చేతియందు, తదాది మార్గశిర బ ౯ బుధవార పర్యంతం యువక గోపహస్తమందును, తదాద్యా



వత్సరం మునలి గొల్లవాని చేతియందు కుంచ ముండును. పశువులకు స్వల్ప అనారోగ్యము తృణ సస్యసమృద్ధి, క్షీర సమృద్ధియు కలుగును. వల్ల సస్యములు తెల్ల ధాన్యములు ఫలించును. శ్రావణ శు ౭ సోమ ప్ర॥ బ ౨ సోమ॥ పర్యంతము శుక్ర మౌఢ్యము. కార్తిక బ ౧౨ గురు॥ ప్ర॥ మార్గశిర బ ౮ మంగ॥ పర్యంతం గురు మౌఢ్యము. వైశాఖ బ 30 స్థి శనివారం సంభవించు సూర్యగ్రహణము మదరాసునకు దక్షిణ దేశముల యందు సంభవించును. మార్గశిర బ 3 గురువారం సార్ధ త్రికోటి తీర్థ సహిత పుష్కరిణీ నది పుష్కర ప్రారంభం.

## శకములు

| | |
|---|---|
| కల్యబ్దాః ౫౦౮౫ | శాలివాహన శకః ౧౯౦౫ |
| ఫసలీసన్ ౧౩౯౧-౯౨ | హిజరీసన్ ౧౪౦౩-౧౪౦౪ |
| క్రీస్తుశకము 1983-1984 | భారత స్వాతంత్ర్యశకం 36-37 |

## ఆంధ్రపత్రికా కార్యాలయము, గాంధీనగరం, విజయవాడ-3

### పంచాంగ పద్ధతి వివరణము

ఇందు కాలమానము యథాప్రకారముగా విజయవాడ, గుంటూరు, ఏలూరు మొదలగు ఆంధ్ర ప్రదేశ్ మధ్యభాగమునకు చూపబడినది. తిథి, నక్షత్రములు ఘటికలలోను, గంటలలోను కూడ చూపబడినవి. శుభ ముహూర్తములు—దుర్ముహూర్తములు—వర్జ్యములు—మహోపాతలు గంటలలో మాత్రం చూపబడినవి. యోగకరణ, అమృత, గ్రహ ప్రవేశములు ఘటికలలో మాత్రం చూపబడినవి. భారత ప్రభుత్వముచే నియమింపబడిన కాలెండరు రిఫార్మ్ కమిటీవారి నిర్ణయము ననుసరించి ప్రకటింపబడిన ఇండియన్ ఎఫెమెరిసు అండ్ నాటికల్ అల్మనాక్కునకు సరిపడునట్లు చూపబడినవి. నూతన వేధశాలల యందు కనుగొనబడిన భూకేంద్రమునకు సరిపడు వాస్తవిక రవి చంద్రులచే సాధింపబడిన తిథ్యాదికము, గ్రహచారము చూపబడినవి. ఈ తిథ్యాది గ్రహ సంచారములే పంచాంగమున వ్రాసినట్లు ఆకసమున సరిపడుచున్నవి. ఇందు తిథ్యాది, ఘటికలు, ఉదయాస్తమయములు, శుభ ముహూర్తములు, దుర్ముహూర్తములు, లగ్నాంతకాలములు, విజయవాడ, గుంటూరు, ఏలూరు ప్రాంతములకు చూపబడినవి. నిరయణ స్ఫుటగ్రహములు ఇండియన్ స్టాండర్డు టయిము ననుసరించి గం.5-29 ని. లకు చూపబడినది. దేశాంతర చక్రములును చూపబడినవి. ఇందు వేదాంగ జ్యోతిషమున సూచింపబడిన అశ్విన్యాదిని గ్రహించి ఈ పంచాంగ రచన చేసియున్నాము గావున వైదికము సనాతనము గూడ యగుచున్నది. 10 అక్షాంశ లగాయతు 30 అక్షాంశ వరకు లగ్న ప్రమాణములు యివ్వబడినవి. శాస్త్రమునకు ప్రత్యక్షమునకు సముచితమై యొప్పు ఈ పంచాంగమును గ్రహించి శ్రౌతస్మార్త కర్మం నాచరింప గోరుచున్నాము.

## తిథ్యాదికమునందు దేశాంతర చక్రము

| | చైత్ర మేష | వైశాఖ వృషభ | జ్యేష్ఠ మిధున | ఆషాఢ కర్కాట | శ్రావణ సింహ | భాద్ర కన్యా | ఆశ్వీజ తులా | కార్తిక వృశ్చిక | మార్గశిర ధను | పౌష మకర | మాఘ కుంభ | ఫాల్గున మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మైసూరు | —౩౯ | —౪౯ | —౫౬ | —౫౯ | —౫౬ | —౪౯ | —౩౯ | —౩౦ | —౨౩ | —౨౦ | —౨౩ | —౩౦ |
| బెంగుళూరు | —౩౦ | —౩౭ | —౪౪ | —౪౮ | —౪౪ | —౩౭ | —౩౦ | —౨౨ | —౧౬ | —౧౪ | —౧౬ | —౨౨ |
| అనంతపురం | —౩౦ | —౩౪ | —౩౮ | —౩౯ | —౩౮ | —౩౪ | —౩౦ | —౨౬ | —౨౩ | —౨౧ | —౨౩ | —౨౬ |
| బళ్ళారి | —౩౮ | —౪౦ | —౪౩ | —౪౪ | —౪౩ | —౪౦ | —౩౮ | —౩౪ | —౩౨ | —౩౧ | —౩౨ | —౩౪ |
| కర్నూలు | —౨౬ | —౨౮ | —౨౭ | —౨౯ | —౨౭ | —౨౮ | —౨౬ | —౨౪ | —౨౩ | —౨౨ | +౨౩ | —౨౪ |
| హైదరాబాద్ | —౨౧ | —౨౦ | —౧౭ | —౧౭ | —౧౭ | —౨౦ | —౨౧ | —౨౩ | —౨౫ | —౨౫ | —౨౫ | —౨౩ |
| వరంగల్లు | —౧౦ | — ౮ | — ౪ | — ౩ | — ౪ | — ౮ | —౧౦ | —౧౩ | —౧౬ | —౧౮ | —౧౬ | —౧౩ |
| తిరుపతి | —౧౩ | —౧౯ | —౨౪ | —౨౮ | —౨౪ | —౧౯ | —౧౩ | — ౮ | — ౨ | + ౦ | — ౨ | — ౮ |
| నెల్లూరు | — ౬ | —౧౧ | —౧౪ | —౧౬ | —౧౪ | —౧౧ | — ౬ | — ౨ | + ౨ | + ౪ | + ౨ | ౨ |
| కుంభకోణం | —౧౨ | —౨౪ | ౩౪ | —౩౭ | —౩౪ | —౨౪ | —౧౨ | — ౦ | + ౯ | +౧౩ | + ౯ | — ౦ |
| కాంచీపురం | — ౯ | —౧౮ | —౨౪ | —౨౬ | —౨౪ | —౧౮ | — ౯ | — ౧ | + ౬ | + ౭ | +౬ | — ౧ |
| మద్రాస్ | — ౪ | —౧౧ | —౧౮ | —౨౦ | —౧౮ | —౧౧ | — ౪ | + ౪ | +౧౦ | +౧౨ | +౧౦ | + ౪ |
| భద్రాచలం | + ౩ | + ౫ | + ౮ | + ౭ | + ౮ | + ౫ | + ౩ | + ౦ | — ౨ | —౩ | — ౨ | + ౦ |
| బందరు | + ౫ | + ౫ | + ౪ | + ౪ | + ౪ | + ౫ | + ౫ | + ౬ | + ౮ | + ౮ | + ౮ | + ౬ |
| రాజమండ్రి | + ౧౧ | +౧౩ | +౧౩ | +౧౪ | +౧౩ | +౧౩ | +౧౧ | +౧౦ | + ౯ | + ౯ | + ౯ | +౧౦ |
| విజయనగరం | + ౨౭ | +౩౨ | +౩౪ | +౩౬ | +౩౪ | +౩౨ | +౨౭ | +౨౪ | +౨౧ | +౨౦ | +౨౧ | +౨౪ |
| బరహంపురం | + ౪౨ | +౪౭ | +౫౩ | +౫౫ | +౫౩ | +౪౭ | +౪౨ | +౩౬ | +౩౧ | +౨౯ | +౩౧ | +౩౬ |

### సూచన

విజయవాడ నుండి భారత ప్రభుత్వము వారిచే నిర్ణయింప బడిన చైత్రాది మాసారంభము (అనగా మేషాది సాయన మాసారంభము). యందు కలుగు దేశాంతర విఘటికలు యీ పై చక్రమునందు చూపబడినవి. స్వగ్రామమునకు సమీపమందున్న పట్టణమునకు అభీష్ట మాసాదియందు గల విఘటికలను యీ చక్రమునసరించి విజయవాడకు పశ్చిమ దేశములయందుండు వారు యీ పంచాంగ మందలి తిథ్యాదులలో తీసివేయగాను, ప్రాగ్దేశములవారు కలుపగాను స్వస్థానమునకు సూర్యోదయాది తిథ్యాది కాలము లగుచున్నవి. యీ విజయవాడ యామ్యోత్తర రేఖకు సమీపమందుగల దక్షిణోత్తరదేశముల వారు ఇందు ఆయా మాసములలో చూపిన + ధన — రుణ చిహ్నలను గుర్తించి సంస్కరించుకొన వలయును. ఇందుచూపిన విఘడియలు మాసాదియందు చూపబడినవి. మాసమధ్యయందు త్రైరాశికముచే దేశాంతరమును గ్రహించి సంస్కరించినచో సూర్యోదయాది స్ఫుటతిథ్యాది కాలములగును. ఇష్టగ్రామమునకు సూర్యోదయ గంటలు పై ప్రకారము దేశాంతర విఘటికల కగు నిమిషములను ఈ విజయవాడ కగు సూర్యోదయ గంటలలో ధనరుణ చిహ్నలకు వ్యత్యస్తముగా (అనగా విజయవాడకు పశ్చిమ దేశమందుండు వారు కలుపగను, ప్రాగ్దేశవాసులు (తీసివేయ గను) సంస్కరించిన యెడల స్టాండర్డ్ టైము ననుసరించి ఇష్ట గ్రామమునకు సూర్యోదయ గంటలగును; ఈ ప్రకారము సూర్యాస్తమయ కాలమును చేయరాదు.

## లగ్నాంతకాలములయందు దేశాంతర చక్రము

| | మీన | మేష | వృష | మిధు | కర్క | సింహ | కన్య | తుల | వృశ్చి | ధను | మక | కుంభ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మైసూరు | +19 | +22 | +24 | +23 | +20 | +17 | +13 | +10 | + 8 | + 4 | +11 | +15 |
| బెంగుళూరు | +14 | +17 | +19 | +18 | +16 | +13 | +10 | + 7 | + 5 | + 6 | + 8 | +11 |
| అనంతపురం | +13 | +15 | +15 | +15 | +14 | +12 | +11 | + 9 | + 2 | + 9 | +10 | +11 |
| బళ్ళారి | +16 | +17 | +17 | +17 | +16 | +15 | +14 | +13 | +12 | +13 | +13 | +15 |
| కర్నూలు | +11 | +11 | +12 | +11 | +11 | +10 | +10 | + 9 | + 9 | + 1 | +10 | +10 |
| హైదరాబాదు | + 8 | + 7 | + 7 | + 7 | + 8 | + 8 | + 9 | +10 | +10 | +10 | + 9 | + 9 |
| వరంగల్లు | + 3 | + 2 | + 3 | + 1 | + 2 | + 4 | + 5 | + 6 | + 7 | + 6 | + 5 | + 4 |
| తిరుపతి | + 7 | + 9 | +11 | +10 | + 8 | + 6 | + 3 | + 1 | — 0 | + 0 | + 2 | + 5 |
| నెల్లూరు | + 4 | + 5 | + 6 | + 6 | + 5 | + 3 | + 1 | — 1 | — 1 | — 1 | + 0 | + 2 |
| మదరాసు | + 4 | + 6 | + 8 | + 7 | + 5 | + 2 | + 1 | — 4 | — 5 | — 4 | — 2 | + 1 |
| కుంభకోణం | + 9 | +13 | +15 | +14 | +11 | + 6 | + 1 | — 3 | — 5 | — 4 | — 1 | + 4 |
| కాంచీపురం | + 6 | + 9 | +10 | +10 | + 7 | + 4 | + 1 | — 2 | — 3 | — 3 | — 0 | + 3 |
| భద్రాచలం | — 2 | — 3 | — 3 | — 3 | — 2 | — 1 | — 0 | + 1 | + 1 | + 1 | + 0 | — 1 |
| బందరు | — 2 | — 2 | — 2 | — 2 | — 2 | — 2 | — 2 | — 3 | — 3 | — 3 | — 3 | — 2 |
| రాజమండ్రి | — 5 | — 5 | — 5 | — 5 | — 5 | — 5 | — 4 | — 4 | — 4 | — 4 | — 4 | — 4 |
| విజయనగరం | —12 | —14 | —14 | —14 | —13 | —12 | —10 | — 9 | — 8 | — 8 | — 9 | —11 |
| బరహంపురం | —19 | —21 | —22 | —22 | —20 | —17 | —15 | —13 | —11 | —12 | —14 | —16 |

ఇందు చూపబడిన లగ్నాంతకాలములు స్టాండర్డు టైము ననుసరించి విజయవాడకు లగ్నాంతకాలము లగుచున్నవి. ఇతర దేశముల వారు ఈ చూపబడిన దేశాంతర చక్రము ననుసరించి, ఆయా లగ్నాంత కాలములకు చూప బడిన నిమిషములను, విజయవాడకు పశ్చిమదేశమున నుండువారలు ఆ యా కాలములలో కలుపగాను, ప్రాగ్దేశములయందుండువారు తీసివేయగను, స్టాండర్డు టైమునననుసరించి ఇష్టమగు వాయా నగరములకు లగ్నాంత కాలము లగును. తిథులలో ప్రతిమాసము దిగువను ప్రతిరోజున లగ్నాంత కాలములు చూపబడినవి.

